# శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

(ఆదర్శప్రాయుఁడగు నొక గృహస్థుని జీవితము)




శ్రీ రామకృష్ణ మఠము
మైలాపూరు :: మద్రాసు.

# విజ్ఞప్తి

శ్రీ రామకృష్ణ పరమహంసయొక్క గృహస్థ శిష్యులలో శ్రీ దుర్గాచరణ నాగమహాశయుఁ డుత్తమగణ్యుఁడు. గృహస్థ ధర్మమును నిర్వర్తించుచు పారమార్థిక జీవితము నందు అత్యుత్తమ స్థితిని పొంది ఈతఁ డెల్లరకును ఆదర్శ ప్రాయుఁ డాయెను. అట్టి ఈతని జీవితము ఈకాలమున నందఱకును మార్గదర్శకమై అవశ్య పఠనీయముగ నున్నది.

ఈతని జీవితమును మొదట వంగభాషయందు వ్రాసిరి. తరువాత ఆంగ్లమునందు అనువదించిరి. ఇంకను ఇతర భాషలయందును వెలువడియున్నది. శ్రీయుత గోటేటి సత్యనారాయణమూర్తిగారు దీనిని ఆంధ్రులకు అందఁ జేయుటకై తెలుఁగున వ్రాసి మాకిచ్చిరి. వీరికి వంగ, ఆంగ్లభాషలయందు రెండిటను పాండిత్యమున్నందున వీరీ జీవితమును వ్రాయఁబూనుట యెంతయు సమంజసము. వీరికి మే మెంతయు కృతజ్ఞులము. ఈ జీవితమును జదివి ధన్యత నొందఁబోవు ఆంధ్రులందఱును గూడ కృతజ్ఞులై యుండఁ గలరు.

ఈ గ్రంథము (ప్రథమ ముద్రణము)ను విశ్వదాత లును, దేశోద్ధారకులును అగు శ్రీ. కాశీనాథుని నాగేశ్వర

రావు పంతులుగారు స్వకీయ ఆంధ్రపత్రికా ముద్రాక్షరశాల యందు ఉచితముగ ముద్రించిరి. వీరి దాతృత్వము లోక విదితము. వీరికి మా కృతజ్ఞతాపూర్వక వందనములు.

ఇట్టి మహనీయుల జీవితములయందు అమానుష చర్యలు సాధారణముగా కానవగును. అట్టి విషయము లను మేము ప్రమాణపూర్వకముగనే గ్రహించితిమని పాఠకులకు విన్నవించుచున్నాము.

ప్రకాశకులు

శ్రీ రామాభ్యోన్నమః

# శ్రీనాగమహాశయుని జీవిత చరిత్రము

## బాల్యము

ఏమహాత్ముని జీవనవృత్తాంత మిందు లిఖింపఁబడియున్నదో యాయ నను గూర్చి పూజ్యపాదులగు వివేకానందస్వామి యిట్లు నుడువుచున్నారు: "ప్రపంచమునం దనేక స్థలముల్లను దర్శించితిని గాని నాగమహాశయుల వంటి మహాపురుషుని ఎచ్చటను గాంచనైతిని".

వంగరాష్ట్రమునకుఁ దూర్పున నారాయణగంజి యను నోడరేవుండెను. దాని కొకింత పశ్చిమముగా సుమారు రెండుమైళ్ల దూరమున దియోబాగను చిన్నగ్రామము కలదు. అందు దీనదయాళను శూద్రకులజుఁ డొకఁడు తన సహధర్మిణియు సుగుణాల గనియు నగు త్రిపురసుందరితో నివసించు చుండెను. పూర్వము వీరి వంశజులు తిలారది యను గ్రామమున నుండువారు; కాని రెండు మూఁడు తరములనుండి దియోబాగునందే స్థిర నివాస మేర్పరచుకొనిరి.

దీనదయాళుని తండ్రి ప్రాణకృష్ణుఁడు. తల్లి రుక్మిణి. దీనదయాళున కిర్వురు అక్కసెల్లెండ్రు. అందు పెద్దయామె యగు భగవతికి బాల్యావస్థ యందే వైధవ్యము సంప్రాప్తింప నామె తన జీవితావశేషమంతయు సోద రుని యింటియందే గడపెను. ద్వితీయయగు భారతిని గూర్చి, యంత ముఖ్యాంశ మేమియుఁ దెలియదు. ఆమె పుట్టినింటి కెన్నఁడును బోయి యెఱుఁగదు. సోదరికంటె నీమెయే ముందు గతించినది.

దీనదయాళు పూర్వాచార పరాయణుఁడు, కర్మిష్ఠి. దేవ బ్రాహ్మ ణులన్న సమిత గౌరవముఁ జూపుచు నూరియందందరికిని మిత్రుఁడై యుండెను. ఈతనికి కుమార్తులీ లో నొక పెంకుటిల్లు దప్ప నొండాస్తి

యేదియులేదు. అందువలనఁ గుటుంబ పోషణార్థమై, కుమార్తులీవాసులగు "మెస్సర్సు రాజకుమార్ హరిచరణపాల్ చౌదరీ" వారి కంపెనీలో కొలఁది వేతనమునకుఁ బ్రవేశించెను.

"పాలులు" దీనదయాళు నొక మామూలు సేవకునివలెఁ గాక తమ కుటుంబములోని వానిగ నాదరించుచుండిరి. ధర్మభీరువు, సత్యనిష్ఠుడు, నిర్లోభి, యగు నాతనియెడ వారెంతయో విశ్వాసముఁ గలవారై యుండిరి. అప్పుడప్పుడు తామిచ్చెడు పైకములకు అతని నెన్నఁడును జమాఖర్చు లెక్కలను జెప్పుమని వారడుగలేదు. ఒకసారి వేయిరూపాయిలు జమ తేలలేదు. వారామొత్తమునంతయు ఖర్చుక్రింద చూపుమనిరి. తరువాత నొక సంవత్సరమునకు దాని నిజస్థితి తెలిసి దీనదయాళునకిందు సంబంధము లేనట్లు తెల్లమయ్యెను. అప్పటినుండి యాతనియెడనింకను నమ్మిక వృద్ధి పొంద వారాతని యార్థికస్థితికిఁ దోడ్పడుచుండిరి. ఇట్టిదింకొక సంగతి మఱిట బొందుపరచుచో ఈతని నిర్లోభత్వము తేఁటపడఁగలదు.

మెస్సర్సు పాలు లుప్పువ్యాపారముగూడఁ జేయుచుండిరి. అందు వలన నప్పు డప్పు డుప్పును నారాయణగంజి కెగుమతి చేయుదురు. కలకత్తానుండి నారాయణగంజికిఁ బోవు మార్గము సుందరవన మను దుర్గమారణ్యము ద్వారా పోవును, మార్గమధ్యమున దోపిడిగాండ్ర బాధ మిక్కుటముగ నుండెను. దానఁజేసి ధీరుఁడును విశ్వాసపాత్రుఁడునగు నొకనిని సరకుతోఁ బంపుచుండిరి.

ఒకసారి దీనదయాళు ఈపనియందు నియోగింపఁబడెను. ఈతఁడు సుందరవనములోఁ బ్రవేశించెను. కాని నిరపాయమగు స్థలమింకను జేర లేదు. చిమ్మచీఁకట్లు నల్గడలఁ గ్రమ్మెను. అందువలన దీనదయాళిఁక ముందుకు సాగుట యపాయకరమని యెంచి, సామీప్యమున నొక పెద్ద పాడు వడిన గృహమును, కృషీవలుల గుడిసెలను రెంటినిజూచి యచ్చట పడవ లకు లంగరు వేయ నాజ్ఞాపించెను.

పడవకళాసు లందరును భోజనముఁగావించి, నిద్రఁజెందిరి. కాని దీనదయాళు మాత్రము చేతనొక కఱ్ఱఁబట్టుకొని పాగ్రత్తాగుచు రాత్రి యంత

యుం గడపెను. తెల్లవారుట వేగుంజుక్క సూచించెను. ఐదు గంటలాయెను. ప్రభాత మల్లనల్లన సమీపించుచుండెను. అంత దీనదయాళు పడవం దిగి యా పాడుగృహమున కలసటం దీర్చుకొనుట కేగెను. రాత్రి యంతయు మేల్కొని యుంటచే నేమియుం దోంచక నొకచో వ్రేళ్లతో భూమిని గీయు చుండెను. లోపలనేదియో యొక నాణెమున్నట్లు అతని కనుమానమాయెను. అంత సంభ్రమముతోం గొంత మట్టిని దీసిచూడ దన యనుమానము వ్యర్థము కాలేదనుకొనెను. వానిం బరీక్షింప నవి పూర్వపు నాణెములవలెం గన్పట్టెను. కాని యింతలో "ఓయీ! యాశాబద్ధుండవు గాకుము, బ్రాహ్మణవిత్తమును విషతుల్యముగం జూడవలయును. ఈ ధనమొక బ్రాహ్మణునిదే యైనచో నరక మనుభవింప వలయు" నని తన యంతరాత్మ యుద్బోధించు చున్న ట్లాతనికిం దట్టెను. మరుక్షణముననే యా నాణెముల యథాప్రకారముగ భూమిలోం బూడ్చి పడవనెక్కి కళాసులకు నిమిషమాత్ర కాలమైనను గడు వీయక లంగరు వదలించెను.

ఇట్లు తన జీవితమును నైతికముగను, పరులకాదర్శముగను గడపుచు సోదరితోడను, భార్యతోడను సుఖముగాం గాలము గడుపుచుండం గొన్ని నాళ్లకుం, ద్రిపురసుందరి గర్భవతి యయ్యెను. అంత నామె నవమాసములు మోసి B. S. 1253 భాద్రపద శుక్లపాడ్యమీ శుక్రవారమునాం డనంగా క్రీ॥ శ॥ 1846 వ సంవత్సరమున ఆగష్టు 21 వ తేదిని శుభకరమగు సింహలగ్నమున పూర్ణచంద్ర నిభుండగు నొక పురుష శిశువుం గనెను. పుత్రుని జననమునం దలిదండ్రులు సంతోషమునం గాన్కలర్పించి యిరు వదియొకటవ దినమున నా బాలునికి "దుర్గాచరణ నాగ" అని నామ కరణముం జేసిరి.

బాలుని సంపూర్ణనామము దుర్గాచరణుం డైనను, పెక్కుర కీతండు నాగమహాశయనామముననే సుపరిచితుండగుటంబట్టి ఈగ్రంథమునంగూడ "నాగమహాశయుం" డనియే వ్రాయంబడియున్నది.

నాగమహాశయుని యనంతరమున దీనదయాళున కిర్వురు కొమరి తలు నొక కొమరుండును గలిగిరి. కాని దుర్గాచరణుని యనంతర జన్మిని

యగు శరదామిని దక్కఁ దక్కిన యిర్వురును చిన్నతనముననే చనిపోయిరి. త్రిపురసుందరియుఁ గొమరుని గుణకీర్తుల విని యానందించెడు నోము నోఁచుకొనక చిన్ని కొమరుని పురిటియందే కాలగతి నందెను.

జనని మరణించునరికి దుర్గాచరణుఁ డెనిమిది వర్షములును, శరదామిని నాల్గువర్షములును ప్రాయము గలిగియుండిరి. దీనదయాళు పునర్వివాహముఁ జేసికొనుట కేమాత్రమును సంకల్పితుఁడు కాలేదు. అందువలనఁ గుఱ్ఱల సంరక్షణభారము సోదరియగు భగవతిపైఁబడెను. ఆమెయు మాతృవిహీనులగు నీ సోదరీ సోదరుల నత్యంతముఁ బ్రేమించుచుఁ దల్లి లేని లోటుఁ దీసివైచెను. ఇర్వురిలో దుర్గాచరణుఁడన్న నామె కమితమగు ప్రేమ. ఆ కారణముననే నాగమహాశయు 'లీ నా మేనత్త పూర్వజన్మమున నా జననియై యుండనోపు' ననువాఁడు.

నాగమహాశయుని బాల్యముఁ గూర్చి కొలఁది మాత్రమే తెలియును. అతఁడు మధుర వాచ్యుఁడనియు, సుశీలుఁడనియు, వినీతుఁడనియు మాత్ర మైతిహ్యమై యుండెను. ఆరోగ్యవంతమై పుష్టికరమగు నాతని కాయము చూపరుల కానందముఁ గొల్పుచుండెను. అతని వినీలకుంతలము లెంతటి వానినైనను ముగ్ధునిఁ జేయును. 'చేతులకు రెండు వెండి మురుగులు దక్కఁ దక్కొండు వస్తువేదియు లేకపోయినను ప్రకృతిసిద్ధమగు నాతని సౌందర్యము వస్తువులు లేని లోటుఁ గప్పిపుచ్చెడిది. చుట్టు ప్రక్కల నెవ్వరు చూచిన నొకసారి యెత్తికొని ముద్దిడక నుండరు.

సాయంసమయములందుఁ దన దృష్టులాకాశవీధికిఁ బరపి నక్షత్ర మండలముఁ జూచుచుఁ బ్రక్కనున్న మేనత్తను సంబోధించి "అమ్మా! మనమెందుల కా మండలమునకుఁ బోకూడదు? నా కిక్కడ నుండుట కెంతమాత్ర మిష్టము లే" దనును. చంద్రుఁ డాకాశమధ్యంగతుఁ డగు కొలఁదియు నుల్లాసముతోఁ జప్పటలు జరచును. చెట్లు గాలి కల్లలాడు నప్పు డవి దన్నుఁ బిలచుచున్నవని భావించి "అమ్మా! నేను వానితో నాడుకొందు" నని యవి నిజమైన యాటకాండ్రని వాని కదలికలఁ వా ననువదింపుచుండును.

మేనత్త యగు భగవతి పురాణగాథలఁ జెప్పుటలో మిగుల నేర్పరి. అనుదినమును బురాణములనుండి కథలనెత్తి చెప్పుచుండెడిది. ఒకవేళ భగవతి దేహమందలి రుగ్మతవలనఁగాని పనితొందరవలనఁగాని మరియే కారణము చేతనైనను కథఁ జెప్పుట మానినచో మహాశయు లామెను విసిగించి యొక చిన్న కథనైన వినకుండఁ బరుండువాఁడు కాఁడు. పరుండు నప్పుడీ కథలే స్ఫురణకు వచ్చుటచే వానినే కలగాంచును. ఒక్కొక్కప్పుడు దేవతావిగ్రహములను గాంచి యులికిపడి లేచును. గాని ప్రక్క, దినమెల్లను కష్టపడి అలసి మైమరచియున్న మేనత్తను లేప సాహసింపలేక తెల్లవారువర కామె ప్రక్కనే కూర్చొని ప్రొద్దుటఁ దాఁ గన్న కల తెరఁ గెఱింగించెడివాఁడు. భగవతి యది విని యాశ్చర్యమందెడిది.

పురాణప్రసిద్ధుఁడగు ప్రహ్లాదునివలె నాగమహాశయులుఁగూడ బాల్యము నుండియు నాటలయందు విరక్తి గల్గి యుండెను. కాని తన చెలికాండ్రను సంతోషపరచుటకై యప్పుడప్పు డాడును. ఆయన నొక్కమారైన నాట విషయమైగాని హాస్యమునకుఁగాని యనృతంబాడి యెఱుఁగఁడు. మఱియుఁ దన స్నేహితు లెవరైన నసత్యముఁ బల్కినచో తత్క్షణమే వారిని దన స్నేహిత బృందమునుండి తొలఁగించును. అతఁడు పశ్చాత్తప్తుఁడై ఇఁకనెన్నఁడును అనృతమాడనని ప్రతిజ్ఞ చేయువరకును అతనితో స్నేహముచేయువాఁడు కాఁడు. బాల్యమున ఎవ్వరితోడను కలహమాడి ఎఱుఁగఁడు. ఒక్కొకప్పు డాటలలో రెండు పక్షములకుఁ దాను మధ్యవర్తియై న్యాయాన్యాయ విచక్షణఁ జేయును. బాలు రీతని ప్రజ్ఞకు హర్షమంది తమ నాయకునిగఁ జూచువారు.

ఇట్లు నాగమహాశయులు పిన్నలకును బెద్దలకును తలలోని నాలుకయై బాల్యావస్థయొక్క యంత్యసోపాన మధిష్ఠింపఁ జొచ్చెను. వయోవృద్ధుఁడగుకొలఁదియు జ్ఞానసంపాదనాభిలాష వృద్ధి కాఁజొచ్చెను.

ఆకాలమున వంగరాష్ట్రమున నిప్పుడున్నన్ని పాఠశాలలు లేవు. నారాయణగంజిలో నొక బడి యుండెను. దీనిలో నాగమహాశయులు ప్రవేశపెట్టబడెను. కాని యా బడిలో మూఁడవ తరగతివరకు మాత్రమే యుండు

టచే పైకిఁ జదువుట కవకాశము లేదు. ఇది యాతని కెంతయు విచారకరముగ నుండెను. దుర్గాపూజాకాలమునఁ దండ్రి, యింటికి వచ్చినప్పుడు తాను కలకత్తాకుఁ బోయి చదువుకొందుననెను. కాని కుటుంబముయొక్క యార్థికస్థితి మిక్కిలి తక్కువగుటచే నా యుద్యమమున కాతఁడు స్వస్తి చెప్పవలసివచ్చెను.

ఆశాభంగమైనను పట్టుదల గలవాఁడగుటచే నాగమహాశయులు సమీపమున నేదేని పాఠశాలను వెదకి యచ్చటఁ బ్రవేశింపవలయునని తలంచెను. దియోబాగునకు పదిమైళ్ల దూరమున నొక పాఠశాల యున్నదని తెలిసి యచ్చటఁ జేరుటకు నిశ్చయించుకొనెను. మేనత్త కిది యిష్టము లేదు. మిగిలిన స్నేహితులును వలదని వారించిరి. అయినను వారి మాటల నరకుగొనక మరునాటి యుదయముననే దారి బత్తెముల కొక పిడికెడటుకులను దీసికొని ఢక్కాకుఁ బయనమయ్యెను. ఢక్కాలో నొక జాతీయపాఠశాలను (Normal School) గాంచి మగిడి గృహాభిముఖుఁడయ్యెను. ఇంటికిఁ జేరుసరికి చాల రాత్రియయ్యెను. అప్పటి కీతనికొర కెన్నిచోటులనో వెదకి భయభ్రాంతయై నిరీక్షించుచున్న భగవతి యాతనిఁ గాంచి సంతోషమునఁ భోజనమిడి యాతని యదృశ్యమునకు హేతువడిగెను. అంత నాతఁడు ప్రొద్దున లేచినది మొదలు జాతీయపాఠశాలఁ గాంచుట వరకు జరిగిన వృత్తాంతమును సాంగముగఁ జెప్పి "అమ్మా! రేఁపటినుండి ప్రతిదినమును జదువుకొనుటకు ఢక్కాకుఁ బోవలయును. కనుక నీవు ఉదయమున నెనిమిది గంటలకే వంట సిద్ధము చేయవలయు" ననెను. ఇట్టి నిశ్చయమును శ్రద్ధనుఁ జూచి యాశ్చర్యపడి "నాయనా! అటులనే చదువుకొని రమ్ము. మార్గమధ్యమున కష్టములు ప్రాప్తింపకుండ భగవంతుఁడు నిన్ను రక్షించుగాత!" మని దీవించెను.

మరుసటి ప్రాతఃకాలముననే నాగమహాశయులు ఢక్కాకుఁ బోయి పాఠశాలయందుఁ బ్రవేశించెను. ఈ పాఠశాలలో పదునేను మాసములు విద్య నభ్యసించెను. ఈ సంవత్సరము మూఁడుమాసములలో రెండుదినములు మాత్రమే బడికి హాజరుకాలేదు. ఎండకును వానకుఁ జలికిని సహించి

యోర్పుతో, పట్టుదలతో విద్య నభ్యసించెను. కాని యలసట యనునది గాని, విసుగనునది గాని యతని ముఖమున నెన్నఁడుఁ దోఁపలేదు. ఏ దినముననైన మార్గమధ్యమున నాఁకలిఁగొన్నచో నొకపైస యటుకులఁ గొని దారి పొడుగునఁ దినువాఁడు.

ఇట్లు ఢక్కానుండి గృహమునకు వచ్చునప్పు డొక్కొకప్పు డాతనికి భూతములు మొదలగునవి కాన్పించెడివి. దయ్యములు మొదలగువానిని గూర్చి యాతఁడిట్లు చెప్పువాఁడు :- "భూతప్రేతపిశాచాదులు మిథ్యలుకావు. ఎందువలనన ఠాకూరు (శ్రీరామకృష్ణ పరమహంస) అవన్నియు సత్యము లనువారు. నేను ఢక్కాకు నడచిపోవు దినములలో నొకనాఁడు గృహము నకు మరలి వచ్చుచుండ త్రోవలో, బాలునివలె నొకభూతము కాన్పించెను. ఆ భూతము సమీపముననున్న యొకపెద్ద రావిచెట్టున కానుకొని పశ్చిమ ముఖముగా నిలువఁబడి యుండెను. అసలు నేను అనుమానముతోను బెదరుతోను వచ్చుచుంటిని. దానిపై హఠాత్తుగా నిది కాన్పించెను. అందువల్ల కాళ్లు వడఁకఁ గూర్చొనిపోయితిని. కాని ఎంతసేపు చూచినను ఆ భూతము కదలలేదు. చివరకు 'నేను ఎవ్వరికిని అపకారము చేయ లేదు, మరి నాకెవ్వ రపకృతి నొనర్తురు ?' అని ధైర్యము తెచ్చుకొని నిలువఁ బడితిని. నెమ్మదిగ ముందునకు సాగితిని. అశ్వత్థవృక్షముక్రిందికే వచ్చితిని గాని నాకేమియు అగుపడలేదు. ఇంకను దగ్గరకుఁ బోయితిని. ఇంతలో నాకు వెనుక నొక భయానకాట్టహాసముతో నొక శబ్దము విననయ్యెను. కాని వెనుకకుఁ దిరిగి చూడలేదు. ఢక్కాకుఁ బోయివచ్చునప్పుడు రెండు మూఁడు సారు లాభూతము కన్పించెను, కాని ఈ వృత్తాంత మెవరికిని జెప్పలేదు. చిట్టచివరకుఁ జూడంజూడ నదికూడ మనుష్య దర్శనమువలెనే యైపోయెను".

ఈతని తదేక దీక్షకును, లేమికిని కడు జాలినంది యా పాఠశాలలోని యుపాధ్యాయుఁ డొకఁడు, దగ్గరకుఁ బిలిచి "నాయనా! నీ వనుదినమును బదిమైళ్లు నడచి వచ్చుచు మరల నింటికి నడచిపోవుచు నీ దేహారోగ్యము నకు భంగము కలిగించు కొనకుము. మా యింట నుండుము. నీకగు

ఖర్చుల నేనే భరింతు" ననెను. కాని ధీరుఁడగు నాతఁ "ఁయ్యా! యిచ్చటికి వచ్చి చదువుకొని పోవుటయం దెంత మాత్రమును కష్టములే" దనెను. ఈ పలుకుల కాశ్చర్యమంది యాతఁడొక యపూర్వపురుషుఁడై లోకమున కాదర్శప్రాయుఁడై యుండు ననుకొనెను. పాపమా యుపాధ్యాయుఁడింకను జీవించియుండిన దన సూచన వ్యర్థముకాలేదని తెలిసికొనియుండెడివాఁడు.

నాగమహాశయులు జాతీయ విద్యాలయములో కొలఁది కాలమే చదివెను. కాని యీ స్వల్పకాలములోనే బంగాళీ భాషను పూర్తిగ నభ్యసించెను. దస్తూరి ముద్దుల మూటగట్టుచుండెను. వ్యాసము లన్నియు సరళముగను భావయుక్తముగను నుండెడివి. ఆ కాలమున వ్రాసిన వ్యాసములన్నియు మతవిషయికములై యుండెను. తరువాత నాతఁడు వైద్యవిద్యాభ్యాసమునకుఁ గలకత్తాకు వచ్చినపు డావ్యాసములను "బాలుర కుపదేశ" మను శీర్షికక్రింద కరపత్రములవలె పంచిపెట్టెను.

కరపత్రములుగ పంచిపెట్టఁబడువరకు నవి వ్రాయఁబడిన ట్లెవరికినిఁ దెలియదు. చివరకు ప్రాణమిత్రుఁడైన రమేశచంద్ర దత్తుగూడ నవి ముద్రింపఁబడి యాతనికిఁ బంపఁబడువరకు నెఱుఁగఁడు.

విద్యాభ్యాసానంతరమునఁ బుస్తకము లన్నియు నూరి పిల్లలకుఁ బంచిపెట్టెను. ఇప్పటికిని దియోభాగునందు కొలఁది ప్రతులు లభింపఁగలవు.

నాగమహాశయునియొక్క పరమభక్తుఁడగు హరప్రసన్న మజుందారును, మహాశయుని భార్యయు, నాతని బాల్య జీవితమునందలి కొన్ని యంశములను గూర్చి యాతఁడు చెప్పగా వినిరి. వానిని వ్రాసి పత్రికా సంపాదకులకుఁ బంపుచు హరప్రసన్నుఁడు వ్రాసినలేఖ నిటఁ బొందుపరచుచున్నాము.

"నాగమహాశయుని బాల్యజీవనముఁ గూర్చి గాని యాతని జీవితమందలి మరి యే ఘటనను గూర్చిగాని నాకుఁ దెలియదు. వాని నెవ్వరును వ్రాసియుండలేదు. ఆయనతోడి పరిచయము లభించినప్పటినుండియు, వా కాయన యుపదేశ రూపకముగాఁ జెప్పియుండిన కొన్ని యంశములను

జ్ఞాపకార్థమై నేనొక పుస్తకమున వ్రాసియుంటిని. అందుఁ గొన్నిఁటిని మీ కోరికపై నిట వ్రాయుచున్నాను. అవి మీకుఁ గూడఁ దెలిసియే యుండును. కాని మీ అనురోధమును త్రోసిపుచ్చుటకు సాధ్యముకాలేదు. ఎందువలన నన మీరు ఆయనయొక్క ప్రియసంతానమని ఎఱుఁగుదును. ధర్మసంబంధమున నా సహాయమువలన, ఎవరికైనను ఉపకారము జరుగుచో, నేను ఏకాగ్రహృదయముతో, అకుంఠితచిత్తముతో అద్దాని నొనర్చుట కంగీకరింతును. దీనివలన నా స్వార్థమునకు భంగము వాటిల్లినను విషయసంపర్కమును విడువవలసి వచ్చినను, మీకు లేశ మాత్రమైన నుపకారము కలుగుచో, అప్పుడు నేను ధన్యుఁడనైతి ననుకొందును.

"సత్యకథనము విషయమై మహాశయు లాయన జీవితమందలి యొక ఘటన నిట్లు చెప్పెను :—ఒకపరి నాగమహాశయులు మిత్రులతో నాడుకొను నప్పుడు, తమ ఎదిరిపక్షమును గెల్చుటకు వారాతని నసత్య విషయమును చెప్పుమని బ్రతిమాలిరి. కాని యతఁ డంగీకరింపలేదు. దానిచే వీరిపక్ష మోడిపోయెను. అంత నాతని బాల్యస్నేహితులు క్రోధపరవశులై యాతని పంటభూములలోనికిఁ గొంపోయి యాతని కోమలాంగమును చితుకఁ గొట్టిరి. మహాశయుఁలప్పుడు పడిన బాధ జ్ఞప్తికి వచ్చుచో ఇప్పటికిని నా కశ్రువులు రాలును. ఇట్లకారణముగ నాతని మిత్రులు శిక్షించి "ఈమారు నీ సత్యకథనమువలన మా కోటమి గలుగుచో దీనికంటె నెక్కుడు శాస్తి చేయుదు" మనిరి. మహాశయులు రక్తాప్లుతకాయముతో గృహమును చేరుకొనెను. ఆతని తండ్రియు మేనత్తయు దానిఁగూర్చి యడిగిరి. కాని యిద్ది చెప్పుచో పొరుగువారితోఁ గలహములు సంప్రాప్తించునని యావంతయు ఎఱుకపరుపలేదు.

"13, 14 సంవత్సరముల వయస్సున ఆయన ఢక్కాలోని వైద్యకళాశాలలో ప్రవేశించెను. కాని శ్రద్ధేయ సురేశచంద్రదత్తు ఇట్లు చెప్పుచున్నాఁడు: 'ఈమాట సత్యము కాదు. నాగమహాశయులు కలకత్తాలో ఒకటిన్నర సంవత్సరములు క్యాంబెల్ వైద్యవిద్యాలయమున జదివెను. తరువాత హోమియోపతిని అభ్యసించెను. ఢక్కా నార్మల్ స్కూలునకు

పోవుచుండెను. కలకత్తాలో నాతో నాతనికిఁ బరిచయము కలిగినప్పటికి అతఁడు హెయిలీ వ్యాకరణమును జదువుచుండెను. అందుఁ బెక్కు భాగముల నాతఁడు కంఠస్థ మొనర్చెను. కాని యన్ని పదములను సరిగ నుచ్చరింపలేకపోవువాఁడు. అందువలన నాతనితో "మీ బంగాళా దేశమునఁ బండితులు జన్మించి యున్నారు, కాని ఈ దేశవాసులవలె నాంగ్లమును మాట్లాడలే" రంటిని. అతఁడు నాయొద్దఁ గొంచె మాంగ్లము నభ్యసించెను.'"

ప్రాతఃకాలముననే భగవతి వంట సిద్ధముచేసెడిది. మహాశయులు భుజించి ఢక్కాకు నడచిపోవును. మరల నడచియే గృహమునకు వచ్చును. ఒకనాఁడట్లు ఢక్కానుండి వచ్చుచు ఫతుల్లా యను గ్రామమును సమీపించునరికి భయంకరమగు గాలియు వానయు వచ్చెను. గాఢాంధకార మలముకొనెను. ప్రళయమున కిది సూచనయా యనునట్లుండెను. ఫతుల్లాలోని దుకాణములన్నియు మూయఁబడెను. ఎవరిని బిలిచినను తలుపు తెరచునట్లులేదు. అతని కోమలహృదయము తనకొఱకు ఇతరులను విసివించుట యెంతమాత్రమును ఓర్వకుండెను. అందువలన నా గాలికిని వానకును దలయొగ్గి ముందునకుఁ బోసాగెను. అప్పుడు వైశాఖమాసము. భయంకర మేఘగర్జనములును, ప్రచండమారుతము, వృష్టియు నాతని భయభ్రాంతుని జేసెను. కాని యట్లే మెఱుపుల వెలుంగున త్రోవఁ జూచుకొనుచుఁ బోవుచుండెను.

"అతని మార్గము నారాయణగంజి కనతిదూరమున నున్న శ్రీ లక్ష్మీ నారాయణస్వామి యాలయసామీప్యమున నుండిపోవును. ఆ మార్గమధ్యమున నొక తటాకము కలదు. నాగమహాశయు లట్లా రాత్రి పోవుచుఁ బోవుచు, కాలుజారి యందుఁ బడెను. ఎంత ప్రయత్నించినను లేవలేకపోయెను. తుద కట నున్న రెల్లుగడ్డిని పట్టుకొనఁ జూచెను. కాని యదియుఁ జేచిక్కలేదు. అప్పుడాతని మనమున కొక్క మేనత్తయే జ్ఞప్తికి వచ్చుచుండెను. ఈవర కామె తనకొరకు వెదకి వెదకి ఎంత వ్యాకులపడుచుండెనో యని యనుకొనుచు రామనామము జపించుచుఁ దుదిసారి

ప్రయత్నించి ఎట్టకేల కెంతో కష్టముమీద నా తటాకమునుండి పైకివచ్చెను. ఈతఁ డటనుండి గృహమునకుఁ బోవునప్పటికి భగవతి చింతాక్రాంత యై దీపమును బట్టుకొని యింటి వెలుపలికి వచ్చి మేనల్లుని పేరుతోఁ బిలచుచుండెను. మహాశయులు లోని కేగిరి. ఈ విషయమందలి లేశ మాత్రమైనను మేనత్తతోఁ జెప్పక "నేఁడు మార్గమున మిగులఁ దడిసి పోయితిని. అంతకంటె వేరేమియు లే" దనెను.



# వై ద్య వి ద్యా భ్యా స ము

నాగమహాశయు లిప్పుడు యుక్తవయస్కుఁ డయ్యెను. ఈతని సంసారబంధము వృద్ధిచేయఁదలఁచి మేనత్త యగు భగవతి తొందరపెట్ట సాగెను. అందువలన దీనదయాళు విక్రమపురమందలి రాయిజదియా నివాసి యగు శ్రీ జగన్నాథదాసుయొక్క పదునొకండేండ్ల బాలిక యగు శ్రీమతి ప్రసన్నకుమారితో సంబంధము నిశ్చయించెను.

నాగమహాశయునకును అతని సోదరియగు శరదామినికిని ఒకేదిన మున వివాహములాయెను. మహాశయునకు సంధ్యాసమయమునను శరదా మినికి రాత్రియందును ముహూర్తములు కుదిరెను.

వివాహమైన యైదు మాసములకు దుర్గాచరణుఁడు తండ్రియొద్ద కల కత్తాలో నుండుటకుఁ బోయి యచ్చటనున్న క్యాంబెల్ (Campbell) వైద్యవిద్యాలయమునఁజేరెను. ఈ విద్యాలయమున నొకటిన్నర సంవత్సర ములు చదివెను. తరువాత కారణాంతరములవలన నా విద్యనుండి విర మింపవలసి వచ్చెను. అట్లెందులకు విరమింపవలసివచ్చెనో అది, ఈతని జీవితమందలి కొన్ని విషయములవలె దురూహ్యము. పాప మీతనికి విద్యా తృష్ణ తీరదాయెను.

తన ప్రయత్నముల కెన్ని యంతరాయములు కల్గినను కృషిమాత్ర ము మానకుండెను. కలకత్తాలో డాక్టరు విహారీలాల్ బహదురీ అను నాతఁడు హెూమియోపతి వైద్యమందు ప్రసిద్ధికెక్కెనని విని యాతనియొద్దఁ జేరెను. డాక్టరీతని వినయవిధేయతలకును, విద్యయందలి శ్రద్ధకును గడుం గడు హర్షమంది జాగ్రతతో విద్యగరపుచుండెను. వైద్యానుభవము కలుగు టకై తనతో రోగులను పరీక్షించుటకుఁ దీసికొని పోవుచుండెను. మహాశయు లాతడు చెప్పినదంతయు నతి శ్రద్ధతో గ్రహించుచుండెను. ఇట్లు రెండు సంవత్సరములు గడచెను.

విద్యానంతరమునఁగూడ వైద్యశిక్షణమునకై కలకత్తాలో నుండ వలసి వచ్చెను. దానిచే నాతని భార్య పుట్టినింటియందే యుండెను. అందు వలన వీరి మైత్రి కేమాత్ర మవకాశము కలుగలేదు. తరువాత నెప్పుడైనను పరస్పర దర్శనమైనను అమె దరి కేగుటకు భయ (సిగ్గు) పడుచుండెడు వాఁడు. అతఁడు తన యూరి కేగినప్పుడు భార్య యచ్చట నున్నచో నామె సాన్నిధ్యమునఁ దన కేమైన మనోవికారము గల్గునేమో యని యొక వృక్ష ము నెక్కి రాత్రియంతయు నందే గడపును.

దీనదయాళునొద్ద యోగమాయ యను పరిచారిక యుండెను. అతఁ డామెను పుత్రికకంటె నెక్కుడుగఁ జూచువాఁడు. నాగమహాశయు లామెను "అక్కా" యని పిలుచును. యోగమాయ అప్పుడప్పుడు దీనదయాళుతో దియోబాగు వచ్చెడిది. అప్పుడు మహాశయులు భార్యయెడఁ జూపునట్టి ప్రవర్తనమును ఆమె చూచి సురేశునితోఁ జెప్పెడిది.

ఇట్టి యాతని విచిత్ర చర్యలఁ జూడ భగవతి కేమియుఁ దోఁచకుం డెను. అయినను మనసును సమాధానపరచుకొని, తన మేనల్లుఁడును కొంతకాలమునకు నడవడి మారి మార్గమునకు వచ్చు ననుకొనెను. కాని "తా నొకటి తలఁచిన దైవ మొకటి దలఁచు" ననున ట్లా బాలిక గ్రహణీ రోగపీడితయై కాలధర్మము నొందెను.

ఇది నాగమహాశయులకుఁ గొంత మనోవికలత్వముఁ గలిగించెను గాని సర్వేశ్వరుఁ డిట్లు తన్ను బంధవిముక్తునిఁ జేసెననుకొని సంత

సించెను. అయినను తండ్రిమాత్రము కుమారునకు పునర్వివాహము చేయ సంకల్పించి తన యల్లునిఁ దగు సంబంధముఁ గుదుర్చుమని నియ మించెను.

భార్యావియోగముఁ జెందిన కొన్నినాళ్లకు నాగమహాశయులు మరల హోమియోపతి వైద్యవిద్య నభ్యసింప నారంభించెను. అంతకంత కాతనికి వైద్యమం దనుభవము హెచ్చి యొక మందులపెట్టెను కొని బీదల కుచితముగా వైద్యము చేయ నారంభించెను. ఈతని నిపుణతఁ జూచి యప్పుడప్పుడు బహాదురీకూడ ఈతని సలహా గోరుచుండెను. మహాశయులు రోగి లక్షణములఁ దిలకించి రోగవిశేషము నిశ్చయించి మందుల నిర్ణయించుటయం దసమానుఁ డయ్యెను.

క్రమక్రమముగ నీతని పేరు నల్దిక్కుల వ్యాపింపసాగెను. తా నొక విద్యార్థిమాత్రుఁడై యున్నప్పుడే బీదల కంగరక్షకుఁడై యుండెను. ఇప్పుడు లక్షలకొలఁది జను లాతని గృహమునుఁ జుట్టుముట్టుచుండిరి. ధన సం పాదనాభిలాషయే యుండినచో నట్టి యదనున విరివిగ నార్జించి యుండవ చ్చును గాని బీదల కుపచరించుటయే యాతని ముఖ్యోద్దేశం బగుట నందుల కియ్యకొనలేదు.

దరిద్రులకును ఆర్తులకునుఁ బరిచర్య సేయుటయం దతని కత్యంతో త్సాహము. పరోపకారార్థమై యెంతటి నీచకార్య మొనర్పవలసి వచ్చినను వెనుదీయఁడు. ఇది గ్రహించి యాతని తండ్రి స్నేహితులొక కొందరు అతనిచే అప్పుడప్పుడు బజారునరుకులను దెప్పించుకొనువారు. విపన్నులకు పరి చర్య చేయుటకు మహాశయు లెప్పుడును సంసిద్ధుఁడై యుండును. హాట్కొ లాలో ప్రేమచంద్ మున్షీయను ధనికుఁడొకఁ డుండెను. అతనికి దూరపు బాంధవ్యము గల దాయాది యొకఁ డుండెను. అతఁడతని యింట అన్నము వండుట మొదలగు నన్నిపనులును చేయుచుండెను. ఆ దాయాది యనుది నమును స్నానమునకుఁ బూర్వము మహాశయుల గృహమున కేగి యట నాతఁడొసఁగు పొగచుట్టలను గాల్చి యాతని నడిగి శిరస్సునకు నూనెరాచి కొని యటుపిమ్మట గంగానదికిఁ బోయి స్నానమాచరించి గృహమునకు

మరలును. ఇది యాతని దినచర్య యైపోయెను. ఇట్లు దినములు గతిం చుచుండ దైవవశమున నొకనాఁడా బంధువు మరణించెను. ప్రేమచందు పరమలోభి. పొరుగువారితో కలిసియున్నచో ధనవ్యయమగునన్న భయ ముచే ఎవరిని దగ్గరకు చేరనిచ్చెడివాఁడుఁకాడు. ఇప్పుడాపద వచ్చినది. ఎవ్వరును అతని గుమ్మముత్రొక్కి చూచుటలేదు. ధనికుఁడు ప్రతియింటి కిని బోయి సహాయము చేయుఁడని వేఁడుకొనెను. కాని ఎవ్వరును రాలేదు. అన్యోపాయము లేక తుదకాతఁడు నాగమహాశయుల నాశ్రయించెను. అప్పుడు పితాపుత్రులిర్వురును శవదహన మొనర్చి యాతని నా విపత్తునుండి రక్షించిరి.

డాక్టరు విహారీలాలునొద్ద విద్య పూర్తి గావించి స్వతంత్రముగ వైద్యముఁ జేయ నారంభించు దినములలో నాగమహాశయులకు హాట్కోలా నివాసియు సుప్రసిద్ధ దత్త కులజుఁడు నగు సురేశునితో స్నేహము గలసెను. సురేశుడు మహాశయులను "మామా" యని పిలుచువాఁడు. సురేశుఁడు శ్రీరామకృష్ణకృపాలాభమును పొందుటకు పూర్వము బ్రాహ్మమతావలంబియై విగ్రహారాధనయందును బహు దేవ తలఁ నారాధించుటయందును విశ్వాసము లేక "ఏకమేవాఽద్వితీయ" మ్మను నుపనిషత్ప్రమాణమున నిరాకార పరబ్రహ్మమును మాత్రమే యుపాసించుచుండెను. నాగమహాశయులు పూర్వాచారపరాయణుఁడై దేవతలయందు భక్తి గలిగి యుండెను. ఇర్వురియం దింత భావభేద మున్నను నాగమహాశయుల సుగుణసంపదకు మెచ్చికొని సురేశుఁ డతనియందు గాఢస్నేహము గలిగి యుండెను. కాని యప్పుడప్పుడు మతవిషయికములగు వాగ్వివాదములు జరుగుచుండెడివి. ఆ చర్చలలో మహాశయులు "విగ్రహారాధకులచే నర్చింపఁబడు దేవతలును, నీ వను నిర్గుణ బ్రహ్మము నొక్కటే. వీరిలో నెవరిఁ గొల్చినను ముక్తి గల్గుట తథ్యము. కాని బ్రహ్మసాక్షాత్కార మనునది మిగులఁ గష్టతరమైనది. ఎంతయో సాధనపై ఎన్నియో జన్మములకుఁగాని బ్రహ్మజ్ఞానము కలుగదు. మరియుఁ గోటిలో నొక్కనికైన బ్రహ్మసాక్షాత్కారమగునో కాదో యని సంది యము. అందువలననే దేవతలయందు నమ్మిక యుంచుట ముఖ్యము.

సురేశా! నీవు వేదములు పురాణములు మతగ్రంథములు ఇవి యన్నియుఁ బూటకము లనియెదవా? బ్రహ్మమును తెలిసికొనుట సర్వధర్మసాధనల యంత్యావస్థ. అయినను బ్రహ్మసాక్షాత్కార మనునది వీని మూలముననే కలుగుచుండు" నని యీరీతిగ వాదించును. సురేశుఁ డీ మంత్రముల యందును తంత్రముల యందును దనకు నమ్మకము లేదనియు వానిని నమ్మఁజాలననియు మహాశయుని వాదమును ఖండించును.

సురేశుఁడు నాగమహాశయుని సిద్ధాంతము నంతయుఁ బూర్వపక్ష మొనర్చినను, ఆతని బ్రాహ్మణభక్తియు విగ్రహ సాన్నిధ్యమునఁ జేయు సాష్టాంగ దండప్రణామములును తప్పక యాతని కచిరకాలములో బ్రహ్మ సాక్షాత్కార మొనరింపఁ గలవని యనుకొనువాఁడు.

సురేశుఁడు ప్రతిదినమును సాయంకాలమున మహాశయుల గృహ మునకుఁ బోవువాఁడు. ప్రతిదినమునను వాద ప్రతివాదములు జరుగు చుండెడివి. కాని యొకరి విశ్వాసము నొక రణచివేయఁ జాలకుండిరి. ఇట్టి భేద స్వభావులకును ద్వంద్వాభిప్రాయులకును మైత్రి యెట్లు సంఘ టిల్లెనో కాని మొదటిదినమునఁ గలసికొనినది మొదలు యావజ్జీవమును ప్రాణమిత్రులై యుండిరి.

సురేశుఁడు నాగమహాశయుల నప్పుడప్పుడు కేశవచంద్రసేనులు స్థాపించిన నవవిధాన బ్రహ్మసమాజమునకుఁ దోడ్కొని పోవువాఁడు. కేశవుల వక్తృత్వమునకు మహాశయులు ముగ్ధుఁడయ్యెడివాఁడు. కాని సమాజముయొక్క నడవడి యాతనికి నచ్చకుండెడిది. బ్రహ్మసామాజిక ప్రణీతములగు "చైతన్య చరిత్రము" "రూపసనాతన్" "మహమ్మదీయ సాధుశ్రేష్ఠుల జీవితములు" మొదలగు గ్రంథముల ననేకములను మిగుల శ్రద్ధతోఁ బఠించెను. నవవిధాన సమాజ కీర్తన మగు "అమాయ్ దేమా పాగల్‌కోరే" (నన్ను నీ ప్రేమచే ఉన్మత్తుని జేయుము) అనుదాని నున్మత్తభావముతోఁ బాడును.

ఇట్లు మిత్రులిర్వురు తమతమ మతములయందు ఆసక్తితో బ్రవర్తించుచు నొకరికొకరు ప్రాణాధికులై యుండిరి. స్నేహ మభివృద్ధి

యైన కొలఁదియు మహాశయుల నిష్కళంకమగు జీవితము సురేశుని హృదయమున నాటుకొనుచుండెను.

మహాశయులు బాల్యమునుండియు భగవద్భక్తిపరుఁడై యంత్యము వఱకుఁ దన కులాచార ధర్మముల ననుష్ఠించుచు, జీవితయాత్ర గడిపెను. చిన్నతనమునఁ (పెర్షియన్‌భాష కనువాదమగు) "హాతింతాయి" యను గ్రంథముఁ జదివెను, గాని భగవంతునియం దతని భక్తి లేశమైనను తగ్గలేదు. మరియు నాతని మిత్రులు కొందఱు నాస్తిక గ్రంథములు చదివి వాదించినప్పుడు తానా వాదమున పరాజితుఁడైనను, ధృఢమనస్కుఁడై "నిత్యుఁడును, సర్వవ్యాపకుఁడునైన, యీశ్వరుని గూర్చి వాదములు సల్పుటవలన ప్రయోజన మేమి ? సూర్యునివలె నా ప్రభువు స్వయంప్రకాశుఁడు. నాకు భగవంతుని గూర్చి యావంతయు సందియము లే" దని తన నిశ్చితాభిప్రాయమును దెల్పును.

ఇట్లు మహాశయులు చర్చలఁ జేయుచు కాలములో చాలభాగము భక్తిపరుఁడై భగవత్తత్త్వ చర్చలయందును ప్రార్థనల యందును గడుపుచుండెను. దినమున నొక్క నిమిషకాలమైనను వ్యర్థముగఁ గడుపకుండెను. సంస్కృతభాష రాకపోవుటచే బంగాళీ తర్జుమాలను చదువుచుఁ బండితుల సందర్శన భాగ్యము లభించినప్పుడు శాస్త్రములకు సరియగు నర్థమును బోధింపుఁడని వారిని వేఁడుకొనును. ఈ గ్రంథపఠనము వైద్యాభిరుచిని దగ్గింప సాగెను. వైద్యోపయుక్తమగు కాలమునుగూడ గ్రంథపఠనమునకే వినియోగించుచుండెను. కాని జనకుని యాతురతకుఁ జాలిపడి యొక్కమారుగ డాక్టరు బహాదురీలాలుతోడి సంబంధమును వదలించుకొన లేకపోయెను.

మహాశయులు సదాచారపరులు. కర్మిష్ఠి. ప్రతి ఏకాదశియందు నుపవాసముండును. అనుదినము నుదయాత్పూర్వమే మేల్కొని పవిత్ర గంగానదీతోయములఁ దానమాడును. రాత్రులందు చేరువనున్న కాశీ మిత్రుని శ్మశానవాటికకుఁ బోయి యర్థరాత్రము వఱకు నాలోచనా నిమగ్నుఁడై యుండును. ఆ నిశీథములందు చితులపైఁ బేర్పఁబడిన శవము

లాహుతి యగుచుండ గంగానదీ తరంగములు క్రిందికిఁ బ్రవహించుచుఁ దమ మర్మరధ్వనుల, దాపున నున్న విశాల వటవృక్షపత్రముల ధ్వనికి లయ గలుపుచు జనన మరణాద్యవస్థలఁ దలఁపింపఁ జేయుచుండును. దాని వర్ణింప నే భాషయు సరిపడదు, కాని యది యనివార్యమై మానవ హృదయము నాకర్షించును. నాగమహాశయు లీ ప్రకృతిచిత్రములను దిలకించుచు ధ్యాననిమగ్నుఁడై గంటలకొలఁది స్థాణువువలెఁ జలనరహితుఁడై యొక్కొక్కపుడు "నయ్యో! మిథ్య! మిథ్య! సర్వమును మిథ్యయే. ఈశ్వరుఁ డొక్కఁడే శాశ్వతుఁడు. అయనను దెలిసికొనిననే తప్ప జీవితము సహింపరాదు. భారము........నేనెట్లాయనను గన్గొనుట? నా కెవరు దారి చూపింతు" రని విలపించును.

అతఁ డా రుద్రభూమికిఁ బోవు దినములలో నప్పుడప్పు డచ్చటికి ఫకీరులు, సన్న్యాసులు మొదలగు సాధకు లేతెంచుటఁ గాంచి యాశాపూరితహృదయముతో వారిం జేరి, "అయ్యా! నాకీశ్వర దర్శనము నకుఁ ద్రోవఁజూపుఁ"డని వేఁడుకొనును. కాని యొక్కరి నుండియు సరియగు సమాధానముఁ బడయఁజాలక వారిలోఁ బెక్కురష్టసిద్ధులకేగాని, భగవత్తత్త్వమును దెలిసికొనుటకు యత్నించుటలేదని తెలిసికొనెను.

ఒకసారి తాంత్రిక సాధకుఁ నొకనినిఁ గలసికొని వామాచార (**Vamachara**) సాధనముఁగూర్చి ప్రశ్నింపఁ నాతఁడేవియో యనుభవరహితములును భయంకరములునగు, సాధనల వర్ణింపసాగెను. అంత మహాశయులు "నీకనుభవము చాలదు. తంత్రములనిన నేమోగూడఁ దెలియనట్లు గన్పించుచున్నా"వనెను.

ఇట్టివారి పరిచయమువలన నాతనికి నమ్మిక కుదురుటకు బదులనుమానములు మెండగుచుండెను.

కొంతకాలమిట్లు నిరాశాపరుఁడైయుండ నొకనాఁడా రుద్రభూయందు దుపదేశమంది యొక వృద్ధబ్రాహ్మణుఁడు సాధనఁ జేయుచుండెను. ఈతని జాతిమతభేదరాహిత్యమును అంతర దృష్టియు గాంచి మహాశయు లాతని శరణు చెందెను. అంత నాతఁడు తాంత్రిక సాధనలకుఁగల

ప్రాముఖ్యతను షట్చక్రార్థమును తేటతెల్లమగునట్లు తెల్పెను. మహాశయు లదియంతయుఁ జక్కఁగ విని తనకా రీతిని సాధన చేయవలెనని యున్నదనెను. అంత నా భూసురుఁడు "జగన్మాత నీ కోర్కెలఁ దప్పక నెఱవేర్చుగాత" మని దీవించి ధైర్యముచెప్పి పంపెను.

మహాశయులు భూసురుఁడు తన కుపదేశించిన తెఱంగుననే యా శ్మశానవాటికయందు జపమొనర్చుచు నర్ధరాత్రమువరకు నన్యమెఱుగక ధ్యానప్రపంచమునఁ బడిపోవువాఁడు. ఒక దిన మట్లుండ దివ్యతేజం బొందు సాక్షాత్కార మయ్యెను. అప్పటినుండియు, నియతి దప్పక. నచ్చటనే సాధన కొనసాగించు కొనుచుండెను.

ఈ విధముగ దినములు గతించుచుండ నొకనాఁడు దీనదయాళున కిది తెలియవచ్చెను. అతఁడు మిగుల భయపడి తత్క్షణమే యొక సంబంధముఁ గుదుర్పుమని యల్లునికి జాబు నంపెను. తన కొడుకు కుఱ్ఱవాఁ డగుటచేత, నేవిధమగు బంధనకారణము లేకపోవుటచేతనే యటు సన్న్యాసులతోఁ దిరుగుచున్నాఁడని యాతఁడనుకొనెను. కాని యా భగవత్ప్రేమామృతము నెవరైన ఒకపరి చవిఁ జూచినచో వారు మరల దానిని విడువ నేరరని యాతఁ డెఱుఁగఁడయ్యెను. అందువలన పునర్వివాహ మొనర్చినచో దన కొమారుని చేష్టలన్నియు క్రమపడు ననుకొనెను.

అల్లుఁడు త్వరలోనే దియోబాగు వాసుఁడగు రామదయాళుని కొమరిత యగు శ్రీమతి శరత్కుమారితో సంబంధముఁ గుదిర్చి మామ గారి కెఱుకచేసెను. సంబంధము గుదుర్చుట సులభమే కాని నాగమహాశయుల నొప్పించుటయే గొప్పపని. దీనదయాళు తన శక్తినంతయు ధారవోసెను గాని యాతఁ డేమాత్ర మిష్టపడఁడయ్యెను. ఇది ఇర్వుర కును గలహకారణ మయ్యెను. తత్ఫలితముగాఁ దండ్రి కొన్ని రోజులు పస్తుండువాఁడు. కుమారుఁడుగూడ నారోజు లుపవసించును.

కొన్నిదినము లిట్లు గతింపఁ దీనదయాళు యొకనాఁడు కొమరుని జూచి "దుర్గాచరణా! నేను నీకొఱకు రామదయాళునికి మాటనిచ్చి

యనృతమాడవలసి వచ్చెను. సన్ననృతదోషమునుండి రక్షింపఁ జూతువా, వివాహమున కియ్యకొను"మనెను. అంత మహాశయులు "తండ్రీ! ఒకసారి నాకు వివాహ మొనర్చితివి. ఆ బాలిక గతించెను. మరల నింకొక బాలికను మృత్యుముఖమునఁ బెట్ట నెంచితివా ?" యనెను. ఇది విని దీనదయాళు కోపమున "అదృష్టము భగవంతునిచే నిర్ణీత మగును. మంచిచెడ్డలను విచారించుటకు మన మనర్హులము. నీతండ్రి నగు నామాట ననాదరమునఁ దిరస్కరింతువా, నీ వేకార్యమం దే ప్రయత్నమునను సఫలతఁ బొందనేరవు. భగవదన్వేషణమునఁగూడ నభివృద్ధిఁ గాంచకుండు నటుల శపింతు" ననెను.

నాగమహాశయుని కిప్పుడు ముందు నూయి వెనుక గోయి. ఒక దిక్కునఁ జనకుని శాపము. వేఱొకవైపున సత్యాన్వేషణమునకుఁ బ్రతిబంధము. ఇఁక నొండేదియుఁ జెప్పనేరక యవనతముఖుఁడై "సంసారము సర్వదుఃఖములకు మూలకారణము. కాని నా తండ్రి నన్నాపథమునకే త్రోసివేయనున్నాఁడు. ఓ దయామయా! ఈశ్వరా! ఇప్పుడు నేఁ జేయున దేమి? నన్నీసమయమున రక్షింపవా" యని విలపించుచు నెట్టకేల కొకింత ధైర్యముఁ దెచ్చుకొని ఖిన్నుఁడై తండ్రితో నిట్లనెను: "వివాహమువలన కష్టములును, విచారములును ఎన్నియో కలుగుచున్నవని వినుచున్నాము. కండ్లార చూచుచున్నాము. అందువలన నాయందు దయయుంచి నీ నిశ్చితాభిప్రాయమును మరల్చుకొనుము. నన్ను మరల నా సంసార దవాగ్నిం బడఁద్రోయకుమని నీ పదములపైఁబడి వేఁడుకొనుచున్నాను. నీవు జీవించియుండువఱకును నీకు మనఃపూర్వకముగ నీవనుకొనిన కోడలికంటె వేయిమడుంగు లెక్కుడుగ సేవ చేయఁగలను. తండ్రీ క్షమించి రక్షింపుము".

ఈ కొమరుని దీనాలాపములును దీన దృష్టులు నా వృద్ధుని మనమున నాటుకొనెను. ఎవరి సుఖమును గోరి తానా వివాహము చేయ నిశ్చయించెనో ఆ తన కొమరుఁడే దానికి విముఖుఁడై యున్నప్పుడు ఆ వివాహమువలన నతని కేమి సుఖము గలుగఁగలదని యనుకొని

వివాహ ప్రయత్నమును మానుట కొప్పుకొనెను. కాని దుర్గాచరణుఁడు వివాహమాడనిచో వంశమాతనితో సంతరించి మరణించినవారి శ్రాద్ధ కర్మలు నిలిచి పోవునను విచారము మనస్సునకుఁ దట్టెను. కాని దానికి నిష్కృతి ఏమి? వాద ప్రతివాదముల వలనను మందలింపుల వలనను లాభము గాన్పింపదాయెను. అందువలన నిఁక దుఃఖ మాపుకొనఁజాలక నేడువసాగెను. ఆ సమయమున నాగమహాశయు లింట లేరు. గృహమునకు రాఁగనే తండ్రి యుండు గదిఁ బ్రవేశించి కన్నీరు కాల్వలు గట్ట నేడ్చు చున్న జనకుని జూచి సహింపలేక పోయెను. "అయ్యో నాకు నాది యని యీ ప్రపంచమునఁ జెప్పుకొనుట కొకతండ్రి దక్క నింకెవ్వరు లేరుగదా! అట్టి తండ్రి విచారమునకుఁ గారణభూతుఁడనైతినా? ఏమైనను సరియే. ఎన్ని విపత్తులు సంభవించినను సరియే. తండ్రి మాటను జవదాఁటను. నా వివాహమువలనఁ దండ్రికి నూరట గల్గుచో నట్లే చేయుదు" నని నిశ్చయించి యాక్షణమే జనకునిఁ జేరి, "నాయనా! విచారింపకుము నేను వివాహమాడెద" ననెను.

ఈ తుదిపల్కు లాతని ముఖమునుండి వెలువడెనో లేదో దీన దయాళు ఆనందమున నాట్యమాడసాగెను. ఆ పల్కులాతని కమృత సేచనమయ్యెను. సంతోషపారవశ్యమున మాటాడలేక యూరక తన బాష్పపూరిత నేత్రములతో నాతని తేరిపార జూచుచుండెను. అంత మహాశయులు లగ్నము నిశ్చయించి శుభలేఖలను బంపుఁడనెను.

కొంతవడికి దీనదయాళు తెప్పరిలి సంతోషమున "కుమారా! నీవు నా ధర్మమును గౌరవమును గాపాడితివి. నీ వివాహానంతరము నీ యిచ్ఛ వచ్చిన తెఱంగున నుండుము. నే నేవిషయమున నిఁక నడ్డుతగులను. "నా మనఃస్ఫూర్తిగ నీ కోర్కెల నీశ్వరుఁడు చెల్లించు గాతమని దీవించు చున్నా" ననెను. తరువాత దీనదయాళు 'మెస్సర్సుపాలుల'కీ శుభవార్త నెఱింగించుటకుఁ బోయెను. వారును మిగుల సంతసించి యా వివాహ మున కగు వ్యయములోఁ గొంతఁ దాము భరింతుమనిరి.

అంపఱుసు సంతోషమున మునిఁగి తేలుచుండిరి. కాని ముఖ్యుఁడైన వరుఁడుమాత్ర మతి దుఃఖితుఁడై యుండెను. అతఁడు వివాహమున కంగీకారముఁ జూపి వెంటనే యిలు విడచిపోయెను. ఆ దినమంతయు నున్మత్తునివలె వీథులవెంబడిఁ దిరిగి రాత్రియంతయు గంగానదీ సైకత స్థలముల విలపించుచుఁ గూర్చుండెను. అచ్చట, నా నిశీథమున, నా యేకాంతస్థలమున నాతని విచారమునఁ బాల్గొను వారెవ్వరు! తన కష్టము నెవరితో వెళ్లబుచ్చుకొనును? దీనదయాళుఁడు పెండ్లిపనులయందు మునిఁగి యుండినందున నాతని కిది యేదియుఁ దెలియలేదు.

ఇంతలో ప్రయాణదినము సమీపించెను. దీనదయాళు సామానుల సరిచూచుచుండెను. మామూలురీతిగ నాగమహాశయులు రాత్రి సమయమున గంగానదిదరి కేగి మరల గృహాభిముఖుండగుటకుఁ బూర్వము గంగాభవానికి సాష్టాంగ వందన మాచరించి " తల్లీ! నీవు పాపనాశనివన విందును. నేను గృహస్థాశ్రమధర్మ స్వీకారముఁ జేసి ప్రాపంచికవిషయ పంకిలుఁడనగుచో దానిఁ గడిగివేయుము. జననీ! కష్టములందును, సుఖములందును నీ చరణకమలములయందు నా కాశ్రయమి "మ్మని ప్రార్థించెను.

ప్రార్థనానంతరమున గృహమున కరుదెంచెను. తరువాతఁ దండ్రియుఁ దానును జన్మస్థానమునకుఁ బయనమైరి.



# పునర్వివాహము - వైద్యవిద్యాభ్యాసము

"సంతతికొఱకు వివాహ మాడుటవలన మానవుఁ డపవిత్రుఁడు కాఁజాలఁడు. కాని యట్టి వివాహములకుఁ బూర్వము ఋషిసత్తములును యోగి పుంగవులును దక్క సన్య్సు లసర్హులు. వారలు చాలకాలము బ్రహ్మ చర్యవ్రత మవలంబించి వంశాభివృద్ధికొఱకు వివాహమాడెడువారు. తరువాత వ్యాసులు, శుకులు, సనకులు, సనత్కుమారులవంటి పుత్రులఁ బడసి వాన ప్రస్థము జరుప నడవుల కేగువారు. కాని యీ కలియుగమున నది యసాధ్య ము. ఈ కాలమున నట్టి భక్తియుఁ దపఃప్రభావమును లేవు. అందువలనఁ గ్రూరులును అవినీతిపరులు నుద్భవించుచున్నారు. నేనేమి చేయఁగలను? నా పితృాజ్ఞ ఇట్లున్నది. అది విషప్రాయమైనను అవలంబించుట నా విధి" యని మహాశయులు పునర్వివాహమును గూర్చి యనువాఁడు.

పితాపుత్రు లిర్వురును వివాహమున కైదారు దినములకుఁ బూర్వమే జన్మస్థానముఁ జేరిరి. శుభదిన మాసన్నమాయెను. దీనదయాళు పుత్ర ప్రేమ ముప్పిరిగొన వరుని నూరేగింపుతో వధూగృహమునకుఁ దీసికొని పోయెను. మంత్ర తంత్రములు యథావిధిగ జరుపఁబడెను. మహాశయు లొక మృణ్మయ విగ్రహమువలెఁ జేయవలసిన పనులొనర్చుచుండెను. వివాహితుని విధి యాతనికి స్ఫురించినతోడనే యొడలు ఝల్లుమను చుండెను. కాని విధి ప్రేరితముఁ దప్పింప నేరితరము?—వివాహ మతి వైభవమున జరిగెను.

వివాహానంతరమునఁ దంప్రతి కొడుకులు కలకత్తాకు మరలిరి: మహాశయులు మరల స్వతంత్ర జీవనమగు వైద్యవృత్తి నారంభించి ముందటివలె ధనార్జనమును జేయుచుండెను. ఇట్లు అధ్యయనమునను, రోగుల పరిచర్యతోడను, మిత్రులతోడి మతవిషయిక వాగ్వివాదముల తోడను, భగవత్ప్రసంగములతోడను, నాగమహాశయుని జీవితమున మెల్ల మెల్లగ ఏడు సంవత్సరములు గడచిపోయెను. ఇంతలో పరిశుభ్రాకాశము మేఘావృతమాయెను.

ఒకనాఁడు మహాశయులకు మేనత్త యగు భగవతి వ్యాధిగ్రస్తయై యున్నట్లు జాబు వచ్చెను. తత్క్షణమే యతఁడు జన్మస్థానమునకుఁ బయనమయ్యెను. పాపమామె వృద్ధురాలగుటచే దేహపటుత్వము వీడి గ్రహణిరోగమున బాధపడుచుండెను. భగవతి మేనల్లునిఁ జూడఁగనే సంతోషమున "నాయనా! యవసాన దశయందు నిన్నుఁ జూచుటయు నీ సమక్షముననే కడతేరుటయు నా భాగ్య" మనెను.

మహాశయు లామె వ్యాధినివారణమునకై యెంతయో ప్రయత్నించెను. కాని యన్నియు నిష్ఫలము లయ్యెను. మరణకాల మాసన్న మాయెను. భగవతి, ఇంట నందఱును భుజించినట్లు తెలిసికొని చావడిలోఁ గూర్చొని యొక పావుగంటవఱకు భగవన్నామ సంకీర్తనముఁ జేయుచు, మహాశయులఁ జేరఁబిలిచి "తండ్రీ నీమనమెప్పుడును భగవంతునియందే లగ్నమై యుండుగాత" మని దీవించి, రామ మంత్రోపదేశిని యగుటచే రామమంత్రము జపించుచు "రా" యను శబ్దముతోడనే యంత్యోచ్ఛ్వాసమును విడచెను. మహాశయులకది స్పష్టముగ వినవయ్యెను.

అతఁడు మృత్యువును ప్రత్యక్షముగా చూచుట కిదియ ప్రథమ సందర్భము. మొదటి భార్యతో నాతనికి సంబంధము లేకపోవుట నామెను గోల్పోవుటవలని కష్ట మాతని కావంతయుఁ దెలియలేదు. తల్లి దా బాలుఁడుగ నుండఁగనే మరణించెను. కాని యామె స్థానము నాక్రమించిన మేనత్తయందే మాతృప్రేమ నతఁడు దర్శించి యుండెను. ఆమె యపారమగు ప్రేమ యాతని నెన్నఁడును తన మాతృ విహీనతను స్మరింపనీయలేదు. ఇప్పుడా ప్రేమస్వరూపిణి యగు మేనత్తయే వీడిపోయెను. దుఃఖము నిర్భరమైపోయెను. ఆ గృహమున నివసించుటకైన నాతఁడు సాహసింపఁ జాలకుండెను. ప్రేమపాశము తన్నీడ్చుకొని పోవుచుండ తఱచు చామెను దహించిన చోటికిఁ బోయి నిశియెల్ల నచ్చటనే గడపువాఁడు. స్నానమునకును, భోజనమునకు నెంతయో బలవంతమునపై లేచుచుండెను. ఒక్కొక్కప్పు డున్మత్తునివలె నింటి ముంగిట సాఁగిలఁ బడువాఁడు.

ఈ చర్యలన్నియుఁ బరికించి శరదామిని యాతఁడున్మత్తుఁడగు నేమో యని భయమంది తండ్రికి వర్తమాన మంపెను. దీనదయాళు తత్క్షణమే కలకత్తానుండి వచ్చి భగవతి కుత్తరక్రియలు జరిగినతరువాతఁ గొమరుని దీసికొనిపోయెను.

కాల మెంతటి కష్టములనైన మఱపింపఁజేయును గదా! నాగ మహాశయునకును దుఃఖ ముపశమించుచుండెను. కాని దాని స్థానమును నింకొకటి యాక్రమించి మిగుల వేధించుచుండెను. మనుజుఁడెందులకు జన్మించును? మరల నాతఁడెందులకు మరణించును? మరణానంతర మేమగును? ఇప్పుడు నాకండ్లముందు గతించిన నామేనత్త యేమైనది? ఏ లోకమునకుఁ బోయినది? నా దేహ మెచ్చటఁ గనుగందునో యని యెల్లవేళల నిరీక్షించుచు, నేదేని కొలఁది యపాయము సంభవించినను, వ్యాధిగ్రస్తుఁడనైనను ఆ కష్టమెల్లఁ దనకు వచ్చినట్లుగఁ దాను విలపించె డిదే! అట్టి నామేనత్త యిప్పుడు నేను హృదయము ద్రవించునట్లేడ్చినను గాంచదేమి? మరణమున నీ సంబంధము లన్నియు వీడిపోవును గాఁబోలు! అట్టి సమయమున నెందుల కీ "నా" "నీ" యను నహం భావము? అయ్యో! దుఃఖభూయిష్ఠమై బంధనకారణమగు నీ ప్రపంచ మున కెందులకు వచ్చినారము? వచ్చిన తరువాతఁ నిఁకచేయ వలసిన విధియేమి? క్లేశమందుచున్న యీ యాత్మను మృత్యుముఖమునుండి రక్షించుటెట్లు? అను నిట్టి ప్రశ్నలే యాతని కలఁచివేయు చుండెను.

నాగమహాశయులు చికిత్సచేసి డబ్బు గడింప నారంభించెను. కాని ఇతని విధము వేఱు. ఎవ్వరిని ఇమ్మని యడుగఁడు. ఎవరేది యొసఁగి నను సంతుష్టచిత్తుఁడై స్వీకరించును. క్రమముగ నాతని కీర్తి వ్యాపింపఁ దొడఁగెను.

వైద్యవృత్తి చేయుచు గడించుచుండినను, బాహ్యాడంబర మాతని యొద్దఁ గాన్పింపదు. రోగులను జూడఁబోవుటకు గుఱ్ఱపుబండియైనను లేదు. దూరదూరములనుండి యాతనిఁ బిలుచువారు. అయినను అచ్చ టికి నడచియే పోవును. ఎవరైనను బండి తీసికొనివచ్చుటకు నంసిద్ధు

లైనను సమ్మతింపఁడు. సామాన్యముగా సంచయిను ధరించు పంచె, చొక్కా, ఉత్తరీయము, కాలిజోడు మొదలగువానినే ధరించును. వృత్తికి తగు దుస్తులను ధరించుచో కొమరుఁడింకను అభివృద్ధి చెందునని దీన దయాళు తనకు నచ్చిన వానిని కొనితెచ్చెను. కాని మహాశయులు "నా కట్టి దుస్తులతో నెట్టి ప్రయోజనమును లేదు. ఈ రూప్యములతో ఎవరైన బీదలకు సాయమొనర్చుచో సత్కర్మ యాచరించినవారమగుదు" మనెను. దీనదయాళు దీర్ఘనిశ్వాసము విడిచి "నీపై నెంతయో ఆశ పెట్టుకొని యుంటిని. ఇప్పటి నీచర్యఁ జూచి మోసపోతినని తెలిసికొంటిని. నీవు సన్న్యాసివగుటకు సంసిద్ధుఁడవై యున్నా" వనెను. ఇదియే కాదు, మహాశయుల నడతయంతయు ప్రపంచధోరణికి వ్యతిరేకమై యుండెను. పొరుగున నెవరైన రోగగ్రస్తులైనను, తిండి లేక మాడుచున్నను వారికిఁ దగు సేవఁజేసి వారి బాధలు నివృత్తి చేయువఱకును ఆహార పానీయములు ముట్టఁడు. అసమర్థులగువారినుండి పైకము పుచ్చుకొనఁడు. చివరకు ఔషధమూల్యమైనను గొనక, పైఁబడి వారి పథ్యపానముల కగు వ్యయ మునుగూడఁ దానే భరించును. నిరాశ్రయులై దారిత్రోవల రోగపీడితులై పడియుండు వారిని గృహమునకుఁ దోడ్తెచ్చి చికిత్స చేయును. ఒక్కొక్కప్పుడు తానే మాడి భిక్షుకులకుఁ దన నోటిముందరి యన్నమిడును.

ధర్మవైద్య మట్లుండుటచే పెక్కురు రోగు లితనినే చుట్టు ముట్టు చుండిరి. పూర్తిగ ప్రాపంచిక విషయ విముఖుఁడగుటచే, దీనరక్షణమే పరమావధి యని వారి కాహారమును దుస్తుల నొసఁగి రోగుల కుపచరించును. రోగులు దూరముగా నున్నప్పుడు తనకుఁ దానే నడచిపోయి యుపచరించును. తాను నిద్రాహారములను మానియైనను సరియే రోగుల సుఖమే తన సుఖమని వారు బాధపడుచుండఁ దాను గూడ విచారించుచు తండ్రి బిడ్డలను వోలె వారల నాదరించును.

ఒకనాఁడొక రోగి గృహమునకుఁ బోయి పరీక్షింప నాతఁ డతి శోచ నీయమగు స్థితియం దుండెను. అచ్చట నాలుగు గంటల కాలముండి ఔషధమిచ్చుచు శుశ్రూష చేయుచుండెను. గృహము శిథిలమై ప్రచండ

మగు శీతలవాయువుల నాపఁజాలకుండెను. రోగికిఁ గప్పుకొన బట్ట యైనను లేదు. జ్వరము తీవ్రముగ నుండెను. నాగమహాశయు లిది చూచి మిక్కిలి విచారించుచు రోగి ప్రక్కఁ గూర్చుండి ప్రియోక్తు లాడుచుఁ దనపైనున్న శాలువ నాతనికిఁ గప్పి "భయపడకుము. రేపు ప్రొద్దుటనే వచ్చి చూతు" నని చెప్పి రోగి ఎంత పిలిచినను వినిపించు కొనక వెడలిపోయెను. మఱునాఁ డుదయమునంబోయి చూడఁగ రోగి కొంత స్వస్థతఁ బడసి యాతనియెడ నెంతయో కృతజ్ఞత చూపెను. అంత మహాశయులు నాయనా "అట్టి స్థితిలో నీ చలిని కాపాడుటకంటె నా శాలువ వలని ప్రయోజన మేమని నీ కొనఁగితి" ననెను. ఈ సంగతి తండ్రికిఁ దెలిసెను. ఇర్వురకును వివాదము సంభవించెను. దాని ఫలితముగ నిర్వురును ఆనాటికి నిరాహారులై యుండిరి. మఱునాఁడు దీనదయాళిం కొక శాలువను గొనియిచ్చెను. పూర్తిగ రోగనిర్ముక్తుఁడైన తరువాత రోగి ప్రతిదినమును మహాశయుల యింటికిఁ బోయి నమస్కరించుచు, ఎందఱినో రోగుల నీతనియొద్దకుఁ గొనివచ్చుచుండెను.

ఇంకొకసారి యొక రోగిని బరీక్షించుటకై పోవ నాతఁడు కటికి నేలపైఁ బరుండియుండెను. మహాశయుల కది కష్టముగఁ దోఁచి తన గృహమునుండి వేఱొక పరుపుఁ దెచ్చి రోగిని దానిపైఁ బరుండఁబెట్టి చికిత్స చేయ నారంభించెను.

ఇట్టి పనులన్నియు దీనదయాళునకు మిక్కిలి కష్టతరముగనుండి కొమరుని మందలించుచుండును. కాని దానివలన నిర్వురకుఁ గలహ ములు సంప్రాప్తించుట దక్క లాభమేమియు నుండదయ్యెను.

నాగమహాశయుల సుగుణ సంపదకును వైద్యనిపుణతకును మెచ్చి మెన్సర్సు పాలులు ఆతని దమ గృహవైద్యునిగ నియమించిరి. అందు వలననే నాగమహాశయులను వారలిప్పటికిని "డాక్ట" రనియే పేర్కొం దురు. "ఆతఁడు వైద్యుఁడుగనున్న కాలమున మా గృహమున నెవ్వరు నకాలమరణ మందలే" దని బాబు హరలాలుపాలు తన సన్మానమునఁ దెలిపియున్నాఁడు.

ఒకప్పుడీతఁడు గృహవైద్యుఁడుగ నున్నప్పుడు "పాలు" వంశజు రాలి కొకరైకుఁ గలరావ్యాధి సంభవించెను. మహాశయులు వైద్యము చేయుచుండెను గాని, యాతనికే జీవితాశ గన్పట్టక నధైర్యపడి డాక్టరు విహారీలాలును రప్పింపుఁడనెను. డా॥ విహారీలాలు వచ్చి మహాశయుని చికిత్సాక్రమమును విచారించి యాతఁ డిచ్చుచుండిన ఔషధమే సరియైన దనియు, యాతఁడే కొలఁది దినములలోఁ గుదుర్పఁగలఁడనియుఁ జెప్పి యెంత పట్టుపట్టినను వినక వైద్యము చేయకయే వెడలిపోయెను. అతఁడు చెప్పినట్లే కొన్ని దినములకు రోగి స్వస్థతఁ జెందెను.

రోగి జీవించి యారోగ్యమును గన్న తరువాత "పాలులు" సంతోష పూర్వకముగ నొక వెండిపెట్టెలో రూప్యములను నింపి బహుమాన మొసంగిరి. కాని వారు తన యభివృద్ధికిఁ గారణభూతులగుటచే ఆ బహుమానము నాతఁడు నిరాకరించెను. అది తన చికిత్సకు తగిన బహు కృతి కాదని యాతఁడు నిరాకరించెనేమో యని సంశయించి వారు మరొక యేబది రూపాయిలను దెచ్చి స్వీకరింపుమనిరి. అంత మహాశయులు అతి దీనతతో "అయ్యా, ఇంతటి బహుమానమును స్వీకరింపఁజాలను. మీకొఱకు ఖర్చుపెట్టినది యిర్వది రూప్యములకంటె నెక్కుడుకాదు. క్షమింపుఁడు. నేనీ బహుమానమున కనర్హుఁడను" అని యెంతయో కష్టముమీద నా యిర్వది రూప్యములను మాత్రమే స్వీకరించెను. "పాలు"లా మిగిలిన సొమ్మును దుర్గాపూజ నిమిత్తమై వినియోగించిరి.

ఈ విషయము తండ్రికిఁ దెలియవచ్చెను. అతఁడు తన కోపముఁ బట్టఁజాలకపోయెను. తానంతటి వృద్ధాప్యమునఁ గూడ ఏకొలఁది వేతన మునకో పాటుపడుచుండఁ దన కొడుకు బుద్ధిహీనుఁడై తనకు రావలసిన సొమ్మునుగూడ నిరాకరించుచుండెనని మిగుల విచారించెను. కొమరుఁ డింటికి రాఁగానే, పండ్లు పటపటఁ గొఱుకుచు "మూర్ఖుఁడా ! 'పాలులు' తమ కృతజ్ఞతాపూర్వకముగ నిడిన బహుమానమును నిరాకరింతువా ? ఇఁక నీ వైద్యవృత్తి యభివృద్ధి గాంచునా ? ఇట్లు ధనమును నిరాకరిం చుచు సన్న్యాసివలె నుండిన నీ కుటుంబమెట్లు పోషించుకొందు"

వని కఠినముగ మందలించెను. కాని మహాశయులుమాత్ర మించుకైనను జలింపక, "తండ్రీ! ధర్మపథమునఁ జరింపుమని నీవేగదా బోధింతువు. మరల నిట్టి యన్యాయ్య కృత్యమును జేయుమని యెట్లనఁగల్గుచున్నావు? మందులకయిన వ్యయ మారు రూప్యములు. ఇఁక నేడు దినములకును సేవ జేసినందులకు దినమునకు రెండు రూకల చొప్పున జూచినను పదు నాల్గు. మొత్త మిరువది యాయెను. అట్టితఱి యన్యాయ్యముగ నంత యెక్కుడు మొత్తము నెట్లు స్వీకరింతు" ననెను.

దీనదయాళీ యుత్తరము విని తన కొమరుఁ డదృష్టహీనుఁడనియు నీప్రపంచమున నుండుట కనర్హుఁడనియు ననుకొనుచు, వెడలిపోయెను. తండ్రి చర్యలఁ గాంచి మహాశయులు విచారమున "ఆహా! ఇట్టిదిగదా ఈ ప్రపంచము! ఆశాంధకారపరివృతమై జీవుని నెంతటి మాయాజాల మునఁ జిక్కువడఁజేయుచున్నది! 'ధనమూల మిదం జగ' త్తని ఏదో యొక వడువున ధన మార్జింపవలయునఁట! దానఁ గాని పేరుప్రతిష్ఠలు లేవఁట! ఛీ, నాకిట్టి తుచ్ఛప్రపంచముతో నెట్టి సంబంధమును లేకుండు గాక! అన్యాయార్జిత విత్తముతో సుఖించుటకంటె ధర్మాచరణము కొఱకు నిఱుపేదయై బిచ్చమెత్తి జీవించు టెంతయు మే" లని తల పోసెను.

ఇదియే కాదు. ప్రాపంచిక విముఖములగు నీతని చర్య లెన్నియో దీనదయాళునకు నిరాశ కల్గించుచుండెను. అనుదినమును ఋణముకొఱ కెందఱో నాగమహాశయుని గుమ్మముకడ కాచుకొనియుందురు. ఏది యడిగినను లేదనక యేదియో యొసంగి వారలఁ బంపుచుండును. కాని మరల వారా యప్పులఁ దీర్చుట యబద్ధము. అందువలననే దినమున కెనిమిది తొమ్మిది రూప్యములను నిలుప చేసికొనగల్గిన సంపాదన యుం డియు నిట్టి వ్యయములవలన నాతనికి కొన్నిరోజులఁ దినుటకుఁ బట్టెడు మెతుకులుకూడ కఱవగుచుండెను. మరియు ధనమును జేర్చిపెట్టుట యనునది యాతఁ డెఱుఁగఁడు. ధనమును నిలువజేయు విషయమును గూర్చి "మన నిజమైన యవసరములను భగవంతుఁడే సమకూర్చు చుం

డును. మన మాతురతపడి చేయునది యేమియు లేదు. భగవంతుని సంపూర్ణముగ శరణు జొచ్చినచో మన కిహపరసౌఖ్యములు లభించును. మనముగా చేయఁబోవు నే కార్యమును దుదకు నిష్ఫలము గాఁగలదు. ఇది నా యనుభవ" మని చెప్పుచుండును. ఏదేని కొలఁది మిగిలినయెడలఁ దండ్రి కిచ్చి తన కెన్నఁడేని అత్యంతావసరముగఁ గావలయుచోఁ దండ్రి నడుగును.

కపటప్రవర్తన మన్న నాగమహాశయులు సహించువారు కారు. ఒకనాఁడొక వైష్ణవసన్న్యాసి యొక జవ్వనితో భిక్షార్థియై వచ్చెను. అప్పుడు మహాశయులు దేవతార్చన మొనర్చుచుండెను. తన గృహద్వారమునుండి "రాధా రాధా" యను శబ్దోచ్చారణము రాగా ఈవలికి వచ్చి దొంగ వేషము వేసికొనియున్న దంపతులఁ జూచి యాగ్రహముతో "ఇట్లు బూటకముగా 'రాధా రాధా' యని యన్నంత మాత్రమున నీకేమియు దొరకదు. మనస్ఫూర్తిగ ననఁగలిగితివేని ఏదేని ఇచ్చెద" ననెను. తోడనే వారు మాఱుపలుకక వెడలిపోయిరి.

వైష్ణవీ వైష్ణవులవలెనే యింకొక దినమున భైరవీభైరవ వేషములతో నిర్వు రాతని గృహమునకు వచ్చిరి. త్రిశూలధారి యగు నాభైరవ వేషధారి మహాశయులను గంజాయికొఱకుఁ బైక మొసంగుమని యడిగెను. నాగ మహాశయు లందులకు "నీవు నీ యిష్టము వచ్చినట్లు చేయవచ్చును. కాని ఏవిధి చెప్పున నీవిట్లొక హిందూస్త్రీని భైరవీ వేషమున రాజమార్గ మునఁ ద్రిప్పుచున్నావు" అనెను. దానితో ఉగ్రభైరవు డింకను ఉగ్రతర రూపము దాల్చి "పైస యొసఁగకున్నఁ బోనిమ్ము. ఇట్లు దూషింతు వేల?" యనుచు భైరవితోఁ గూడి వెడలిపోయెను.

మనుజుఁడు సద్గురూపదేశము లేనిచో నిట్టి దుఃస్థితి కేతెంచుట సహజము. తా నధఃపతితుఁడగుటేగాక యితరులను గూడఁ జెఱచును. ఎఱుఁగక చేసిన యఘ మొకపక్షమున క్షమింపనగును. కాని తెలిసియుఁ బొట్టకొఱకు వేషమాత్రులై ప్రపంచ విరోధులగువారిని సహింప దుస్సహ మని యనుకొనుచు మహాశయులు లోనికిఁ బోయెను.

ఒకపరి యపరిచితుఁడగు నొక భద్రపురుషుఁడు నాగమహాశయులను దన ఇంటికిఁ బిలువనంప నాతఁడచ్చోటికిఁ బోయెను. ఆ వ్యక్తి పరమ సౌందర్యవతి యగు నొక పూర్వసువాసినిని అతని ఎదుటికిఁ గొనివచ్చి యామెకు గర్భమును బోగొట్టుమని ప్రార్థించెను. ఈ ప్రార్థనను విని నాగమహాశయులు స్తంభితుఁడైపోయెను. కొంతవడి కాతనితో ఇట్లనెను: "ప్రథమమున ఈ సుందరిని కుటుంబమునకుఁ దీరని కళంక మాపాదించి గొనివచ్చుట యొక పాపము. దానిపై నిప్పుడు భ్రూణహత్య చేయుటకుఁ బూని మహాపాపమున కొడిగట్టుచుంటి" వని యింకను ఎంతయో బోధించెను. కాని ఫలము లేకపోయెను. తరువాత నా పురుషుఁడు విరివిగ ధన మొసంగెదనని యాశపెట్టెను. అంత నాగమహాశయుఁడు మారు మాటాడక వెడలిపోయెను. "అయ్యో! ఈ మహాపాపమును నివారించుటకే యుపాయమును లేదా?" యని చాల విచారించెను. నాగమహాశయులిదివరలో బ్రహ్మసమాజ ఉపాచార్యులగు శ్రీ శివనాథుని యుపన్యాసముల వినియుండెను. అందువలన "శివనాథుఁడు ధార్మికుఁడు. ఎక్కువ పలుకుబడి గలవాఁడు. అతనితో ఈ యుదంతమును జెప్పుచో ఏదేని ప్రతి విధానము జేయగలఁ" డని శివనాథునియొద్దకుఁ బోయెను. అతఁడంతయు విని యొకరిద్దరు బ్రహ్మసామాజికులను బేర్కొని వారితో నాలోచించి కోర్టుద్వారా పనిచేయుమని చెప్పెను. కాని వారి ఆలోచన నిష్ఫలమయ్యెను. అంత నాగమహాశయులు తానే యాఖరు పర్యాయము ప్రయత్నించి చూడవలయు ననుకొనెను. మఱునాఁడా పురుషుని గృహమున కేగునప్పటికి అతఁడు కాశీపురికిఁ బోయెనని తెలిసెను. "ఆహా! ఈ పాపకృత్యమునకు ప్రతీకార మొనర్పలేకనే పోతినిగదా" యని నాగమహాశయు లనేక దినములు విచారించెను.

ఆర్థికస్థితి బాగున్నను దీనదయాళు వంటకై ఎవరిని నియోగింపక తానే వంట చేయుచుండును. పుత్రుఁడు తండ్రి వండుట కిష్టపడక తానే వండును. ఇది దీనదయాళునకు బాధాకరమై పుత్రున కవకాశ మీయకుండును. నాగమహాశయులును అతి జాగ్రత్తతో తరుణముకొఱకు వేచి యుండును. ఈ వంతుల్లతోఁ గలహములు పొడముచుండెడివి. అప్పుడా

గృహమునకు వచ్చినవారెవరైన నున్న మధ్యస్థులై యాదినమున కా వివాదమును పరిష్కరించువారు. కాని మఱునాఁడు యథాపూర్వము గనే జరిగెడిది. ఇప్పుడును ప్రాతఃకాలముననే ఎవరికి వారు "ఈ దినమున నేను వండుదు" నని నిశ్చయించుకొని ఎవరికి తరుణము లభించి నప్పుడు వారే వంట సిద్ధముచేయువారు. ఇందెవరి యభీష్టము నిష్ఫల మయ్యెడిదో యాతఁడా దినమంతయు క్రోధముతో నుండును.

ఇట్లు నిత్యమును వివాదములు సంప్రాప్తించుటఁ జూచి మహా శయులు తన భార్యను (శరత్కుమారిని) కలకత్తానకుఁ గొనివచ్చుటకు నిశ్చయించెను. అందులకై సురేశుని గృహ సామీప్యముననే యొక గృహమును బాడుగకుఁ దీసికొనెను.

# మంత్రోపదేశము - దక్షిణేశ్వర యాత్ర

క్రీస్తుశకము **1880** వ సంవత్సరమున నాగమహాశయుల భార్య కాపురమునకు వచ్చెను. ఇచ్ఛాపూర్వకముగ భర్త కుపచారము చేయుట కిదియే యామెకుఁ బ్రథమ తరుణము. వివాహసమయమున భర్తను చూచియుండెను గాని యప్పటి కామె ప్రపంచమెఱుఁగని బాలిక. ఇప్పు డా జవ్వని భర్తకును మామకు నే లోపము లేకుండ సేవఁజేయుచుండెను. దీనదయాళీమె సుగుణసంపత్తికిని వినయవిధేయతలకు నలరి తగిన కోడలు దొరికెగదా యని మిగుల సంతసించుచుండెను. కాని యా యబల భర్త మనము నేమాత్ర మాకర్షించుకొనఁ జాలకపోయెను. ఎందువలనన నాతఁడు తన కాలము చాలవఱకు వైద్యమందే నియుక్త మగుచుండ మిగిలిన కొలఁది కాలమును భగవద్ధ్యానమునను గ్రంథ పఠనమునను గడుపుచుండెను. అందువలనఁ బాప మాబాలిక యస్థిర చిత్తయై యుండెను.

భాగవతములోని భావాటవీ వర్ణనము, జడభరతోపాఖ్యానమును మహాశయుని మనస్సున కెక్కిన విషయములు. భరతుని గాథ జదువు నప్పు డట్టి ముక్తపురుషుఁడే సంసారబంధమును దప్పించుకొనలేక తాఁ బెంచిన లేడిపైని వ్యామోహము కారణముగ మరల జన్మమెత్తవలసి నప్పుడు తనబోంట్ల విషయ మెంత కష్టతరమో తెలిసికొనెను. ఒక్కొ కప్పుడీ దుస్సాధ్యంబగు మాయను దలఁచుకొని "అయ్యో! దీనిని సాధించుటెట్లు? బంధవిముక్తుఁడ నగుటెట్లు? వివాహితుఁడను, ధన మార్జించుచుంటిని. బంధములు దినదినము పెరుగుచున్నవి. వానినుండి బయల్పడుటెట్లు? వైద్యవృత్తి నవలంబించునప్పుడు దీనసంరక్షణఁ జేయవచ్చును గదా యని యనుకొంటిని. రాఁబడి యంతయు మిగుల్పక యర్థుల కిచ్చుచుంటిని. చేతనగు వఱకు రోగులను దుఃఖితుల నుపచరించు చుంటిని. కాని ప్రపంచమును ఎంతమాత్రము దుఃఖములనుండి విము క్తము చేయఁగల్గితిని? ఈ దుఃఖభూయిష్ఠమగు ప్రపంచమున నెందులకుఁ జన్మింపవలయును? అయ్యో! మరల కామినీకాంచనముల నాసక్తు డనే కావలయునా? వీనితోడనే జీవిత మంతరింపవలయునా? కాదు. ఈశ్వరాన్వేషణముఁ జేయవలయును. లేకపోయిన నీ జీవితమెట్లు సార్థకము కాఁగలదు? ఆ సర్వాంతర్యామిని దెలిసికొను మార్గమేది? నాకెవరు త్రోవఁజూపుదు" రని పలుమారు చింతించుచు, గద్గదికుఁడై యీశ్వరుని ప్రార్థించును.

ఈ సమయమున నాగమహాశయుని ప్రాణమిత్రుఁడైన సురేశుఁ డును కొందఱు బ్రహ్మసమాజికులును ప్రతిదినమును సాయంకాలమున గంగానదీ తీరమునఁ గలసికొని ధ్యానప్రార్థనా సంకీర్తనముల గడపు వారు. మహాశయులుగూడ వారితోఁ జేరెను. సంకీర్తనఁజేయుచు నాగ మహాశయు లానందమున నాట్యమాడును. ఒకప్పుడు సంతోష నాట్యము చేయుచు నాతఁడు గంగానదిలోఁ బడిపోయెను. సురేశుఁడు మరికొందఱు మిత్రుల సాయమున నాతని రక్షించెను. కాని యా దిన మంతయు మహాశయులయందు ఉన్మత్తభావములు కన్పించుచునే

యుండెను. నాగమహాశయులు కొంత యుద్రేకస్వభావము కలవాఁడయ్యు తన యుద్రేకముల నణఁచుకొనుట యందు పతినమర్థుఁడు. ఉద్రేకము నణఁచు కొలందియు నది రెండురెట్లు బలవంతమగునని యాతని యభిప్రాయము. ఉన్మత్తస్థితియందు దుస్స్పష్టముగ ఈతనియందు ఈశ్వరానురాగ లక్షణములు స్పష్టముగఁ గన్పట్టుచుండెనని సురేశుఁడు చెప్పియున్నాఁడు.

నీకెంత గాఢతరమగు భక్తియున్నను, ప్రేమయున్నను, సద్గురూపదేశము నంది సాధన నభ్యసించి పరమేశ్వరుని ధ్యానింపకున్నచో భగవత్సాక్షాత్కారము దుర్లభమని యొక సాధువు చెప్పెను. ఇది విని త్వరలో నుపదేశ మందవలయునని నాగమహాశయుఁ డాతురతఁ జెందసాగెను. అప్పుడప్పుడు సన్న్యాసులు గంగాతీరమునకు వచ్చుచుండుటఁ గాంచి వారిలో నెవరైన దయగొని తన కుపదేశము చేయఁగలరను నాశతో రాత్రియగువరకు నచ్చట వేచియుండును. ఎన్నియో దినములిట్లు గడచెను. ఒకసారి గంగాస్నాన మాచరించునప్పు డొక నావ తన వైపునకు వచ్చుచుండుటఁ జూచెను. చూచుచుండఁగనే నావ రేవునకుఁ జేరెను. అందుండి (యాశ్చర్యజనకముగ) తలపని తలంపుగ తన కుల గురువగు కైలాసచంద్ర భట్టాచార్యులు దిగెను.

మహాశయులు త్వరితముగ స్నానము పూర్తిచేసి కుశలప్రశ్న మొనర్చి, ఆయనను గృహమునకుఁ దోడ్కొనిపోయెను. గురు సందర్శనమున దీనదయాళుప్పొంగెను. గురువునకుఁ దగు సత్కార మొనర్చి యాయన రాకకు కారణ మడిగెను. అందుల కాయన "త్రిలోకజనని యాజ్ఞానుసారముగ మహాశయుల కుపదేశముఁ జేయుటకు వచ్చితి" ననెను. అతని ప్రార్థనల నా దయామయి విన్నది కాబోలు! ఈ వార్త విని దీనదయాళు సంతసించెను. మరునాఁడు శుభదిన మగుటచే నా దినమున మహాశయులు భార్యాసహితుఁడై శక్తి మంత్రోపదేశముఁ బొందెను.

ఉపదేశానంతరమున మహాశయు లతిశ్రద్ధాభక్తులతో సాధన జేయఁ దొడఁగెను. ఎన్నియో రాత్రులు ధ్యాననిమగ్నుఁడై గడపెను. ప్రతి

యమవసనాఁడు నుపవాసముండి ధ్యాననిమగ్న చిత్తుఁడై యుండెను. ఒక్కొక్కప్పు డా ధ్యానమున చైతన్య విహీనుఁడై పడిపోవును. ఒకదినమున నట్లు స్మృతిరహితుఁడై పడియుండ గంగాతరంగ మొకటి లోనికీడ్చుకొనిపోయెను. మఱల స్మృతి వచ్చిన తరువాత నీఁదుకొని బయటికి రావలసి వచ్చెను.

ఇట్లు తన కాలమంతయు జపధ్యానాదులఁ గడపుచుండఁ గ్రమక్రమముగ వైద్యవృత్తి క్షీణింపఁ జొచ్చెను. దాని ఫలితముగ రాఁబడి తగ్గెను. దీనదయాళు జిజ్ఞాసపడెను. మేనత్త చనిపోయినప్పుడు గల్గిన వైరాగ్యము సురేశుని స్నేహమువలనఁ జాలవఱకు మాసిపోయె ననుకొనెను. కాని మరల యథాపూర్వమగుటఁ జూచి దీనదయాళు చాల చింతించెను. తన కోడలి యవస్థయే ముఖ్యముగా దీనదయాళుని జిజ్ఞాసకు కారణమయ్యెను. భోజన వస్త్రములకు లోపము లేకపోవుట నిక్కువమే. భార్య మనస్సునకు శాంతిని జేకూర్చునది భర్త యనురాగ మొక్కటియే. ప్రపంచమున నెట్టి స్త్రీయు తన భర్త ననురాగబద్ధుని జేయఁజాలదని యామె యెఱుఁగును.

ఒకసారి మహాశయులు తన భార్యను జూచి "దేహసంబంధము చాలకాలమువఱకు నిలుపదు. ఈశ్వరుని తన సంపూర్ణ మనస్సుతో నెవఁడు ప్రేమింప నేర్చునో యాతఁడే ధన్యుడు. ఒకపరి యైహికములకు లొంగి తనువునకుఁ జనువిచ్చితిమా యా వ్యామోహమునుండి విడివడుటకెన్నియో జన్మముల నెత్తవలసి వచ్చును. అందువలన మాంస భూయిష్ఠమగు నీ యస్థిపంజరముపైన అనురాగ ముంపకుము. జగన్మాతృ చరణ కమలమే మనకు తారకము. ఆమెనే సర్వదా స్మరించుచుండుము. దాన నీ జీవితము సార్థకము కాఁగల" దని యుపదేశము చేసెను. నాగమహాశయులు తాపసి. ఆయన సహధర్మిణి తపస్విని యయ్యెను.

ఇట్లు దినము లతిక్రమింపఁగా దీనదయాళుని దేహ మనారోగ్య స్థితికి వచ్చెను. నాగమహాశయులు తనతండ్రి "మెస్సర్సు పాలుల"

కొలువు నింక విరమించుకొని మిగిలిన కాల మీశ్వరాన్వేషణమునఁ గడుపవలయునని యనుకొనెను. కొమరుఁడు చాల ప్రార్థింపఁగా దీనదయాళు సెలవు తీసికొని జన్మస్థానమునకుఁ బోవుట కియ్యకొనెను. కోడలు గూడ మామగారికిఁ బరిచర్యఁ జేయుటకై యాతనితోఁ బోయెను.

సురేశుఁడు యథాప్రకారముగ నాగమహాశయులతో మత విషయక చర్చలఁ జేయుచుండెను. కాని మాటలవలన లాభము లేదని నాగమహాశయులు తెలిసికొనెను. అందువలన నొక దినమున సురేశునితో "వాద ప్రతివాదముల వలనఁ గాలమంతయు వ్యర్థమయి పోవుచున్నది. ప్రత్యక్షముగ నేదో యొకటి కన్గొనకున్నచో జీవితము సార్థకతఁ బడయఁజాల" దనెను.

ఈ కాలముననే సురేశుఁ డొకనాఁడు కేశవబాబు స్థాపించిన నవవిధాన సమాజమునకుఁ బోయియుండగా నచ్చట, సర్వసంగ పరిత్యాగియై, సదా భగవద్ధ్యానపరుఁడై తఱచు భావసమాధులఁ జెందుచుండిన యొక సాధువు దక్షిణేశ్వరమున నివసించుచుండెనని వినెను. సురేశుఁడు, మహాశయునితోఁగూడ నా యోగిపుంగవుని సందర్శింపఁ బోవలయుననుకొనెను. కాని కారణాంతరమువలన నా సంగతిని అప్పుడు మహాశయుని కెఱుకపఱుపకయే యుండి రెండు నెలలయిన తరువాత చెప్పెను. నాగమహాశయులు చాల నాతురతతో తత్క్షణమే యాతని దర్శింపఁబోవలె ననెను. నాఁడిక నెంతో ప్రొద్దు లేకుండుటచే మఱునాఁడుదయముననే ప్రయాణము చేయుటకు సమకట్టెను.

మఱునటి ప్రాతఃకాలమున భోజనములఁ గావించి బయలుదేరిరి. దక్షిణేశ్వరము కలకత్తా కుత్తరమున నుండెను. అందుచే వారా వైపున కున్ముఖులైరి. అప్పుడు ఎండలు మెండుగ నుండెను. వేఁడిమిని గొంచెమైనను లెక్కసేయక నేదియో శక్తి తమ్మీడ్చుకొని పోవుచున్నట్లు పోవుచుండిరి. చాల దవ్వేగిన తరువాత నొక పథికుని దక్షిణేశ్వర మెచ్చట యని ప్రశ్నించిరి. అతఁడా యూరు దాఁటి చాల దూరము వచ్చినా

రనెను. పాపము వారలు మఱల వెనుకకు మఱలిరి. వారు రాణీ రాసమణి యొక్క కోవెల గృహమును చేరునరికి మధ్యాహ్నము రెండుగంట లాయెను.

ఆ కోవెల చుట్టును చల్లటి నీడను బఱపుచు సుగంధమును వెదఁ జల్లుచు నొక పూఁదోఁట యుండెను. ఆ మిత్రులకు దక్షిణేశ్వర దేవాల యము దేవగణము యొక్క లీలాభూమివలెనే కన్పట్టెను. చల్లటి నీటితో నిండి యాలయ ప్రాంగణమున నున్న తటాకమును, ఎత్తయిన శిఖర ములు గల నా కోవెలలను, చిగురుటాకుల దొడఁగిన వృక్షసమూహములను జూచుచు ఆ మిత్రులు చాల నానందించిరి. మహాశయుల కా వృక్షముల యాకుల ఒరపిడియందొక సుకుమార వాణి తమ్ము "సంసార సాగరమున మునిఁగి పోవుచున్న యో జీవులారా! మిమ్ముల దరిజేర్పఁగల నావ యచ్చట నున్నది" యని యాహ్వానముఁ జేయుచున్నటులుండెను.

ఇఁక నీ ప్రకృతిచిత్రములఁ దిలకించుట మాని నెమ్మదిగ వారు శ్రీ రామకృష్ణులు నివసించుచుండిన గదిని జేరిరి. ద్వారమున నొక గడ్డపు మానిసి యుండెను. "అయ్యా! దక్షిణేశ్వరసాధు వెచ్చట నుండును" అని అతనిని వారడిగిరి. "అతని నివాస మిచ్చటనే కాని ప్రస్తుత మాతఁడు చంద్రనగరమునకుఁ బోయియున్నాఁడు. మీరింకొక దినమున వచ్చుట మంచి"దని యాతఁడు ప్రత్యుత్తర మొసఁగెను.

ఇర్వురును హతాశులై, ఖిన్నవదనములతో నన్యోపాయము లేక వెనుకకు మఱలనుండు సమయమున మహాశయులు తమ్మెవ్వరో లోనికి రండని సంజ్ఞ చేయుచున్నటులఁ జూచెను. దక్షిణేశ్వర యోగి యతఁడేనా యేమి? అవును. ఏ మహాత్ముని దర్శింప వారా యాతపమును లెక్క సేయక యరుదెంచిరో యా మహాత్ముఁ డాతఁడే కావచ్చును. ఆ గడ్డపుమానిసి మాటల నరకుగొనక వారు లోనికిఁ బ్రవేశించిరి.

ఆ గడ్డపుమానిసి ప్రతాపచంద్ర హజ్రా. అతని కొరులెవ్వరును శ్రీ రామకృష్ణుల యొద్దకు వచ్చుట గిట్టదు. అయినను భగవంతుని ప్రేమ ప్రవహించుచుండ నా ప్రవాహమున కడ్డుగ నెవరు నిల్వఁగలరు? ఆ

ప్రేమయే లేనిచో, భగవంతుఁడు ప్రక్కన నిలుచుకొనియున్నను దెలిసి కొనుట యశక్యము. ఇది శ్రీ రామకృష్ణుల జీవితమందలి యొక వృత్తమును జ్ఞప్తికిఁ దెచ్చును.

ఒకనాఁడు శ్రీ రామకృష్ణులు తన మేనల్లుఁడగు హృదయముఖోపాధ్యాయునితో కాళీఘట్టమునకుఁ బోయెను. అచ్చటి దేవాలయమున కుత్తరపుతట్టు కచ్చూరపు (కచుచెట్లు) పొదలుండెను. అచ్చట జగన్మాత కొందఱు చెలికత్తెలతో జవ్వనియై యాడుకొనుచుండుటను శ్రీ రామకృష్ణులు చూచెను. ఆమె యెఱ్ఱంచు చీరను ధరించి యుండెను. గొల్లభామలను పట్టుచు నాడుచుండెను. అంత నాతఁ "డమ్మా! యమ్మా!" యని కేకలిడుచు చైతన్య విహీనుఁడయ్యెను. మఱల స్మృతి వచ్చిన తరువాత శ్రీ రామకృష్ణులు దేవాలయములోని కేగి చూడ నా కాళికా విగ్రహమున కచ్చట తాను జూచిన వస్త్రమే కట్టబడి యుండెను. హృదయుఁడీ సంగతి విని "మామా, నాకప్పుడే ఎందులకుఁ జెప్పవైతివి? నేను పోయి యామె నప్పుడే పట్టుకొని యుందునుగదా!" యనెను. గురుదేవు డిందులకు నవ్వి "నాయనా! అది యెన్నటికిని పొసఁగదు. ఆమె ఇచ్ఛ లేక యామెను పట్టుకొనుటకు నీకేటి శక్తి? సర్వవ్యాపిణియైనను ఆమె కృపకుఁ బాత్రులు గాక యెవ్వరు నామెను గన్గొనఁజాల"రనెను.



# శ్రీ రామకృష్ణ సందర్శనము

సురేశ నాగమహాశయు లిర్వురును లోనికిఁ బ్రవేశించిరి. శ్రీ రామకృష్ణు లొక మంచముపై కాళ్లు చాచుకొని కూర్చొనియుండెను. ఉత్తరాభిముఖుఁడై చిఱునవ్వు నవ్వుచుండెను. సురేశుఁడు చేతులు జోడించి నమస్కరించి చాఁపపైఁ గూర్చుండెను. మహాశయులు హిందూ మతాచార రీతి సాష్టాంగమెఱఁగి యాయన పాదధూళిని స్వీకరింపఁబోయెను. కాని

శ్రీ రామకృష్ణులు పాదముల వెనుకకు లాగుకొనెను. ఇది మహాశయులకు దుర్భరమైన దుఃఖకారణ మయ్యెను. నిజమైన భక్తుఁడెవ్వఁడు నట్టి హక్కును బోఁగొట్టుకొనఁ జాలఁడు. తానట్టి పవిత్రస్పర్శ కనర్హుఁడనని నాగమహాశయులు సమాధాన పఱచుకొని ఆ గదియందు దూరముగ నొక్కమూలఁ గూర్చుండెను.

శ్రీ రామకృష్ణులు వారి పూర్వోత్తరములఁగూర్చి కొన్ని ప్రశ్నల నడిగెను. కొంతకాలము వారితో మాటలాడి సంభాషణానంతరమున "కుమ్మరిపుర్వు మంటిలో నున్నను పంకిలము గాక స్వేచ్ఛగ నున్నట్లు మీరలును గృహస్థులై యుండఁదగును. సంసార పంక మేమాత్ర మంట కుండునట్లు మాత్రము జాగ్రత వహించియుండుఁ"డనెను.

నాగమహాశయున కీ గృహస్థ ధర్మనిర్వహణ సమస్యయే ఇంతవఱకు బాధించుచుండినందున ఈ యుపదేశ మాతని మనమున గాఢముగ నాటుకొనెను. చాల నాశ్చర్యముతో నాతఁడు శ్రీ గురుదేవునిఁ దదేకదృష్టితోఁ జూడసాగెను. "ఏల యిట్లు చూచుచున్నా" వని శ్రీ రామకృష్ణు లడిగిరి. మహాశయులు "అయ్యా! మీ దర్శనమునకుఁ జాల నాతురతపడితిని. నేటి కా భాగ్యము లభించినందునఁ దనివిదీరఁ జూచుచున్నా"ననెను.

కొంతవడికి శ్రీ రామకృష్ణు లా మిత్రద్వయమును బంచపటికిఁబోయి ధ్యానమొనర్పుఁడని పంపెను. అట్లే సురేశ మహాశయు లిర్వురొక యరగంట వఱకు ధ్యానోపవిష్టులై మగిడి యేతెంచిరి. తరువాత శ్రీ రామకృష్ణు లామిత్రులు తన వెంటరా, నచ్చట దేవాలయముల నన్నిటిని జూపుటకు బయలుదేరెను.

శ్రీ రామకృష్ణుని గది నంటి పండ్రెండు శివాలయము లుండెను. ఒక్కొక్క దానియందును ప్రవేశించి శ్రీ రామకృష్ణులు స్వామికి ప్రదక్షిణము సల్పి సాఁగిలఁబడి నమస్కరించెను. మహాశయులును అతని ననుసరించెను. కాని సురేశుఁడు బ్రాహ్మ మతావలంబి యగుటచే నా విగ్రహములయందు నమ్మిక లేక వారి చర్యలను నడవడినిఁ జూచు చుండెను. తరువాత శివాలయముల కొకింత దూరమున నున్న విష్ణ్వాలయములఁ బ్రవేశించిరి. అచ్చటఁగూడ పూర్వోక్తముగనే మెలఁగిరి.

అటనుండి జగన్మాత దేవాలయమునకుఁ బోయిరి. జగన్మాత దేవాలయమును ప్రవేశింపఁగనే శ్రీ రామకృష్ణుఁ డొక క్రొత్తవానివలె నైపోయెను. భావప్రపూర్ణుఁడై వడఁకసాగెను. తన్నుఁ దామఱచిన ట్లగపడుచుండెను. తుంటరిబాలుఁడు జనని చీరచెఱఁగు వట్టుకొని యామె చుట్టునుఁ దిరుగు నట్లా జగజ్జనని చుట్టు ననేకమారులు ప్రదక్షిణములు సల్పెను. శివ శక్తుల పాదములను తన శిరముతో స్పృశించి తన గదివైపు మఱలెను. జగన్మాతయందలి ఈతని గాఢమగు నమ్మకమును, బాలునివంటి యస్వతంత్రతయు మహాశయుల మంత్రముగ్ధునిఁ జేసివైచెను. భావోద్రిక్తుఁడై యూరక యాతని పవిత్రభావములఁ దిలకించుచుండెను. సాయంతన మైదు గంటలకు మిత్రులిర్వురును ప్రయాణోన్ముఖులై శ్రీ రామకృష్ణుల సెలవు గోరిరి. శ్రీ రామకృష్ణులు "తఱచుగ రాకపోకలుండుచో సంబంధము చాల సన్నిహితమగు" ననెను.

మార్గమధ్యమున మహాశయులు శ్రీ రామకృష్ణుని వ్యక్తివిశేషమును గూర్చియే తలపోయుచు నాలోచనా నిమగ్నుఁడయ్యెను. "అతఁడు యోగియా, సిద్ధపురుషుఁడా, లేక కేవల మా భగవన్మాత్రుఁడా?" ఈ సందేహ మాతని నావరించెను. ఆ శుభదినమునాటి యనుభవము లాతని హృదయమున నాటుకొని యాతని మనమున భగవద్దర్శనాకాంక్ష అగ్నివలె రగులసాఁగెను. ఆ భావ మాతని నున్మత్తునిఁ జేసెను. నిద్రాహారములకు దూరమై యన్యసంస్పర్శమును రోయుచు నొక్క సురేశునితో మాత్రము శ్రీ రామకృష్ణ చరిత్రముఁ జర్చించుచు నేకాకియై యుండెను.

మఱునటి వారమున మిత్రు లిర్వురును మఱల శ్రీ రామకృష్ణుల యొద్దకుఁ బోయిరి. అయన మహాశయుల యున్మత్తావస్థను జూచినంతనే భావపరవశుఁడై "మీరిచ్చటికి వచ్చుట మంచిపనియే యైనది. మీ యందరికొఱకును వేచియుందు" ననెను. మహాశయులం జేరఁదీసి ప్రేమపూరిత వచనముల "నాయనా! నీవు భయపడ నవసరము లేదు. నీ వత్యున్నత పదవికి వచ్చియున్నావు" అనెను. ఆ దినమునఁగూడ వారలను పంచవటికి భగవద్ధ్యానమునకై పంపెను.

వారు పంచవటికిఁ బోయిన కొంతసేఁపటికి శ్రీ రామకృష్ణు లచ్చటి కేగి మహాశయులను దనకుఁ బొగాకు చిలుమును తయారుచేయుమనెను. మహాశయు లా పనిపైఁ బోయినతరువాత సురేశునిఁ జూచి "మహాశయులు ప్రజ్వలితాగ్నిసుమా" యనెను. ఇంతలో మహాశయులు చిలుమును గొనితెచ్చెను. తరువాత నుత్తరీయము, కూజా, కూజాయందు జలము మొదలగువానిని ఒక్కొక్కదానినిగాఁ జెప్పి తెప్పించుకొనెను. నాగమహాశయులు తనకట్టి మహాపురుషుని సేవ లభించెఁగదా యను సంతోషమును వెనుకటిపర్యాయ మాయన తనకు పాదధూళి నీయ నిరాకరించె నను విషాదమును పెనగొన నమ్రతతో నా కార్యముల నన్నిఁటిని నెఱవేర్చెను.

నాగమహాశయు లింకొకసారి యొంటరిగ శ్రీ రామకృష్ణులఁ జూడ నేగెను. పూర్వమువలెనే యాయన భావసమాధిఁ బొందెను. తరువాత నేదియో గొణుగుచు లేచి నిలుపఁబడెను. అతని యాస్థితిఁ జూచి నాగమహాశయుఁడు భయభ్రాంతుఁ డయ్యెను. అంత శ్రీ రామకృష్ణుఁ "డయ్యా! మీరు వైద్యులు గదా! కొంచెము నాపాదములఁ బరీక్షింపుఁడు" అనెను. శ్రీ రామకృష్ణులు తన సాధారణరీతిని మాటలాడు చుండుటఁజూచి మహాశయులు ధైర్యము దెచ్చుకొని చరణములఁ బరీక్షించి దోషమేమియు లేదనెను. శ్రీ రామకృష్ణులు "మఱల జాగ్రత్తగఁ బరీక్ష సేయుఁ" డనెను. నాగమహాశయులు శ్రీ రామకృష్ణుని యభిప్రాయమును దెలిసికొని గురువు శిష్యుల యభిమతములను దీర్చుట ఇట్లే గదా యని సంతోషపడెను. గురువుయొక్క కొంచెపు టుదార ప్రవర్తనము నచ్ఛిష్యుని అతిగాఢమగు ప్రేమపాశములచే గట్టివేయును. ఇఁక నాగమహాశయులవంటి శిష్యునిగూర్చి వేఱుగఁ జెప్పవలయునా? అతని మనఃక్లేశ ముపశమిల్లెను. ఆ పరమపవిత్ర చరణ ద్వంద్వ స్పర్శమునఁ దాను ధన్యుఁడనైతినని భావించెను. చక్షుర్ద్వయమ్మునుండి సంతోష బాష్పధారలు స్రవించుచుండ నా పదముల శిరముపైనను హృదయము మీఁదను నిడుకొనెను.

గురు శిష్య సంబంధము బాగుగఁ దెలిసికొనిన వారలే ధన్యతములు. వారలకు భగవత్సాక్షాత్కారము కలుగఁగలదు. ఈ నరికి మహాశయులు శ్రీ రామకృష్ణుని భగవదవతారమని తెలిసికొనెను. ఈ రహస్యమును నీవెట్లు తెలిసికొనఁ గలిగితివని యడుగ "నేను శ్రీ రామకృష్ణుని యొద్దకు పోయిన కొన్నాళ్లకాయన కృపాలేశమువలన నా మహామహుఁడు శ్రీమన్నారాయణుఁడే యనియు దక్షిణేశ్వరమున నాయన లీల రహస్యముగ జరుగుచున్నదనియుఁ దెలిసికొంటి" ననెను. మఱియు "నా దేవదేవుని యవ్యాజ కరుణాకటాక్షముననే తప్ప వేయి సంవత్సరములు తలక్రిందుగఁ దపస్సుచేసినను ఆయనను దెలిసికొనఁ జాల" రనెను.

ఇంకొక దినమున నాగమహాశయులు శ్రీ రామకృష్ణుని జూడ దక్షిణేశ్వరమునకుఁ బోయెను. అప్పుడాయన భోజనము చేసి విశ్రాంతి తీసికొనుచుండెను. అది మే నెల యగుటచే మిగుల నుక్కపోతగ నుండెను. అందువలన మహాశయునిఁ దనకు విసరుచుండుమని చెప్పి శ్రీ రామకృష్ణుఁడు నిద్రపోయెను. మహాశయులు చాలసేపు విసరుచుండి నందున చేతులు నొప్పియెత్తినను గుర్వాజ్ఞ లేనిదే నిలుపఁజాలక విసరుచునే యుండెను. అంతకంతకుఁ జేతులు బరువెక్కి ఇఁక వీవనసు బట్టుకొనఁ జాలనంతటి స్థితికి వచ్చునప్పటికి శ్రీరామకృష్ణు లాతని కరమును బట్టుకొని వీవనను దీసికొనెను. ఈ విషయమును గూర్చి చెప్పుచు మహాశయులు "ఆయన నిద్ర యసాధారణము. ఆయన ఎల్లప్పుడును (నిద్రపోవుచుఁగూడ) మేల్కనియేయుండును. ఈస్థితి భగవంతునికిఁ దక్కనితరుల కెవరికిని, దుదకు సిద్ధులకుఁగూడ సాధ్యము కా" దనెను.

ఒకపరి శ్రీ రామకృష్ణుఁడు నాగమహాశయునిఁ దన్నుగూర్చి యాతని యభిప్రాయ మేమని యడిగెను. నాగమహాశయుఁడు "దేవా! నీ కృపాకటాక్షమువలన నీవు భగవంతుఁడవే యని తెలిసికొంటిని" అనెను. ఇది విని శ్రీ రామకృష్ణుఁడు సమాధి నిమగ్నుఁడై యాతని వక్షమును దన కుడిపాదముతో స్పృశించెను. ఈ చర్య నాగమహాశయునియం దొక మార్పును గలుగఁ జేసెను. భూమ్యంతరిక్షములనుండి చరాచర ప్రపం

చము నంతయు వ్యాపించిన యొక మహాజ్యోతి యాయనకుఁ గనిపించెను. తరువాత శ్రీ రామకృష్ణునిగూర్చి తన యభిప్రాయమును దెల్పుచు "ఆయనను దేనికొఱకును బ్రార్థింపనక్కఱలేదు. ఆయన కల్పతరువు. మన యభిప్రాయములను చెప్పకయే ఎఱిగి వానిని సఫలీకృతము చేయును. శ్రీ రామకృష్ణులు భూమి నవతరించినది మొదలు సకలమును కొట్టుకొనిపోవు నొక మహావెల్లువ వచ్చియున్నది. అతఁడు భగవంతుని సంపూర్ణావతారము. ఇంతదనుక సర్వమత సామరస్యము నింత విపులముగ నిరూపించిన యవతార మింకొకటి వచ్చియుండలే" దనువారు.

మహాశయులకు వివేకానందస్వామితోడి ప్రథమ పరిచయము దక్షిణేశ్వరమునఁ గలిగెను. అప్పటి కాతఁడు నరేంద్రుఁ డను నామమునఁ బిలువఁబడుచుండెను. ఒకనాఁడు మహాశయులు శ్రీ రామకృష్ణుని యెదుట గూర్చొనియుండఁగా నరేంద్రుఁడు "శివోహం" "శివోహ" మ్మని యుచ్చరించుచు గదిలోఁ బ్రవేశించెను. అంత శ్రీ రామకృష్ణులు మహాశయుల వ్రేలితోఁ జూపుచు "నరేంద్రా! యీతఁడు అహంకార రహితుఁడు. ఇది యీతని సహజస్వభావముగాని నటన కా"దనెను. "మీరట్లు చెప్పినచో నది వేఱొకవిధముగ నుండఁజాల"దని నరేంద్రుఁ డనెను. ఆ శిష్యద్వయ మంత నిట్లు సంభాషించుకొన సాగిరి :—

నాగ :—సకలమును జగన్మాత ఇచ్ఛామాత్రము చేతనే జరుగుచుండును. ఆమె ప్రపంచాతీతమగు శక్తి. ప్రతి కార్యము నామెయే జరుపుచుండును. కాని మనుజులు తాము చేయుచున్నా మనుకొందురు.

నరేం :—నీవు చెప్పు ఈ "ఆమెను" నే నొప్పుకొనఁజాలను. ఆత్మను నేనే. నాలోననే సకల చరాచర ప్రపంచముఁ గలదు. నాలోననే యది పుట్టి పెరిగి లయించుచుండును.

నాగ :—నీకొక తెల్లని వెంట్రుకను నల్లగఁ జేయుటకైనను శక్తి లేదు. ఇఁక ప్రపంచము మాట యేమి? ఈశ్వరేచ్ఛ లేనిచో గడ్డిపోఁచ యైనను గదలదు.

నరేం :—నా సంకల్పము లేనిదే సూర్యచంద్రాదులు తిరుగఁ జాలరు. సృష్టిచక్రమును నడుపుచుండునది నా సంకల్పమే.

ఈ సంభాషణ నంతయు నాలకించుచుండిన శ్రీ రామకృష్ణులు మహాశయులఁ జూచి "నరేంద్రుఁ డట్లనఁగలఁడు. అతఁ డొరనుండి తీసిన ఖడ్గము. అతఁడు అట్లు చెప్పుట అహంభావమువలనఁ గాదు" అనెను. శ్రీ రామకృష్ణుని మాటలు విని మహాశయులు నరేంద్రుని పాదములకు నమస్కరించి యూరకుండెను. అప్పటినుండి, నరేంద్రుఁడు శ్రీ రామ కృష్ణుని లీలకొఱకై యవతరించిన శివుఁడే యని భావించెను. ఒకపరి యొకానొకఁడు మహాశయులను "నీ వెప్పుడైనను ముక్తపురుషునిఁ జూచి యుంటివా?" యని ప్రశ్నింపఁగా నాతఁడు వెంటనే "అనేకులకు మోక్షమును బ్రసాదించిన శ్రీ రామకృష్ణునిఁ జూచితిని. శివుని యవతార మగు వివేకానందస్వామిని జూచితిని" అనెను. వాస్తవముగ నీతని విశ్వాసము పర్వతములను జలింపఁజేయఁజాలి యుండెను. శ్రీ రామ కృష్ణుని ముఖమునుండి వెలువడు ప్రతి వాక్యమును ఆయనకు వేద వాక్యము. పరిహాసమున నాడిన మాటలుగూడ నాతనికి ప్రమాణములే. "నేను అల్పజ్ఞుఁడను. ఆయన నెట్లు తెలిసికొనఁ గలుగుదును" అను వాఁడు.

ఒకమారు శ్రీ రామకృష్ణులు శిష్యులతో "వైద్యులకును న్యాయ వాదులకును నడిబేరగాండ్రకును పారమార్థిక సత్యములఁ దెలిసికొనుట కష్టము" అనెను. ముఖ్యముగా వైద్యులను గూర్చి "మందుచుక్కలపై నిలుకడ గొన్న మనస్సు బ్రహ్మాండమైన యీ ప్రకృతి నెట్లు తెలిసికొనఁ గల"దని చెప్పుచుండ మహాశయులు వినుట తటస్థించెను. ఈ కాలము ననే నాగమహాశయుని ధ్యానసమయములందు రోగుల స్వరూపములు జ్ఞప్తికి వచ్చి ధ్యానము చెడిపోవుచుండెను. అందువలన నీ హితవాక్యము తన్నుద్దేశించియే చెప్పఁబడెనని యాతఁడు తలంచెను. పారమార్థిక పథమున కంతరాయమగు నా వృత్తిని తత్క్షణమే విడనాడవలయునని నిశ్చయించుకొనెను. ఇంటి కరిగి యా దినమే తన మందులపెట్టెను వైద్య

గ్రంథములను గంగానదియందుఁ బడవైచి స్నాన మాచరించి గృహము నకు వెడలెను.

దీనదయాళున కీవార్త తెలిసెను. తోడనే యాతఁడు కలకత్తాకు వచ్చి తన కొమరుని తన స్థానమందు నియోగింపుఁడని "మెస్సర్సు పాలు ల"ను కోరెను. అట్లే వారు నియమించిరి. దీనదయాళు కలకత్తాను వీడి పోయెను.

నాగమహాశయుని పని చాల స్వల్పము. అప్పుడప్పుడు మాత్రము బాగుబజారునకును కిడ్డర్‌పూర్ కాలువలకును బోవలసి యుండును. ఈ పనియందుఁ బ్రవేశించిన తరువాత నాతనికి దక్షిణేశ్వరమునకుఁ బోవుటకుఁ గావలసినంత తీఱిక యుండెడిది. ఆయన ధ్యానకాలముకూడ నిప్పుడెక్కువ యయ్యెను. అతని గృహమందు పరిశుభ్రమైన యొక స్థల మున నొక పాత్రయందు పవిత్రగంగాజలము నుంచి గంటల తరబడి ధ్యాననిమగ్నుఁడై యుండును.

పనిమీద బాగుబజారునకు బోయినప్పు డా తోఁటలో నొక ఏకాంత ప్రదేశమున భగవద్ధ్యానము సల్పుచుండును. ఒకనాఁడిట్లు ధ్యానోప విష్టుఁడై యుండ నాతని కొక యద్భుత సాక్షాత్కారమయ్యెను. గృహమునకు మరలివచ్చిన తరువాత సురేశునితోఁ దా నెప్పుడును ధ్యానమున నట్టి యానందముఁ బొందలేదని చెప్పెను.

శ్రీ రామకృష్ణుని సాంగత్యబలమున నాతనికి విరక్తిభావము పెం పొందసాగెను. తత్‌క్షణమే ప్రపంచసుఖములను విడనాడి సన్న్యాస మును స్వీకరింపవలెనని యెంచి శ్రీ రామకృష్ణుని యనుమతి నడుగు టకై యాతఁడొకనాఁడు దక్షిణేశ్వరము వెళ్ళెను. శ్రీ రామకృష్ణుఁడు అప్పుడే సమాధినిమగ్నుఁడై ఇట్లు చెప్పుచుండెను: "గృహస్థ జీవితమునఁ గల లోపమేమి? మనస్సును ఎల్లప్పుడును భగవంతునియందే లగ్నము చేసియుంచుము. గృహమేధి జీవితము కోటలోనుండి యుద్ధముచేయుట వంటిది". ఏ దివ్యశక్తి తనయందు తీవ్రసన్న్యాసభావమును రగుల్పఁ జేసెనో యదియే ఇప్పుడు జనకచక్రవర్తివలె గృహస్థధర్మమున నుండుమని

వారిఁ జూపుచుండెను. శ్రీ రామకృష్ణుఁడు తరువాత నిట్లు చెప్పెను; "నీ జీవితము గృహస్థుల కందఱకు నాదర్శప్రాయముగ నుండఁగలదు". ఇది గుర్వాజ్ఞ గావున నాతఁడు శిరసావహించెను.

నాగమహాశయు లీ యాజ్ఞను శిరసావహించినను మనస్సునందలి యల్లకల్లోల మింకను నడంగలేదు. మనస్సును నిశ్చయపఱచుకొనఁజాలక రేయింబవళ్ళు భగవంతునిఁ బ్రార్థించుచు "హా జగన్నాథా, పరమేశ్వరా" యని నిట్టూర్పుల పుచ్చుచుండును. మంటలోఁ బడి పొరలును. ముండ్ల పొదలపైఁ బడి దేహమంతయు గాయపఱచుకొనును. ఆహారముపై నిచ్ఛ పూర్తిగ నశించెను. సురేశుఁడు బలవంతముగఁ దినిపించిననే తప్ప నాతఁడు భుజించి యెఱుఁగఁడు. తనముం దేమి జరుగుచుండెనో కూడ నాతనికిఁ దెలియదు. అతఁ డెచ్చటికిఁ బోవునోకూడ నెవ్వరు నెఱుఁగరు. ఒక్కొక్కప్పుడు పోయినదే పోకడగఁబోయి తెల్లవారు ఝామున రెండుగంటలకు వచ్చును. ఇట్లు తన కాలమంతయు మతి భ్రష్టునివలెఁ గడపుచుఁ దనకు నియమించిన స్వల్పకార్యములను గూడ నిర్వర్తింపఁజాలకుండెను. అందువలన నీతనితోఁ గొలఁది పరిచయ మున్నట్టియు, యోగ్యుఁడు నైన రంజితు హ్రా యను నింకొక యుద్యోగి యాతని కార్యములను నిర్వర్తించుచుండెను.

ఈ సమయముననే నాగమహాశయు లొకకొంత కాలము తన జన్మస్థానమునం దుండుట తటస్థించెను. ఈతని విషమస్థితిని జూచి భార్య భయభ్రాంత యయ్యెను. తన భర్తకు సంసారేచ్ఛ పూర్తిగ నశించినదని తెలిసికొనెను. నాగమహాశయుఁడు గూడఁ దాను శ్రీ రామ కృష్ణుని పాదములను శరణుజొచ్చిన పిదప కుటుంబమునకై ప్రాపరచి కానక్కుఁడగుట దుర్లభమని చెప్పెను.

నిక్కముగ శ్రీ రామకృష్ణుని జూచినది మొదలు నాగమహాశయుని మనస్సు ప్రపంచమునకు సంపూర్ణముగ విముఖమయ్యెను. అప్పటి యాతని మనఃస్థితిని విశదపఱచుట కొక సంఘటనము నిటఁ దెల్పెదము: నాగమహాశయుని సోదరి తోఁటయందొక అనపపాదును నాటియుండెను.

పొరుగింటివాఁడు ఆ పాదున కొకింత దూరమున తన యావును కట్టి యుంచెను త్రాడు చాల పొట్టి యగుటచే నాయావు ఆ పాదును దిన వలెనని ఎంత ప్రయత్నించినను అందలేదు. మహాశయులు దాని విఫల ప్రయత్నములను జూచుచుండి ఆ యల్పజంతువుపైని జాలిచేతనో లేక ఆ పవిత్ర గోమాతపైని భక్తిచేతనో ఏ కారణముననో యా త్రాటిని విప్పి "యమ్మా తిను" మనెను. ఆ గోవు తృప్తితీరఁ దినుచుండెను. దీని నంతయు దూరమునుండి దీనదయాళు చూచుచుండెను, మనసు పట్టఁ జాలక యాతఁడు కుమారునితో నిట్లనెను:

దీన :—నీవేమో కుటుంబమునకు నిస్సహాయుఁడవు. కుటుంబము నకు మేలు చేయకపోవుటయే గాక మీఁదుమిక్కిలి యిట్టి నష్టమునుగూడఁ గలుగఁజేయుటకు నీకెట్టి ధైర్యము! నీవు వైద్యవృత్తిని మానుకొంటివి. ఇఁక ఆఁకలిపిశాచము నెట్లు తరుమఁగలవు?

నాగ :—అవిషయమై నీ వాయాసపడవలదు. సర్వవ్యాపకుఁడగు నా దేవదేవుఁడే మన యోగక్షేమములను వహింపఁగలఁడు.

దీన :—అవును! ఈమాత్ర మెవరికిని దెలియకపోలేదు. నీకుఁ గట్టుకొనుటకు గుడ్డయైన లేక కప్పలను దినుచు దేశద్రిమ్మరిగఁ దిరుగ వలసిన కాలము వచ్చినది.

మఱల మాటాడక మహాశయులు కౌపీనమును తీసివైచి యొక చచ్చిన కప్పను దీసికొనివచ్చి తినుచుఁ దండ్రితో నిట్లనెను: "ఇప్పుడు నీ యాజ్ఞలను రెండింటిని శిరసావహించితిని. దయయుంచి యిఁకెన్నఁ డును కుటుంబ పోషణమునుగూర్చి తలపెట్టకుము. భగవన్నామమును స్మరించుచు కాలమును గడపుము. నేను తల వంచి ప్రార్థించుచున్నాను. ఈ ముదుసలి వయస్సునందు ఐహికవిషయములను ఎంతమాత్రమును తలపెట్టవలదు తండ్రీ" యనెను. దీనదయాళు కొమరునికి పిచ్చియెత్తిన దని నిశ్చయపడెను. అందువలనఁ గోడలిని బిలిచి యిఁక నాతని యిచ్ఛకు వ్యతిరేకముగ నెన్నఁడును బ్రవర్తింపవలదని చెప్పెను.

మహాశయులు తన తండ్రియింట నున్నంత కాలము ఆయనను సంసారమును మాట తలపెట్టనీయక యెల్లప్పుడును మతవిషయికములును భక్తిపూరితములు నగు గ్రంథములను చదివి తండ్రికి వినిపించువాఁడు. మఱియుఁ దండ్రితో వ్యర్థసంభాషణల సల్పువారిని దిట్టి వారితో, నిఁక ముందెన్నఁ డట్టి వృథాకాలయాపనము చేయవలదనియు లేకపోయినచోఁ దన గృహమునకు రావలదనియు ఖండితముగఁ జెప్పువాఁడు.

మహాశయులు కలకత్తాకు మరలివచ్చిన తరువాత సురేశుఁడు దీన దయాళుని స్థితి యెట్లున్నదని యడిగెను. అంత మహాశయులు నిట్టూర్పు పుచ్చుచు "మనుజుఁడు ప్రాపంచిక విషవృక్షఫల మొకవారు చవి చూచినఁ జాలును. అతని గతి యధోగతియే యగును. మహామాయ యనుగ్రహము లేనిదే అతఁడు తరింపఁజాలఁడు" అనెను. తన తండ్రి దుఃస్థితిఁ దలఁచుకొని యేడ్చుచు, "జయ శ్రీరామకృష్ణా! జయ శ్రీరామ కృష్ణా జయశ్రీరామకృష్ణ ప్రభూ! నా తండ్రిని కటాక్షింపవా" యనెను. దుఃఖ ముపశమించిన తరువాత సురేశునితో "నా తండ్రి యంత వృద్ధుఁడై కదలుట కశక్తుఁడైయుండియు ప్రాపంచికవిషయ లంప టుఁడై సదా యందే మునిఁగియుండును. మరియు పొరుగువాఁడెవఁడైన వచ్చుచో వ్యర్థసంభాషణకై యువ్విళ్లూరుచుండు" నని చెప్పెను.

అటుతరువాత నొకసారి శ్రీ రామకృష్ణుని దర్శింపఁబోయి యాయనతో "అయ్యా! నేనేల యింకను ఆ భగవంతునికి సంపూర్ణముగ నాత్మసమర్ప ణము చేసికొనలేకయున్నాను. ఇంకను పురుషప్రయత్నము పోకుండు టకు కారణమేమి?" అనెను. అందులకు శ్రీ రామకృష్ణుఁడు తన్ను నిర్దే శించుచు "దీనియెడల నీకు భక్తి కుదిరినచో అంతయుఁ జక్కఁబడును" అని చెప్పెను.

నాగమహాశయుని గాఢమగు సన్న్యాసభావమును గనుఁగొని మఱల శ్రీ రామకృష్ణుఁడు "నీవు గృహస్థుఁడవేయై యుండుము. నీ కుటుంబ పోషణ మెట్లో జరిగిపోవుచుండును" అనెను.

నాగ :—గృహస్థుఁడనై యుండుటకు ఎట్లు వీలగును? ఇతరుల కష్టములను జూచుచుఁ జలింపకుండుట సాధ్యమా?

శ్రీరామ :—నేను జెప్పుచున్నాను వినుము. ఇంటిని వీడిపోకుము సంసారము నిన్నంటఁజాలదు. నీ జీవితమును జూచి యందఱు నాశ్చర్య పడఁగలరు.

నాగ :—గృహస్థుఁడనై నేను నా దినముల నెట్లు గడుపవలెను?

శ్రీరామ :—నీవేమియుఁ జేయనక్కఱలేదు. ఎల్లప్పుడును సజ్జన గోష్ఠియం దుండుము.

నాగ:—మందబుద్ధినైన నేను సజ్జన దుర్జనుల నెట్లు గుర్తింపఁ జాలుదును?

శ్రీరామ:—నీవు వారికొఱకై వెదకుచు పోవనవసరము లేదు. ఇంటి యందే యుండుము. నీ కొఱకై వారే వత్తురు.

ఇట్లు దినములు గడవఁగా నాగమహాశయులు తాను కుటుంబపోషణకై పాటుపడవలయునేని తనకు శాంతి యెంతమాత్రమును జేకూరఁ జాలదని తెలిసికొనెను. ఆ కార్యణమున తన పనియంతయు రంజితు హజ్రా కప్పగించి తన కాలమును భగవద్ధ్యానమునఁ గడుప నిశ్చయించు కొనెను. ఒకనాఁడు సందర్భవశమున నీసంగతి "మెస్సర్సు పాలులు"కుఁ గూడ ఎఱుక పఱచెను. అంత వారు "అట్లయిన నీ కుటుంబము నెట్లు పోషించుకొనఁగలుగుదు"వని యడిగిరి. "రంజిత హజ్రా దయఁదలఁచి యిచ్చిన స్వల్పముతోడనే పోషణ జరుపుకొందు" నని ప్రత్యుత్తర మిచ్చెను.

"మెస్సర్సు పాలులు" నాగమహాశయు లేఁక కుటుంబమున కెట్టి సాయమును జేయఁజాలఁడని గ్రహించిరి. ఇంతకాలము తమపై నాధార పడియుండిన యా కుటుంబమును పోషించు భారము తమదని రంజితునిఁ బిలిచి యాతని నగపాలు రాబడి మహాశయుల కిచ్చునట్లు ఏర్పాటుచేసిరి. రంజితు సంతోషపూర్వకముగ నొప్పుకొనెను. కాని యాతఁడు మహా

శయుని మనోభావమును బాగుగ నెఱింగినవాఁడు కావున కుటుంబ భోజన ఖర్చులకు మాత్ర మాతనియొద్ద నిచ్చి మిగిలిన పైకము నాతఁడు దీన దయాళునికిఁ బంపుచుండెను.

శ్రీ రామకృష్ణు లీ సంగతి విని చాల సంతసించి "బాగుబాగు" అనెను.

ఇప్పు డన్ని బంధములనుండియు విముక్తుఁడై మహాశయులు తన కాలమంతయు ధ్యానాదులయందే కడపుచు తఱచు శ్రీరామకృష్ణుల దర్శించుచుండెను. సాధారణముగా నాతఁడు ఆదివారమునాఁడును ఇతర సెలవురోజులయందును దక్షిణేశ్వరమునకు వెళ్లువాఁడు కాఁడు. ఏల యన అట్టి రోజులయందు గొప్పగొప్ప స్థితిమంతులును విద్వాంసులును శ్రీరామకృష్ణుని దర్శింప వత్తురు. వారితో మాటలాడుటకుఁ దా ననర్హుఁడ నని యాతని నిశ్చయము. కాని యప్పుడా నియమమును వదలి తఱచు పోవుచుండుటచేఁ గొందఱితోఁ బరిచయము కలిగెను.

ఒకరాత్రి * గిరీశుఁ డిర్వురు మిత్రులతో దక్షిణేశ్వరమునకు వచ్చెను. అతఁడు శ్రీరామకృష్ణుని గదిలోనికిఁ బ్రవేశించి యచ్చటఁ జేతులు జోడించుకొని చాల వినతభావముతో నొక మూల నొదిగి కూర్చొనియుండిన యొక వ్యక్తిని జూచెను. దేహము శుష్కించి వికారముగ నుండినను నేత్రములు శాంతియుతములై ప్రజ్వలించుచుండెను. గిరీశుఁ డాతఁడెవ్వరా యని నివ్వెఱపడి చూచెను. అంత శ్రీ రామకృష్ణుఁడు గిరీశున కాతని పరిచయపఱచెను. ఆ శుభ సమయమునుండియే గిరీశ మహాశయు లిర్వురును ప్రాణమిత్రులై యుండిరి.

నాగమహాశయుఁడు సాయంతనములఁ దఱచు గంగానదీ తీరమున గడపువాఁడు. ఒకనాఁ డట్లు నదీతీరమున నడయాడుచుండ నొక వర్చస్వియగు యువకునిఁ గాంచెను. యువకునిఁ జూడఁగనే మహాశయు లాతఁడు

---

* గిరీశచంద్రఘోషు ప్రసిద్ధ బంగాళీనటుఁడు, శ్రీ రామకృష్ణుని ప్రియభక్తుఁడు.

శ్రీ రామకృష్ణుని భక్తుఁడై యుండవలయు ననుకొనెను. యువకునిఁ బ్రశ్నింప నాతని యూహ సత్యమయ్యెను. అతఁడు తురీయానంద స్వామి (అప్పుడు హరిమహారాజ్). నాగమహాశయు లాతని కఠోర బ్రహ్మ చర్యమునుగూర్చి చెప్పుచు "ఇట్టివాఁడు గనుకనే శ్రీ గురుదేవుని కృపకుఁ బాత్రుఁడయ్యె" ననువాఁడు.

ఇప్పటినుండి మహాశయులు చొక్కాను జోళ్ళను ధరించుట మానివైచెను. ఒక యుత్తరీయమును మాత్రము కప్పుకొనును. భోజనము విషయమునమాత్ర మాతఁడెట్టి నియమములను బెట్టుకొనలేదు. ఏల యన శ్రీ గురుదేవుఁడు "నీకేమి భగవంతుఁ డొసఁగునో, దానితో జీవించి యుండుము. నీకు వేఱు నియమము లేమియు వలదు" అని చెప్పి యుండెను. సాధారణముగ నాతఁడు దినాంతమునఁ గొలఁదిమాత్రము భుజించును. అయినను జిహ్వాచాపల్యము నాపుట కుప్పును దీపిని ముట్టుట మానివైచెను.

నాగమహాశయుఁడు తన గృహములోఁ గొంతభాగము కీర్తివాసుఁ డనునాతనికి బాడుగకిచ్చెను. అతఁడు బియ్యపు వర్తకముఁ జేయుచుఁ గుటుంబముతో నందుండువాఁడు. ఆ హేతువున అప్పుడప్పు డిల్లంతయుఁ దవుడుతో నిండియుండును. మహాశయు లొకతూరి తానిఁక నా తవుడునే భుజించి యుండవలయు ననుకొనెను. "ఈ దేహము నిల్పుట కదియే చాలును. రుచికరములగు పదార్థము లెందులకు" అని నిశ్చయించుకొని యా తవుడును నీటిలోఁ గలిపి రెండు దినములు దానినే భుజించియుండెను. ఇది కీర్తివాసునకుఁ దెలియనయ్యెను. తోడనే యాతఁడా తవుడునంతయు నమ్మివైచి యంతకుఁ దఱువాత ఎన్నఁడు నింటియందు తవుడు పోగు వడకుండునట్లు చూచుచుండెను.

కీర్తివాసునకు, నాగమహాశయుని పావనజీవితము ఆతనియం దమిత గౌరవమును గలిగించెను. అందుచే నతిథిసత్కారమున కేమైన లోటువచ్చిన నాతనికి సాయపడువాఁడు. మహాశయుల గృహము రాజ బాటకుఁ బ్రక్కనే యుండుటచే నెందఱో బిచ్చగాం డ్రాతని ఇంటికి వచ్చు

చుందురు. వారిలో నెవ్వరినిగూడ రిక్తహస్తునిగఁ బంపుట లేదు. ఒక దినమున నొక వృద్ధవైష్ణవుఁడు భిక్షార్థియై వచ్చెను. మహాశయులయొద్ద నొకరికి సరిపడు అన్నము తప్ప నేమియు లేదు. కీర్తివాసుఁ డింటియొద్ద లేఁడు. అంత నాతఁ డతినమ్రతతో నాతని దరి కేగి "యయ్యా నాయొద్ద కొలఁది బియ్యముమాత్ర మున్నవి. స్వీకరింతురా" యని యడిగెను. ఆ వృద్ధుఁ డాతని నమ్రత కాశ్చర్యపడుచు సంతసమున నా బియ్యముఁ గొంపోయెను.

నాగమహాశయు లెన్నఁడును ఫలాహారము చేసి యెఱుఁగడు. భగవంతునికి నైవేద్యము చేయని భక్ష్యముల నాతఁడు తీసికొనఁడు. తాను రుచికరములగు పదార్థముల నెన్నఁడును ముట్టకపోయినను అతిథుల నట్టి పదార్థములచేతనే తృప్తిపఱచును.

మహాశయులు ప్రాపంచికవిషయముఁ గూర్చి మాటలాడరు. ఒరు లేరైన నట్టి సంభాషణయం దున్నయెడల నాతఁడు అతి చాకచక్యముగ "జయ శ్రీరామకృష్ణ" యనుచు "ఈ వ్యర్థసంభాషణవలన నేమి లాభము. దయయుంచి భగవన్నామము నుచ్చరించుచుఁ గాలమును గడపుఁడు. జగన్మాతకు నమస్కరింపుఁడు" అనును. ఏదైన కారణమున తన కొరులపైఁ గోపముగాని, యసూయగాని జనించినయెడలఁ దనప్రక్క నేది యున్న దానితోఁ దన దేహమును మర్దించుకొనును. ఒరుల దుర్గుణములఁ నాతఁడు గణింపఁడు. ఒకమాఱు మాట సందర్భమున నొకని దుర్గుణములఁ బేర్కొనెను. మరుక్షణముననే ప్రక్కనున్న యొక రాతితోఁ దలను మోదుకొన నారంభించెను. రక్తము బాగుగాఁ గారి యా గాయము నెలరోజులవఱకు మానలేదు. కాని యాతఁడు సంతసమునఁ "దగిన శాస్తి యైనది. మంచిపని యైనది. ఈ దుష్టునకుఁ దగిన బహుమానము లభించిన" దనెను.

తన మనోవికారముల నణఁచుటకై యాతఁడు తఱచు దీర్ఘోపవాసము లుండును. ఒక్కొక్కసారి యైదారు దినముల వఱకు జలమునుగూడ ముట్టక ఉపవాసముండును.

అట్టి యొకానొక సందర్భమున సురేశుఁ డాతని యింటికిఁ బోయి యుండెను. ఆ సమయమున నేమి యభిప్రాయము గలిగెనో కాని సురేశునిఁ జూడఁగనే వండుచున్న కుండను శకలములఁ గావించి యేడ్చుచు "సురేశా! నాకింకను క్రూరత్వము నశించినది కా" దనెను. ఆ దినమున భోజనము సేయక ఒక దమ్మిడి యటుకులను దిని యుండెను.

నాగమహాశయునకుఁ దలనొప్పి దీర్ఘవ్యాధి యగుటచే స్నానము విడువవలసివచ్చెను. కడపటి ఇరువది సంవత్సరములు అతను స్నానము చేయనేలేదు. అందుచే అతని శరీరము యెండి కఱకుగా నుండెను. దానిపై ఘోరమగు తపస్సు. ఇవి యన్నియుఁ గూడి యాతని శరీరము యొక్క ప్రతిభాగమును అతని నమ్రతను జాటుచుండెను. వేయేల, నమ్రతయే యట్టి రూపముఁ గైకొన్న యట్లుండును. "నాగమహాశయులు అహంభావము యొక్క శిరమును చితుకఁగొట్టి, చితుకఁగొట్టి దానిని పగులఁగొట్టె" నని గిరీశబా బనువాఁడు. మహాశయులు వీధి వెంబడిఁ బోవునప్పుడు కూడ నితరులను అతిక్రమించి ముందునకుఁ బోవువాఁడు కాఁడు. సాధారణ బాటసారులకుఁ గూడ త్రోవ యిచ్చి తొలఁగును. పరుల నీడనైనఁ ద్రొక్క సాహసింపఁడు. ఇతరులు కూర్చొనియున్న ప్రక్కపై నాతఁడు కూర్చొనఁడు. ఎందువలన నన నాతఁడు సర్వవస్తు సముదాయమునను భగవంతునిఁ జూచును. తాను భగవత్సేవకుఁడు. అట్టిచోఁ దానెట్లు ఈశ్వరుఁడు సేయు సపర్యల నంగీకరింపఁగలఁడు? కాని ఈ సేవకుఁడు ఆ సర్వవ్యాపి యగు పరమేశ్వరుఁ డేరూపమున వచ్చి నను బరిచర్య సేయుటకుఁ దయారుగ నుండును. ఒరులు తయారుచేసి యిచ్చిన పొగాకుచిలుముల నాతఁడు త్రాగఁడు; కాని తా నందఱకుఁ దయారుసేయును. స్నేహితుఁ డింటికి వచ్చినపుడు అతనికి చిలుములు తయారుచేసి యిచ్చును. ఆ మిత్రుఁడు వెళ్లునపుడుగూడ నాపి యిఁక రెండు చిలుములను గాల్పుమని కోరును. "నే నల్పుఁడను. హీనుల కంటె హీనుఁడను. నే నెట్టి గొప్పకార్యమును జేయఁజాలిన వాఁడను గాను. మీకందఱి కిట్లు చిలుములను దయారుచేసియైన మీ కృపకుఁ బాత్రుఁ డనై నా జన్మమును సార్థకముఁ గావించుకొందు" ననును.

నాగమహాశయులు, ♦ రాగమార్గసాధకుఁడైనను, వైధిభక్తి యన నిష్టపడువాఁడు. తాను గష్టతరములగు సాధనలఁ జేయుటయే కాక నితరులనుగూడ అటుల నడచుకొనుమనును. ఈ విషయమై సురేశునితో నొకనాఁడు వాదము జరిగెను. సురేశుఁడు క్వెట్టాకుఁ బోవలసివచ్చెను. క్వెట్టా ప్రయాణమునకు ముందు మహాశయులు సురేశుని గురూపదేశ మందుమని ప్రార్థించెను. కాని సురేశునికి మంత్రములందు నమ్మకము లేకపోవుటచే నాతనితో వాదించి యెట్టకేలకు నాతనిప్రార్థనపై శ్రీ రామకృష్ణు లెట్లు చెప్పిన అట్లు చేతుననెను. మరునాఁడిర్వురు మిత్రులును దక్షిణేశ్వరమున కేగిరి. కూర్చొని కొంచెము స్థిమితపడిన తరువాత నాగమహాశయు లీ సంగతి ప్రసంగమునకుఁ దెచ్చెను. "అవును నీవనినది నిజము. ఉపదేశానంతరము ధ్యానాదుల నుపక్రమించుట మంచిది. సురేశా! నీ వెందుల కంగీకరింపఁగూడ" దని శ్రీ రామకృష్ణు లనెను. సురేశుఁ "డయ్యా! నాకు మంత్రములందు నమ్మిక లే" దనెను. అంత శ్రీరామకృష్ణులు నాగమహాశయులవైపు తిరిగి "ఇప్పు డవసరము లేదు. కొంతకాలమున కదియే సిద్ధించు" ననెను.

సురేశుఁడు క్వెట్టాకుఁ బోయిన కొంతకాలమునకు గురూపదేశ పుం దభిలాష జనించెను. కలకత్తాకు వచ్చి శ్రీ రామకృష్ణులయొద్ద ఉపదేశము నొంద నిశ్చయించుకొనెను. కాని యాతఁ డచ్చటికి వచ్చునరికి దక్షిణేశ్వరజ్యోతి చలించుచుండెను. తాను నాగమహాశయుని వాక్యముల నరకుగొనినందులకు విచారించెను— శ్రీ రామకృష్ణులు దివంగతులైరి. సురేశుఁ డెంతయో విచారించి తన యదృష్టమును నిందించుకొనెను. ప్రతిరాత్రియు గంగాతీరముపైఁ దన ఈ తీరని కష్టమునకు దుఃఖించుచుఁ గడుపుచుండెను. ఒకసారి శపథముపట్టి యా యొడ్డుననే పరుండెను. ప్రాతఃకాలమున నుదయాత్పూర్వమే యాశ్చర్యజనకముగ శ్రీ రామ

---

♦ రాగభక్తియందు భక్తుఁడు ఎల్లప్పుడు తన ఇష్టదైవముయొక్క సాన్నిధ్యముననే యుండును. కావుననే వైధిభక్తి యందలి పూజావిధానము లను వీరు చేయరు.

కృష్ణులు గంగానదీ గర్భమునుండి తన వైపునకు వచ్చుచుండుటఁ గాంచెను. ఆ వ్యక్తి సమీపించి యాతని చెవిలో నొక మంత్రము నుపదేశించెను. సురేశుఁ డాతని పాదములకు మ్రొక్కి పాదధూళి స్వీకరింప నెంచెను. కాని యా యద్భుతవ్యక్తి యంతలో అదృశ్యమాయెను.

మహాశయులు శ్రీ రామకృష్ణుని ప్రథమమునఁ జూచి ఇప్పటికి నాలుగు సంవత్సరము లయ్యెను. శ్రీ రామకృష్ణుఁడు తన యవతారమును జాలించు కాలము సమీపించుచుండెను. దక్షిణేశ్వరలక్ష్మి యస్తంగత మయ్యెను. దివాంతమున సూర్యుఁడు తన బంగారుకాంతి నింకను వెద జల్లుచుండినను రానున్న యంధకారమప్పుడే భక్తజనచిత్తములను నింపి వేసెను. శ్రీ రామకృష్ణుఁడు కలకత్తా కుత్తరమున నున్న "కాశీపురము" లో కాత్యాయనీరాణి యల్లుఁడగు గోపాలబాబు తోఁటయింటియందు వ్యాధిగ్రస్తుఁడై యుండెను. జగన్మాత తన ప్రియపుత్రునిఁ దనలో నైక్యము గావించుకొని మానవ దృష్టిపథమునకు దూరము సేయఁబోవుచుండెనని మహాశయులు తెలిసికొనిరి. ఈ సమయమున గురు సందర్శనమునకై యాతఁడు తఱచు పోలేక యుండెను. "ఆయన బాధను నేరుగఁ జూచు టనుగూర్చి నేనేమని చెప్పగలను. ఆ బాధను దలపోయుటకే నా హృదయము శకలములై పోవుచుండెను. అయన తనకుఁ దానే యాబాధ తెచ్చి పెట్టుకొనియుండ నే నద్దానిని నివారింపలేక యుండి అయన యొద్దకుఁ బోఁగూడదని నిశ్చయించుకొంటిని. ఎప్పుడో తప్ప తఱచు అచ్చటికిఁ బోలేకపోయితిని" అని నాగమహాశయులు చెప్పువారు. శ్రీ రామకృష్ణుని దేహ మగ్నివలె మండుచుండెను. ఒకనాఁడు మహాశయులు ప్రక్క నుండుటఁ జూచి "మహాశయా! ఇటురమ్ము. ఇటు రమ్ము. నా ప్రక్కను గూర్చొనుము. నీ శీతల శరీరస్పర్శమువలన నా బాధ యుపశమించు" నని చాలసేఁపటివఱ కాతని యొడిలోఁ గూర్చుండెను.

సురేశుఁడు క్వెట్టానుండి మఱలి శ్రీరామకృష్ణులఁ జూడవచ్చి నప్పుడు "ఆ వైద్యుఁడేడి? అతఁడు మందునిచ్చునని యెఱుఁగుదును. అతని నొకసారి పిలిపింపు" మనెను. అంత సురేశుఁ డీ సంగతి నాగ

మహాశయుని కెఱుకపఱచెను. మహాశయు లాజ్ఞాబద్ధులై "కాశీపురతోఁట" కుఁ బోయెను. శ్రీ రామకృష్ణు లీతనిఁ జూచి "వచ్చితివా? మంచిది. భిషగ్వరులు, ఆయుర్వేదభూషణులు, రోగమును కుదుర్పలేక వదలు కొనిరి. నీ వేమైన మంత్రమువేసి ఈ రోగమును మాన్పఁగలవా? నీవు కుదుర్పఁగలవేమో చూడు" మనెను. మహాశయులు తలవంచి కొంచె మాలోచించి, తన దృఢసంకల్పశక్తిచే నారోగమును దనలోనికిఁ దీసికొన నిశ్చయించుకొనెను. అంత ఉద్రేకముతో "ఆ తెలిసికొంటి. నీ కృపా మహిమచే సర్వమును దెలిసికొంటిని. ఈ క్షణముననే ఈ వ్యాధి కుదురఁగల" దని కేక వేయుచు శ్రీరామకృష్ణుని సమీపించుచు వచ్చెను. గురువు శిష్యుని మనోనిశ్చయము నెఱుఁగును. ఆతని యభి ప్రాయమును దెలిసికొని శ్రీరామకృష్ణుఁ డాతని నావలకు నెట్టివేసి "అది నీకు సాధ్యము. నీవు కుదుర్పఁగల" వనెను. గురువొక దురవగాహ సమస్య, శిష్యుఁడును అట్టి సమస్యయే.

శ్రీ రామకృష్ణులు దేహమును జాలించుటకు అయిదారు దినములకు ముందు మహాశయులు ఆయనను జూడఁబోయెను. గదిలో నడుగు పెట్టు సమయమున శ్రీరామకృష్ణులు శిష్యులతో నిట్లనుచుండెను. "ఉసిరిక కాయ ఎక్కడైన దొరకునా? నా కన్నిటియందును అరుచి యెక్కువ యైనది. ఒక యుసిరికకాయఁ దినినచో ఆ యరుచి తగ్గుననుకొనెదను". అచ్చట నున్న శిష్యులలో నొకరు "అయ్యా! యిది యుసిరికకాయల కాలము కాదు" అనెను. నాగమహాశయులు "ఉసిరిక" యను మాట గురుముఖమునుండి వెలువడినదనిన అది ఎచ్చటనైన దొరికి తీరవలెను. ఎందువలన నన అయన ఏవస్తువు కోరునో యది తప్పక అతని కడకు వచ్చితీరును అని యాలోచించెను. ఒకసారి శ్రీ రామకృష్ణు లద్భుతా నందునితో నారింజపండు తినవలయునని యున్నదనెను. ఆ సంగతి ఏమియుఁ దెలియకపోయినను ఆ దినముననే నాగమహాశయులు నారింజ పండ్లను దీసికొని వచ్చెను. అప్పు డాయన ఎంతయో ప్రీతిపూర్వకముగ నొక పండును దీసికొనెను. ఈ సంగతి జ్ఞాపకము తెచ్చుకొని మహాశయు లెవరితోడను జెప్పకయే ఉసిరిక కాయలను వెదకుచుఁ బోయెను. రెండు

దినములు గతించెను. కాని మహాశయులు మరల రాలేదు. ఈ రెండు దినములును ఉసిరికకాయలకై తోఁటవెంబడి తోఁటగాఁ దిరుగుచుండెను. మూఁడవ దినమున నుసిరిక కాయలతో శ్రీరామకృష్ణుల యెదుట నాతఁడు ప్రత్యక్షమయ్యెను. గురుదేవుని యానందమునకు మేరలేదు. బాలుని వలె సంతోషపారవశ్యతఁ జెంది "ఆహా ఇట్టి కాయ లీ యకాలమున నెట్లు తేగల్గితి" వని రామకృష్ణానందుని బిలిచి మహాశయులకు వంట సిద్ధము చేయుమనెను. మహాశయులు గురుదేవుని ప్రక్కఁ గూర్చొని విసరుచుండెను. వంట సిద్ధమయ్యెను. కాని మహాశయులు భోజనమునకు లేవఁడాయెను. శ్రీరామకృష్ణుని మాటపై లేచెను. భోజనము ముందుఁ గూర్చుండెను గాని భోజనమును ముట్టఁడు. "నేఁడేకాదశి, ఉపవాసదినము, అయినను శ్రీరామకృష్ణులు తన హస్తముతో ప్రసాదమిడిన స్వీకరింతును" అని మనసున ననుకొనెను. కాని వెల్లడిచేయలేదు. నాగమహాశయు లెంతసేపటికిని భోజనమును ముట్టకపోవుటచే శ్రీరామకృష్ణుల కీ విషయము నెఱింగించిరి. ఆయన ఆ పదార్థములను దన యొద్దకుఁ గొనిరమ్మనిరి. రామకృష్ణానందుఁ డట్లే వాని నాయన ముందిడెను. శ్రీ రామకృష్ణు లందొక కొంత నాలుకతోఁ దీసికొని "ఇప్పు డాతని కిందు. స్వీకరించు" ననెను. రామకృష్ణానందుఁ డా పదార్థముల నట్లే యాయన కిడెను. అంత మహాశయులు "ప్రసాదము మహాప్రసాదమని" యా పదార్థముల ముందు సాష్టాంగపడి యాకుతో సహితముగ భుజించెను. ఎన్నఁడైన నాతనికిఁ బ్రసాద మిడుచో నందు లేశమైన విసర్జింపఁడు. మహాశయులయం దా దినమున దివ్యభావము కానుపించెనని రామకృష్ణానందుఁ డనెను. ఇది జరిగిన తరువాత నాతని కెన్నఁడు నాకులలో ప్రసాద మిడువారుకారు. ఒకతరి ఎన్నఁడైన నాకులో వడ్డించినను, భోజనము ముగియువఱకు వేచియుండి యాకును లాగుకొనుటకు సిద్ధముగ నుండువారు. ఏదైన పండ్లనిచ్చునప్పు డందలి గింజలు, టెంక మున్నగునవి తీసి యిచ్చువారు.

౧౮౮౬ వ సం॥ అగస్టు ౧౬వ తేదీని శ్రీ రామకృష్ణులు మహాసమాధినొందిరి. ఈ సంగతి తెలిసి నాగమహాశయులు శ్మశానవాటికకుఁ బోయి యా దినమంతయు నిరాహారుఁడై యుండెను. గురుదేవుని మహా

సమాధి యనంతరము శిష్యు లందఱును వివేకానందస్వామిని జుట్టు ముట్టిరి. వారి కాతఁడు మార్గదర్శకుఁడై మిత్రునివలె నుండెను. ఆతనికి నాగమహాశయు లాహారమును విసర్జించి, ముసుఁగిడుకొని తన యింట నొకమూలఁ బరుండియున్నాఁడని తెలిసెను. అంత అఖండానంద తురీ యానంద స్వాములతోఁగూడ నాతఁడు మహాశయుల గృహమున కేగెను. ఎంతయో బ్రతిమాలిన తరువాత మహాశయులు మంచమునుండి లేచెను. వివేకానందుఁ డంత "నీ ఇంటి కాతిథ్యమునకు వచ్చితి" మనెను. మరుక్షణముననే మహాశయులు సరకులకొఱకు బజారునకుఁ బోయెను. ఇంతలో ఈ మువ్వురతిథులును స్నానమాచరించి యొక మంచముపైఁ గూర్చొని శ్రీ రామకృష్ణులగూర్చి ప్రసంగించు కొనుచుండిరి. వంటకము సిద్ధమైన తరువాత ముగ్గురికిని వడ్డించెను. వివేకానందుని కోరికపై వేఱొక యాకులోఁగూడ వడ్డించెను. పిమ్మట మువ్వురతిథులును మహాశయుల భుజింపుమని కోరిరి. కాని యాతఁడందుల కంగీకరింప లేదు. అంత వివేకానందుఁడు "మీరు తినుఁడు. అనంతర మాతఁడు భుజించు" ననెను. భోజనానంతరము మఱలఁ బ్రార్థించిరి. అందులకు మహాశయు "లయ్యో! భగవంతుని యనుగ్రహము సంపాదింపఁజాలని ఈ దేహమున కెట్లాహార మిడఁగల" ననెను. "అయ్యా! మీరు భుజింప నిచో మిమ్ము విడువఁజాల" మని వివేకానందుఁ డనెను. ఎట్టకేల కెం తయో బలవంతముపై మహాశయులచే భుజింపించిరి.

శ్రీ రామకృష్ణు లవతారమును జాలించిన తరువాత నాయన శిష్యుఁ డును బాగ్‌బజారు వాసుఁడు నగు శ్రీయుత బలరామబోసు నాగమహా శయులను పూరియం దుండమని కోరెను. "మెన్సర్సు పాలులు" నవ ద్వీపమునం దుండు మని బలవంతపెట్టిరి. ఇర్వురును ఖర్చులను భరింతు మనిరి. కాని మహాశయులు "నన్ను గురుదేవు లింటియొద్దనే యుండుమ నట్లాజ్ఞాపించిరి. ఆయన యాజ్ఞను జవదాఁటుటకు నాకెట్టి హక్కును లే" దని వారి కోరికలను నిరాకరించి గుర్వాజ్ఞప్రకారము తన యూరియందుఁ దన ఇంటియొద్దనే యుండిపోయెను.

భాగ్యకుల వాసులగు "కుందూ" కుటుంబమువారు అతనిని నెలకు ఏఁబది రూప్యముల వేతనముపైఁ దమ గృహవైద్యునిగ నుండుమనిరి. కాని మహాశయు లొప్పుకొనలేదు.

---

## జన్మస్థాన నివాసము

నాగమహాశయు లిప్పుడు వృద్ధుఁడగు తండ్రికిఁ బరిచర్య సేయుచు నింటియందే యుండిపోయెను. దీనదయాళు వార్ధకతచే బలహీనుఁడై యుండెను. మహాశయు లాతని పరిచర్యయం దప్రమత్తుఁడై యాతని యిష్టప్రకారము నడచుకొనుచుఁ బ్రేమతోఁ బుత్రవిధి నెఱవేర్చుచుండెను.

ఒకసారి దీనదయాళు విచారముతో "అందఱును జగన్మాతను సేవించుచున్నారు. మన యార్థిక పరిస్థితి బాగుండుచో మనముగూడ అట్లు చేయవచ్చును. కాని మనమట్టి యదృష్టమును సేఁచుకొనలేదు. దుర్గాచరణుఁడు ధనము నార్జించుటను వదలివేసెను" అనెను. మహాశయు లిది విని యా వత్సరమాది ప్రతి సంవత్సరమును దుర్గాపూజ, కాళీపూజ, జగద్ధాత్రిపూజ, మొదలగువానిని ఒనర్చి తండ్రికోఱతను తీర్చి సంతోషపెట్టుచుండెను. తండ్రియెదుట నెప్పుడును భాగవతము మొదలగు పురాణములను పఠించుచుఁ బ్రాపంచిక విషయములను దలపెట్టనీయక చూచుచుండెను. పుత్రుని ప్రయత్నములవలనఁ దండ్రి మనస్సు మార్పుచెందెను. మహాశయులు ప్రతి సంవత్సరమును, శారదోత్సవమునకు వలయు సంబారములకై కలకత్తాకుఁ బోవును. అట్టి యొకానొక తరుణమున సురేశునితో "నా తండ్రి పూర్తిగ మార్పుఁజెందెను. ప్రాపంచిక విషయములపైఁ దలంపులఁ బోనీయక సర్వదా భగవన్నామమునే జపించుచున్నాఁ"డని చెప్పెను.

తూర్పుబంగాళము తాంత్రిక సాధనలకుఁ బ్రసిద్ధికెక్కినది. అచ్చట భక్తికంటె నద్భుత కార్యప్రదర్శనములకే విలువ యెక్కువ. వివేకానంద

స్వామి యొకసారి "తూర్పు బంగాళమున వైష్ణవ, తాంత్రిక సాధనల కెక్కుడు ప్రాముఖ్యత కలదు. వామాచార సాధనలకుఁ బ్రసిద్ధికెక్కిన ఇట్టి వేఱొక రాజధానిని నే నెఱుఁగ "ననెను. శ్రీ రామకృష్ణు లొకసారి నాగమహాశయుని "మీ రాజధానియందు గొప్ప సాధువులు గలరా" యని ప్రశ్నింప నాతఁడు లేరని ప్రత్యుత్తర మిడెను. అతనికి గంగాతీరముననే తక్క వేఱొకచోట నిజమైన భక్తులు జన్మింపరని నమ్మిక. గొప్ప విద్వాంసులును, తార్కికులును ఉండిన ఉండవచ్చును.

మహాశయులు తన ఇంటియందు నివాసమేర్పఱచుకొనుటకుఁ బూర్వము, తూర్పుబంగాళములోఁ గీర్తియుతులైన నతోబార్ విజయకృష్ణ గోస్వామి పూర్ణభక్తితత్త్వము నుపదేశించుచుండెను. విజయుఁడు శ్రీ రామకృష్ణుని శిష్యుఁడని మహాశయు లెఱుఁగుదురు. తన జన్మస్థానమునకు వచ్చిన తరువాత నతఁ డొకసారి పనిమీఁద ఢక్కాకుఁ బోవలసి వచ్చెను. ఆ తరుణమున విజయుని దర్శన మయ్యెను. విజయుఁడు మహాశయుల నెఱుఁగఁడు. కాని తన దివ్యదృష్టిచేఁ దన దరికి వచ్చి యున్న యతఁ డున్మత్తుఁ డొక మహాపురుషుఁడై యుండవలెనని తెలిసికొనెను. సంభాషణవశమున మహాశయుఁడు శ్రీ రామకృష్ణుని శిష్యుఁడని తెలిసినంత విజయుని సంతసమునకు మేర లేకుండెను. అతనిని సమీప బంధువునివలె నాలింగన మొనర్చుకొనెను. మహాశయులకుఁ గూడ విజయునియందు భక్తి గౌరవము లుదయించెను. కాని యాతఁడు శ్రీ రామకృష్ణుని జూచియుండియు ఇంకను ఇతర సాధువులఁ జూడ నేల యాతురపడుచుండెనో యని యాశ్చర్యపడెను. విజయునివంటి వారలే అట్లు మోసపోవుచున్న నిఁకఁ దదితరుల గతి వేఱుగఁ జెప్పవలయునా యని యనుకొనెను. గిరీశబా బొకతరి విజయుఁడు శ్రీ రామకృష్ణుని సమక్షమున నిమీలిత నేత్రుఁడై ధ్యాన మొనర్చుచుండుటను జూచి "కండ్లారఁ జూచి యానందింపవలసిన మహాత్ముని ఎదుటఁ గూర్చొని కండ్లు మూసికొను నవివేకి యెవఁడు" అని చెప్పెను. మహాశయులీ వాక్యమును విని గిరీశబాబు గొప్ప విద్యానిధి యని పొగడుచు నాతనికి సాష్టాంగము నమస్కరించెను.

తూర్పు బంగాళమున బారదీ బ్రహ్మచారి కెక్కుడు పలుకు బడి యుండెను. ఈయన శిష్యుఁడగు బ్రహ్మానంద భారతి కోరికపై మహాశయు లొకమారు బారదీకిఁ బోయెను. ఇంతకుఁ బూర్వము, బ్రహ్మానందుఁడు తారాకాంత గంగోపాధ్యాయుఁడని పిలువఁ బడుచుండెను. తారాకాంతుఁడు న్యాయవాదవృత్తివలన చాల ధనము గడించెను. మొదటినుండియు ఈతనికి భగవత్ప్రార్థన యనిసను సాధు జన సంసేవనమన్నను అమితానందము. ఆ కారణమునఁ గొంతకాలము నకుఁ దన వృత్తినుండి విరమించుకొని భగవద్ధ్యానమందే గడుపసాగెను. ఈతఁడు తఱచుగ నాగమహాశయుల దర్శించుచు నాతనితో నొక్కొ క్కప్పుడు నాలుగైదు దినములుండును. కొంతకాలమైన తరువాత ఈతఁడు బ్రహ్మచారియొద్దకుఁ బోవుచు నాతని శిష్యునివలె మెలఁగ నారంభించెను. ఒకసారి తాను బ్రహ్మచారికి పూర్వజన్మమున గురువనని చెప్పెను. ఒకనాఁడు తారాకాంతుఁడు మహాశయులఁ జేరి, తనకుఁ బూర్వ జన్మస్థితి జ్ఞప్తి యున్నదనియుఁ, దానిప్పుడు చంద్ర, సూర్య, బ్రహ్మాది లోకముల కేగగలఁ డనియు, జాతిమతభేదములు, ఆచారములు, ధర్మా ధర్మములు, అన్నియు ననత్యములనియు, జ్ఞానమొక్కటే సత్యమనియు ననెను. నాగమహాశయు లీ మార్పును జూచి "గురుకటాక్షము లేనియెడల నెంత గొప్ప సాధకుఁడైనను దప్పుదారిని బడిపోవును" అనెను.

తారాకాంతుని బలవంతముమీఁద మహాశయులు బారదీకి బయలుదేఱెను. సాధు సందర్శనమున కేగునప్పుడు రిక్తహస్తము లతోఁ బోఁగూడదని కొన్ని పండ్లను దీసికొనివెళ్లెను. బ్రహ్మచారి యందు వేనిని స్పృశింపక ప్రక్కనున్న యాఁబోతున కర్పించెను. మహాశయుని దీనదృష్టులను, కృశాంగమును, మలినవేషమును జూచి యధిక్షేపణా పూర్వకముగ నవ్వమొదలిడెను. కాని మహాశయులు తల వంచుకొని లెక్కసేయకుండెను. అతని శాంతభావమును జూచి సహింపనేరక బ్రహ్మ చారి శ్రీ రామకృష్ణునియందు దోషమారోపించి దూషింపసాగెను. నాగ మహాశయులు దీనిని సహింపలేకపోయెను. నేత్రములు క్రోధపూరితము లయ్యెను. శిరము పైకెత్తి చూడఁగనే కృష్ణపింగళవర్ణమున భీషణాకృతితో

భైరవమూర్తి యొకఁడు బ్రహ్మచారి సణఁచివేయుటకై యాతని యను జ్ఞను కోరుచు నెదుట నుండుటను జూచెను. కాని యాక్షణముననే కోపము నణఁచుకొని తన తలను నేలపైఁగొట్టుకొనుచు "తండ్రీ! నీ యాజ్ఞ నుల్లంఘించి యన్యసాధు దర్శనాభిలాషినగుటవలనఁ దగిన శాస్తియైన"దని యచ్చోటు వాసి "తండ్రీ! రామకృష్ణా!" యనుచుఁ బర్వెత్తిపోయెను. గృహమున కేతెంచిన పిదప నిఁకమీఁదెట్టి సాధువులను దర్శింపఁగూడ దనుకొనెను. ఇతరులెవరైన నొక సాధువునుగూర్చి చెప్పునప్పుడు "మనసా! అట్టి అభిలాషలకుఁ జిక్కకుము! ఒరుల గృహముల నెన్నఁడును మెట్టకు" మని తన్నుఁదా నాజ్ఞాపించుకొనును.

బ్రహ్మచారి శిష్యుఁడింకొకఁడు నాగమహాశయులయొద్ద కప్పుడప్పుడు వచ్చుచుండెను. అతఁడీ పై సంగతి జరిగిన తరువాత నొక దినమున నాగమహాశయునితో "అయ్యా! నిన్ను మా గురువుగారొక వత్సరములో రక్తము గ్రక్కుకొని చత్తువని శపించి" రనెను. ఇది విని మహాశయులు కడుపు చెక్కలగునట్లు నవ్వెను. ఇది జరిగి పూర్తిగ నొక సంవత్సరము గడచెను. కాని, శాపప్రభావమేమియుఁ గన్పట్టలేదు. అందువలన నా శిష్యుఁడు గురువునందలి విశ్వాసము నశింప మహాశయుల యాంతరంగిక శిష్యుఁ డయ్యెను. అప్పటినుండి భక్తిమార్గావలంబియై జీవితమందు గొప్ప మార్పుగలిగి ప్రవర్తించెను.

ప్రాపంచిక విషయములకై నాగమహాశయు లెన్నఁడును గలఁత పడి యుండలేదు. కాని గురునింద యన నాతఁడు రౌద్రమూర్తియే. నారా యణగంజి నివాసి యగు నొక సంపన్నుఁడు ఒకపరి శ్రీ రామకృష్ణుని గూర్చి యసత్యకథనములఁ జెప్పి నిందింపసాగెను. అంత మహాశయు లాయన నట్టి సంభాషణను మానుమని వినయముతోఁ బ్రార్థించెను. ఈతఁడు ప్రార్థించుకొలఁదియు నా సంపన్నుఁడిచ్చకు వచ్చినట్లు దూషింప నారంభించెను. మహాశయుఁడు "గురుదేవునిపై ఇట్టి కల్ల నిందలను మోపకుము" అని యెంతయో చెప్పెను. కాని యాతఁడు మాన లేదు. మహాశయులు సహింపలేక "నా యింటినుండి యావలికిఁ

బొమ్ము. లేకపోయినఁ దగిన శాస్తి ననుభవింతు" వనెను. దీనిని గూడ నాతఁడు లెక్కసేయలేదు. మహాశయుని శాంతమంతయు నశించెను. రక్తారుణితలోచనుఁడై తనువు కంపమొంద, నాతనిఁ జెప్పుదెబ్బలతో సన్మానించుచు "నీచుఁడా! నా ఇంటినుండి తత్‌క్షణమే వెడలిపొమ్ము. నా గృహమునందే నా గురుదేవునిపై నింద నారోపింప సాహసించెదవా" అనెను. అతఁడు దియోబాగునందు పలుకుబడి కలవాఁడు. అట్లు దెబ్బలు తిని పోవుచు అతఁడు "నీవెట్టి సాధువవో చూచెదఁగాక! దీనికిఁ దగిన ప్రతిఫలము ననుభవింపక తప్పదు" అనెను. నాగమహాశయులా బెదరింపులను లెక్కసేయక "తండ్రీ! నిన్ను దూషించువారల నా గృహమునకెందులకుఁ బంపెద"వని శ్రీ రామకృష్ణునితో మొఱవెట్టుకొనెను. తరువాత కొంతసేపటిలోనే శాంతించెను. కొలఁది దినముల కావల నాసంపన్నుఁడును మఱల నేతెంచి క్షమింపుమని యాతని వేఁడుకొనెను. నాగమహాశయు లాతని లేవనెత్తి ప్రేమపూర్వకముగ ననునయించి సంతోషపఱచెను. తరువాత నాతఁ డింటికి మరలిపోవునప్పుడు తానుగూడఁ గొంత దూరము పోయి దిగవిడచి వచ్చెను. సాధు పాదుకాఘాతమువలన సంపన్నునకు మనసు మారి మంచివాఁడయ్యెను. గిరీశబాబునకీ సంగతి తెలిసి నాగమహాశయులు కలకత్తాకుఁ బోయినప్పుడు "నీవు చెప్పులను తొడుగవుకదా! అతనిఁ గొట్టుటకుఁ జెప్పు లెచ్చటినుండి తెచ్చితి" వనెను. అందులకు మహాశయులు "అతని చెప్పులతోనే యాతనిఁ గొట్టితి" నని చెప్పి "జయ శ్రీ రామకృష్ణ జయ శ్రీ రామకృష్ణ" యనుచు నాతనికి నమస్కరించెను. గిరీశ బాబతనితో "నీవు త్రాఁచుపాము వంటివాఁడవు సుమా!" యనెను.

ఒకానొక దినమున నాగమహాశయులు బేలూరు మఠమున కేగుచుండెను. మార్గమధ్యమున నావపై గంగానదిని దాఁటవలసి వచ్చెను. ఆ నావలో పలు స్వభావములుగలవా రుండిరి. నాగమహాశయు లొక మూలఁ గూర్చుండెను. నావ కొంత దవ్వేగునరికి బేలూరు మఠము దృగ్గోచరమయ్యెను. అంత మహాశయులు చేతులు జోడించి నమస్కరించెను. ఈతఁడు నమస్కరించుటఁజూచి యందొకఁడు ఆ మఠమందలి వారి యాచారవ్యవహారములను ఖండించుచు దూషింపసాగెను. మరి

యిద్దరు ముగ్గురాతనితోఁ వాళముపేయ మొదలిడిరి. మహాశయుఁడు దీనిని సహింపలేక ఉద్రేకపూరితుఁడై "విషయలోలురగు మీరేమెఱుఁగుదురు? మీ కా మతమునుగూర్చి యేమి తెలియును? ఛీ! అందలి సన్న్యాసులను దూషించిన మీ సిగ్గులేని నాల్కలను ఎవరే మనఁగలరు" అనెను. ఈతని భీషణవాక్యముల కా బాటసారులు భయపడి నావికునిఁ ద్వరలో దరిఁజేర్పుమనిరి. నావ దరి చేరినంతనే ఆ సాధుల దూషించినందులకుఁ దమ్మాతఁడు శపించునేమో యని వారు పర్వెత్తసాగిరి. ఈ సంగతి వివేకానందుఁ డెఱిఁగి "ఒక్కొక్క సమయమున నిట్లు బుసపెట్టవలసి యుండును" అనెను.

నాగమహాశయుల గృహమున కొకనాఁడొక సన్న్యాసి వచ్చెను. అతని త్యాగము వస్త్రములయందును, వైరాగ్య మమాయకులగు గృహస్థులయెడలను మాత్రమే్దీపించును. మరియు గంజాయి యన్న నతని కతి ప్రియము. గంజాయి త్రాఁగుటలో నాతని మించిన వాఁడింకొకఁ డుండఁడు.

అతఁడు దిగింబరియై వచ్చుచు దూరమునుండియే మహాశయునిఁ జూచి కొంచె మనుమానించి వస్త్రములను ధరించి మహాశయుని జూడ వచ్చెను. అనంతరము మహాశయులం జేరి అణిమాద్యష్టసిద్ధులను గూర్చి ప్రసంగింప మొదలిడెను. అంత మహాశయులు "ఈ భావములన్నియు నతి హేయములు. శ్రద్ధాభక్తిలాభమునకు శత్రువు" లనెను. సన్న్యాసి యా మాటలను జెవినిబెట్టక "నేను మలము తిని యేడు దినములుండఁ గల" ననెను.

నాగ :—దానివలని గొప్పతనమేమి? కుక్కలు జీవితమంతయు మలమును దినియే గడపును.

సన్న్యా :—నేను దిగంబరినై జీవితమంతయు గడుపగలను.

నాగ :—పిచ్చివాఁడా! పశువులు పక్షులు మొదలగు జంతుజాల మంతయు వస్త్రములు లేకయే తిరుగును. నీ గొప్పతనమేమి?

సన్న్యా :—నేను తరు లతాదుల క్రిందనే జీవితము గడుపఁగలను.

నాగ :—ఇందుమాత్ర మున్న ఘనత యేమి? జంతువు లెన్ని వృక్షాదులనే యాశ్రయించి బ్రదికియుండలేదు ?

సన్న్యాసి యిట్టి విధములగు సిద్ధులనెన్నో చెప్పెను. అంత మహాశయుని ప్రియభక్తుఁడగు సతోబాబు ఇఁక నాతనికి అవకాశ మీయక సన్న్యాసికి సంహారముద్రను జూపెను. సిద్ధుల విషయమై మహాశయులు "సిద్ధులను పొందుట యైదారు నిమిషముల కార్యము. ఐదు నిమిషములు ప్రయత్నించుచో ఎట్టి సిద్ధినైనఁ బొందవచ్చు" ననెను.

ఇట్టి సన్న్యాసులు అనేకులు బంగాళమున గాన్పింతురు. అచ్చట వారికి గౌరవము హెచ్చు. నాగమహాశయుని దీనభావములను మలిన వేషమును, విశేషముగా నాతఁ డితరులవలె సాంసారిక కృత్యములను జేయుట మొదలగునవి చూచి మొట్టమొదట నాతని నెవరును మహాపురుషుఁడని తెలిసికొనఁ జాలకుందురు. కాని యొక్కమా రాతనితో మాటలాడిన "ఈ దీన హీనగృహమేధి మనుష్యరూపమున నున్న దేవతయే" యని తెలిసికొందురు.

ఒకపరి దీనబంధు ముఖోపాధ్యాయుఁడను నాతఁడు దియోబాగునకు వచ్చెను. దీనబంధు మంచి గాయకుఁడు. మహాశయు లాతని "ప్రసాద పదావళిని" వినెను. అతనికి వానిని ఎన్నిమారులు వినినను తనివి తీరకుండెను. అంత దీనబంధు "ఇట్టి మహాపురుషుని నా జీవితమున నింకొకనిని జూచియుండలే"దనెను. ఇతిహాసములలో విదురుఁడు మొదలగు వారినిఁగూర్చి వినినచో మహాశయులు వారి కెంతమాత్రము తీసిపోఁడని తెలియుదుము. విదురుఁడే మఱల ఈ మహాశయరూపమున నవతరించెనా యని యనుకొందుము.

శరశ్చంద్ర చక్రవర్తి (మహాశయుని శిష్యుఁడు—ఆయన జీవితమును మొదట వంగభాషలో రచించిన భక్తుఁడు) మామగారగు శ్రీయుత మదన మోహన బారుదీ యనునాతఁడు, తనయల్లుఁడు (శరశ్చంద్ర చక్రవర్తి) నాగమహాశయుని సంసర్గమువలనఁ జదువుకొనుట మాని సంసార ధర్మ

ములయెడ విరక్తి గలిగి యుండెనని లోకులవలన వినెను. నిజమగు సంగతి యేదో తెలిసికొనవలెనని మదనుఁ డొకనాఁడు దియోభాగునకుఁ బోయెను. నాగమహాశయుని ఆదరణచేతను అతని యమాయిక వ్యవహారముచేతను, అతిథి సత్కారముచేతను సంప్రీతుఁడై తన అల్లుఁడు అట్టి మహాపురుషుని యొద్దకు వచ్చుచుఁ బోవుచు నాతనితోఁ బరిచయము కలిగియున్నచో అదృష్టవంతుఁడే యని అనుకొనెను.

"ప్రఫుల్ల కుసుమముల వెదకుచుఁ దుమ్మెదలు తమంతఁ దామే వచ్చును. దివ్యజ్ఞాన ప్రసారముచే వికసితమైన హృదయము తన తేజస్సును నలుప్రక్కలకుఁ బ్రసరింపఁజేయక మానదు. అప్పుడు నిజమగు భక్తులు, సత్యాన్వేషణా పరాయణులును దమకుఁ దామే యాతనిఁ జుట్టుముట్టుదు" రను శ్రీ రామకృష్ణుని మహావాక్యము మహాశయుని యందు సార్థకమయ్యెను. ఇప్పుడు సత్యాన్వేషకులు, జ్ఞానసంపాదనోత్కంఠులు, వివిధదేశములనుండి ఈతనిఁ జేరుచుండిరి. ఈతని కీర్తి కాంతి నల్దిక్కులకుఁ వ్యాపించెను. నాగమహాశయులు భార్యను జూచి "శ్రీ రామకృష్ణుని తుదివాక్యము లీనాఁటి కనుభవసిద్ధము లయ్యెను. ఇచ్చటకి వచ్చువారందఱును ఈశ్వరాన్వేషకులన్న మాట. జాగ్రతతోను భక్తిశ్రద్ధలతోను ఉపచరింపుము. నిన్ను జగదీశ్వరుఁ డాశీర్వదించు" ననెను.

నాగమహాశయుఁడు తన దర్శనాభిలాషులై తన ఇంటి కెవ్వ రరుదెంచినను స్వల్పాహారమైన గ్రహింపకుండఁ బోనిచ్చువాఁడు కాఁడు. దూరమునుండి వచ్చువారలకు శయ్యల నమర్చును. గృహములోని కొంతభాగమును ఇట్టి యాగంతుకుల యుపచారమునకని ప్రత్యేకించి యుంచెను. అందు వారెన్నినాళ్లయిన నుండవచ్చును. కుటుంబమందలి ప్రతివ్యక్తియు నతిథిసత్కారమున నమితానందముఁ జెందుదురు. దీనదయాళొకసారి "గృహస్థుని హస్తమునుండి అతిథి యాహారమును బలవంతముగ లాగుకొనినను యజమాని స్వర్గమున కేగునట. ఈ దరిద్రుని గృహమున కిందరతిథు లేతెంచి భుజించుట నా పూర్వజన్మ పుణ్యమే"

యనెను. అందులకు మహాశయులు "ఇదియంతయు భగవానుని విచిత్ర లీలానటన. ఆయనయే అనేక రూపములతో మనలను దరింపఁజేయుటకు వచ్చుచున్నాఁ"డనెను. నిజముగ నాతఁ డతిథులను భగవన్మూర్తులుగ దర్శించువాఁడు.

ఒకదినమున నాగమహాశయులు శూలనొప్పిచే బాధపడుచుండెను. బాధ దుర్భరముగా నుండెను. ఒకొక్కప్పుడు స్మృతి తప్పిపోవు చుండెను. ఇట్టి సమయమున నీతని కెఱుక పఱుపకయే పదుగురు భోజనమునకు వచ్చిరి. ఇంట పిడికెడు బియ్యమైననులేవు. ఏమి చేయఁగలఁడు? ఆ యవస్థయందే, వేదన ననుభవించుచు, అంగడికిఁ బోయెను. తన సరకుల నొరుల మోయనీయఁడు గాన, బియ్యపుమూటను భుజముపై వైచికొని వచ్చుచుండెను. బాధ మిక్కుటముకాఁగా నతఁడు వచ్చుచు వచ్చుచుఁ గ్రిందఁబడిపోయెను. కాని యతఁడు తనబాధకై ఇసుమంతయు విచారింపక "తండ్రీ! రామకృష్ణా! ఈ నా కర్మమేమి? ఇట్లేల తెచ్చిపెట్టితివి? నారాయణస్వరూపు లింటి కాతిథ్యమునకై యరుదెంచి యున్నారే! వారిని సత్కరించుట కాలస్యమగుచున్నది. ఈ దినము సాధుసంసేవనమున కీ యస్థిపంజర మేల యడ్డుతగులుచున్నది" అని అశ్రువులు రాలఁ బ్రార్థించెను. తరువాతఁ గొంతసేపటికి బాధ యుపశమిల్ల ఇంటికేతెంచి యా సాధుమూర్తులకు సాఁగిలఁబడి తన యాలస్యమునకు మన్నింపుఁడని వేఁడుకొనెను.

వర్షాకాలమున నొక దినమున వాన భోరున కురియుచుండ నిర్వురతిథు లేతెంచిరి. ప్రచండమారుత మప్రతిహతముగ వీచుచుండెను. ఆరాత్రి వర్షమున మింటికి మంటికి నేకధారయై వర్షించుచుండెను. నాగమహాశయులకు నాల్గుగదులు మాత్రమే కలవు. ఆ నాల్గింటియందును మూఁడు జీర్ణములై వర్షాతపముల నాపలేకయుండెను. కప్పుయొక్క సహస్రరంధ్రములనుండి సహస్రధారలుగ వర్షము కురియుచుండెను. నాల్గవ గదిమాత్రము మంచి స్థితియందుండెను. అందు నాగమహాశయులు పరుండుదురు. అప్పుడతిథులు భోజనములఁ గావించిరి. కాని

యారేయి గడపుటెచ్చట ? నాగమహాశయులు భార్యను బిలిచి "చూడుము, ఇట్టి సమయమున నతిథు లేతెంచుట భగవంతుని యాశీర్వాదము. మన మెంతయు నదృష్టవంతులము. ఈ రాత్రికెట్లో చూరుక్రింద గూర్చొని భగవన్నామము జపించుచు గడపుద"మని యయ్యతిథుల నందు శయనింపఁజేసి, తా మారాత్రి యంతయు చూరుక్రింద ధ్యాననిమగ్నులై గడపిరి.

నాగమహాశయునకు మాసవేతనముఁగాని నియమిత వ్యయముగాని లేదు. ఉప్పుకొఠారులపై వచ్చు లాభములు మాటిమాటికి మాఱుచుండెను. ఇంటికి లెక్కలేక యతిథు లేతెంచుచుండిరి. అందువలన తఱచు ఆహార పదార్థము లయిపోవుచుండెడివి. కాని ఎప్పుడే పదార్థములు కావలసినను తన్నెఱిఁగియున్న నారాయణగంజి షాహుకార్లయొద్ద నప్పుగొని సాలునరికి కలకత్తానుండి రంజిత్ హజ్రా పంపు ధనముతో నా యప్పులను దీర్చువాఁడు.

పట్టణములలో నున్న భాగ్యవంతులు గూడ దుకాణదార్లనుండి, మహాశయులు పొందునంత గౌరవమును బొందఁజాలకుండిరి. తక్కిన వారందఱు కొను వెలకే నాగమహాశయు లెక్కువ సరకులను పొందు వాఁడు. కాని యీసంగతి తెలిసినప్పుడు వారికిచ్చునన్ని సరకులనే తనకుఁ గూడ నిమ్మని నిరోధించును. ఒక కొట్టుమీఁదనే ఆ దుకాణదా రడుగు వెలకే, కొనుట ఈతనికి స్వాభావికమై యుండెను. అయినను ఎన్నఁడును మోసపోలేదు. "ఎవఁడు సత్యమునే నమ్మి దానినే పరమావధిగఁ జూచునో యాతఁడు మోసపోక సర్వదా రక్షింపఁబడుచుండును. అతఁడే భగవత్కరుణా సముద్రమునఁ దోఁగులాడుచుండు"నని యతఁడు చెప్పుట వాడుక.

అతని సాధుస్వభావ మెల్లరెఱిఁగినదే యగుటచే నాతని మోసపుచ్చ సాహసింపలేకపోవువారు. అదియుఁగాక నాతనియందుఁ, బరుల గౌరవమును బొందనగు శక్తి మూర్తీభవించి యుండెను. ఒకసారి నాగమహాశయు లొక క్రొత్త దుకాణమునొద్దకుఁ బోవుట తటస్థించెను. మొదటి దినములలో నెక్కువ ధరలు చెప్పినను, తరువాత తరువాత, మహాశయులు బేరమాడకుండుటయు నడిగిన ధన మిచ్చుటయుఁ జూచి అతఁడు

చెవిలో రహస్యముగ తగ్గుధరలఁ జెప్పుటగాని రెట్టింపు సరకుల నిచ్చుటగాని చేయువాఁడు. వర్తకులు అతఁడు తమయొద్ద ముందు కొనినచోఁ దమకు ఎక్కుడు లాభము వచ్చునని యొక నమ్మిక గల్గియుండిరి. అందువలన నాతఁడు బజారునకుఁ బోవునప్పుడెల్ల వర్తకులు తమయొద్ద ముందు కొనుఁడని ప్రతివారును బ్రతిమాలువారు.

నాగమహాశయుని కొక్కొకసారి అతిథులకు భోజనవసతి సదుపాయములఁ జేయుటయే గాక దారి బత్తెములకుఁ గూడ నిచ్చుట తటస్థించెడిది. ఒకమారొక యతిథి అతనిఁ జూచుటకు వచ్చి జబ్బుపడెను. మహాశయు లతనికిఁ బరిచర్య సలిపి నెమ్మదిగ నున్నతరువాత దారి బత్తెములకుఁ గొంత సొమ్మిచ్చి యింటికిఁ బంపెను. ఇట్టివి తఱచు జరుగుచుండెడివి.

పరిమితి లేని యీ వ్యయమువలన మహాశయు లప్పుల పాలయ్యెను. అతని భక్తులలోఁ గొంతమంది ఋణములను దీర్ప నుద్యుక్తులైరి. కాని యాతఁ డాయుపకారము నెంతయు నిరసించెను. వివేకానందు లమెరికా దేశమునుండి మరలివచ్చిన తరువాత మహాశయులు ఋణగ్రస్తుఁడైనట్లు దెలిసికొని ఋణవిముక్తునిఁ జేయ సాహసించెను. కాని మహాశయులు నెమ్మదిగ "సన్న్యాసులు నాకిడు ఆశీర్వచనములే చాలును. కష్టమో సుఖమో నా కుటుంబ మెప్పుడును 'పాలు' లిచ్చు వేతనముమీఁదనే జీవింపవలె" ననెను. ఇఁక నాతని భక్తులేరైన ఋణముమాట జ్ఞాపకము చేసినచో "అయ్యా! జీవనాధార మేమియుఁ గన్పడకున్న నుపవాసమైన నుందుము గాని గృహస్థాశ్రమధర్మము మాత్రము విడువఁజాలను. నా దుఃఖస్థితిగూర్చి మీరెవ్వరును కష్టపడవలదని ప్రార్థించుచున్నాను. భగవానులగు శ్రీ రామకృష్ణులు తమకేది యుచితమని తోచునో యదియే చేయుగాత" మని యనును.

తన పనులకు లేదు సరికదా గృహకార్యముల నిమిత్తమైనను సేవకుల నియమించుట కాతఁడెంతయు సంతాపపడును. తన యింటి మరమ్మతులకై తాపీవాండ్రు మొదలగు సేవకులు పనిచేయుచో సహింపఁ

జాలఁడు. అందువలన మహాశయు లింట లేనప్పుడు అతని భార్య ఇంటి కప్పు వేయుట మొదలగు మరమ్మతులను జేయించెడిది. ఒకపరి నాగ మహాశయులు చాలకాలమువఱకు నింట నుండుట తటస్థించెను. అందు వలన ఇల్లు బాగుచేయించుట కవకాశము లేకుండెను. గృహము నివాసా నర్హమై యుండెను. ఇఁకఁ జేయునది లేక శరత్కుమారి కూలివాండ్ర ఇంటికప్పును దిరుగవేయుటకుఁ బిలిపించెను. కూలివాం డ్రింటఁ బ్రవే శింపఁగనే మహాశయు లొక మహాపాపకార్యము తన యింటఁ జరుగ నున్నట్లు, పిచ్చియెత్తి కేకలిడెను. మొదట నొక చిలుము తయారుచేసి తాపీమేస్త్రి కిచ్చెను. పిమ్మట నాతఁడింటి పైకెక్కి యా సూర్యాతపమునఁ బనిచేయుచుండఁ జూచి సహింపలేక యాతనిని దిగిరమ్మని దీనముగ బ్రతిమాలుకొనెను. అయిన నాతఁడు తన పని సాగించుటఁ జూచి పట్టజాలక "తండ్రీ! నన్నీ దుర్భరమగు గృహస్థాశ్రమ మెందులకు స్వీక రింపుమంటివి? అయ్యో నా సుఖముకొఱ కన్యులు బాధపడుట చూడ వలసివచ్చెఁగదా! పాప ముపశమించుగాత! గార్హస్థ్య మడుగంటుగాక" యని నెత్తి మోదుకొన సాగెను. ఈతని వ్యాకులతను జూచి యాతఁడు దిగివచ్చెను. మహాశయులు తత్క్షణమే వానియొద్దకుఁ బర్వెత్తి వేఱొక చిలుము నిచ్చి విశ్వాసపాత్రుఁడగు సేవకునివలె విసరనారంభించెను. పిమ్మట నాతని కా దినవేతన మిచ్చి యింటికిఁ బంపెను.

నాగమహాశయు లెన్నఁడైనఁ బడవలోఁ బ్రయాణము చేయవలసి వచ్చినప్పుడు, పడవవానిని పడవను ద్రోయనీయక తానే తెడ్డువేయును. ఒక్కొక్కసారి తక్కుఁగల బాటసార్లాతని నిరోధించువారు. కాని వారి మాట లెన్నఁడును లెక్కకు రాలేదు. అందువలననే కొందఱు పడవ వాండ్రు తమ నావలలో నాతని నెక్కించుకొనువారు కారు. అట్టి మహా పురుషుఁడు తామందుండఁగ నావద్రోయుట పాపమని తలఁచువారు. వర్షాకాలమునందు దియోబాగంతయు నీటితో మునిఁగియుండును. పడవ లేక ఎవ్వరును ఇంటినుండి కదలలేక పోవువారు. అందుచేఁ బ్రతి గృహమునకు ఒక నావ యుండుట తప్పనిసరియై యుండెను. కాని మహాశయులకు సొంతపడవ లేదు. కానఁ నాతఁడు వర్షాకాలములోఁ జాల

భాగము ఇంటనే గడుపవలసివచ్చెడిది. అయినను ఒక్కొక్కప్పుడు పడవ యత్యావశ్యక మనిపించును. అందువలన ముందే గృహకృత్యములకు వలయు సంబారములను సిద్ధముచేయవలసి వచ్చెడిది. ఈ పని యాతని భార్యయే యిరుగుపొరుగువారి సహాయమున నిర్వర్తించెడిది.

ప్రతి సాయంతనమునను నాగమహాశయులు శ్రీరామకృష్ణుని విగ్రహమునకు ధూపదీప నైవేద్యాదుల నర్పించును. భక్తులు వచ్చిన దినమున అతని యింట భగవత్సంకీర్తనము జరిగెడిది కాని అంపాతఁ డెన్నఁడును బాల్గొనక ఒకమూలఁ గూర్చొని చిలుములను తయారుచేయును. అయినను అతని సమక్షమున నొక అసహజమగు ఆవేశ మా సంకీర్తనయం దుద్భవించెడిది. సంకీర్తనానంతరము నాతడు శ్రీరామకృష్ణనామము నుచ్చైస్స్వరమున జపించుచు చైతన్య విహీనుఁడైయుండును.

ఒక్క సంకీర్తనయందే కాక తక్కిన ప్రార్థనా సమయములందుఁ గూడ మహాశయుని గృహమున భక్తి మూర్తీభవించియుండును. ఒక మా రాతని గృహమునకు శరశ్చంద్ర చక్రవర్తి వచ్చెను. మహాశయుని కోరికపై అతఁడు ఉపనిషత్తులలోఁ గొన్నిటఁ గొంతభాగము చదివి వివిధార్థములతోఁబాటు ఒక్కింత తన యభిప్రాయమును జతచేయుచు బోధ చేసెను. అంతయు సాంతముగ విని "అన్ని యర్థములును సత్యములే. వేర్వేఱాచార్యులు వేర్వేఱు మతస్థులకుఁ దగినట్లు చెప్పిరి. ఇది వ్యాఖ్యాతల తప్పు కాదు" అనుచు, శ్రీ రామకృష్ణుఁడు ఊసరవెల్లి సామ్యము నుదాహరించుచుఁ జెప్పిన మహావాక్యమును నుడివి, "ఈశ్వరుఁ డనేక రూపములతో విరాజిల్లును. ఎవ రెట్లాతని నర్థము చేసికొందురో, అట్లు వారు వర్ణింతురు. ఎవరును అతని నిజస్వరూప మిట్టిదని నిర్ణయింపలే" రనెను. తదనంతరము సరస్వతీ విగ్రహమును జూపుచు "ఇయ్యదియు సత్యమే. ఎందఱెంద ఱీ దేవులను దేవతలను గొల్చి తరింపలేదు!" అనుచు ఆ విగ్రహము ముందనేకమాఱులు సాఁగిలఁబడెను. ఆ సమయమున నర్చకుఁ డతివైభవముతోఁ బూజలొనర్చుచుండ నాప్రదేశమంతయు స్వర్గధామ మట్లుండెను. మహాశయు లంత లేచి "తల్లి విద్యాస్వరూపిణి.

ఆమె కృపాలేశము లేకున్నచో జ్ఞానోపలబ్ధి కాఁజాలదు. జనని న న్నజ్ఞానిగ నొనర్చి ఈ శూద్రకుటుంబమున జన్మింపఁజేసినది. నేను శాస్త్ర పఠనమున కనర్హుఁడను. అందువలన మీరా శాస్త్రార్థములను వినిపించి నన్నుఁ గృతార్థుని జేయుఁ" డనెను. ఈతని దృఢభక్తిని జూచి "ఈతఁడు భక్తిసాధనయందుఁ జాల నభివృద్ధి పొంది కొన్ని దివ్యదర్శనములఁ గని యుండవచ్చును; కాని బ్రహ్మజ్ఞానమును ఇంకను బొందియున్నట్లు లేదు" అని చింతించుచుండ మహాశయు లచ్చోటు వదలివెళ్లెను. కొంత సేపటి కా భక్తుఁడు మహాశయుని వెదకుచు ఇంటి వెలుపలకు రాగా, అతఁ డొక సాలవృక్షముక్రిందఁ బడియుండెను. భక్తుఁ డాతనిప్రక్కకేగి నిల్చెను. అంత మహాశయులు "ఆ మృణ్మయ విగ్రహరూపమున నున్న నా తల్లి ప్రేమమయి. అత్యంతరహిత యగు సచ్చిదానంద స్వరూపిణి. నా జనని జ్ఞానసముద్రము" అనుచు సమాధిస్థితిని బొందెను. ఒక యర గంట కాలమువఱకు కట్టె చైతన్యరహితుఁడై పడియుండెను.

ఇట్టి సమాధులలో అతఁడు తఱచు గంటలతరబడి పడియుండును. కొన్నిదినములఁ బ్రాణాపాయము తటస్థించెనేమో యని శంకించువఱకు స్మృతివిహీనుఁడై యుండువాఁడు.

నాగమహాశయు లెప్పుడు కలకత్తాకుఁ బోయినను మున్ముందు కాళీ ఘట్టములోనున్న దేవిని సేవించి యటనుండి గిరీశబాబు దర్శనమునకై పోవువాఁడు. "ఎవరైన గిరీశునితో నిమిషమాత్రము కాలము గడపినను ప్రాపంచికవిషయ విముక్తుఁ డగును. గిరీశునకు మనుజునిఁ జూడఁగనే యాతని స్వభావమును గుర్తించు అంతరదృష్టి కలదు. అదృష్టి ప్రభావముచేతనే ఆతఁడు శ్రీరామకృష్ణుని యవతారపురుషునిగ గ్రహింపఁ గలిగె" నని మహాశయులు గిరీశునిగూర్చి పలుకువాఁడు. మఱియు గిరీశనామోచ్చారణ మాత్రమున వంగి నమస్కరించును. శ్రీ రామకృష్ణ శిష్యవర్గములో గిరీశున కాతఁడు ప్రథమస్థానము నొసంగెను.

ఒకపరి మహాశయులు దుర్గాపూజకు వలయు సంబారములను గొని తెచ్చుటకు కలకత్తాకుఁ బోయెను. అప్పుడు గిరీశబాబు గృహమున

కేగెను. ఇతని రాకడఁ జూచి గిరీశుఁడు మేడ దిగివచ్చి ఆదరముతోఁ బైకిఁ గొంపోయి, యొక కుర్చీపైఁ గూర్చుండుమనెను. కాని మహాశయులు క్రిందఁ గూర్చొనెను. ఇది చూచి యచ్చటనున్న యొకరు పైనఁ గూర్చుండుమని నిర్బంధించెను. అంత గిరీశుఁడు "అయ్యా! ఆయనను నిర్బంధింపకుము. ఆయనను ఇచ్చవచ్చిన చోటనే కూర్చుండనిండు" అనెను. అంతట మహాశయులను శ్రీ రామకృష్ణునిగూర్చి యేదేని చెప్పుమని కోరెను. అందుల కాతఁ "డయ్యా! ఆ మహాత్ముని దెలిసికొనుటకు నే నెంతటివాఁడను! నేను వట్టిమూఢుఁడను. ఆయన నెట్లు తెలిసికొందును. మీరు నాపై దయగొని నన్నాయన పాదపద్మములపై వారని భక్తి గలిగియుండున ట్లాశీర్వదింపుఁ" డనెను. ఇట్లు చెప్పునప్పుడు మహాశయుని ముఖముపై శాంతమును నమ్రతయు తాండవించుచుండెను. అంత గిరీశుఁడు "అందువలననే శ్రీ రామకృష్ణుని నే నవతారమూర్తిగ నెన్నుట. ఏ మహాత్ముని కృపాకటాక్షమున ఇట్టిమార్పు,—ఒక మనుష్యమాత్రుని మనస్సున నిట్టి స్థితి—కలిగెనో అతఁడొక యవతారమూర్తి కాకయుండుట యెట్లగును? అతఁడు మానవాతీతుఁడనుటకు సందియము లే" దనెను. ఇంకను కొంతకాలము శ్రీ రామకృష్ణునిగూర్చి ప్రసంగించిన తరువాత మహాశయులా దినమునకు సెలవుగైకొని వెడలిపోయెను.

శ్రీ రామకృష్ణుని సన్న్యాస శిష్యులు అప్పుడు అలంబజార్ మఠములో నుండిరి. ఒక యాదివారమున మహాశయు లా సన్న్యాసుల దర్శనార్థమై యచ్చోటికిఁ బోయెను. అచ్చట చాలామంది యుండిరి. మహాశయులు వారలందఱకును సాష్టాంగముగ నమస్కరించెను. అతని రాకడ మఠమున నతిశయ సంతోషకారణమయ్యెను. ఆనందము తాండవించెను. సోదర శిష్యులు మహాశయుని కుశలమడిగిరి. ఆ సమయమున రామకృష్ణానందస్వామి సాయంకాలపూజ నొనర్చుచుండెను. మహాశయుఁడుకూడ అందుఁ బాల్గొనెను. అంత నందఱును భోజనమునకై కూర్చొనిరి. మహాశయుని కొక పళ్లెరమున వడ్డించిరి. ప్రసాదమును గొనిన తరువాత వారెంత వేఁడుకొనినను వినక తానే స్వయముగా ఆ పళ్లెరమును శుభ్రపఱచెను. అనంతరము వారందఱకును చిలుములను

చయారుచేసెను. ఆ రాత్రి యుక్కపోతగ నుండుటచే, జపధ్యాస నిమగ్నుఁడై యా మఠమునందే గడపెను.

శ్రీ రామకృష్ణ నిర్యాణానంతరము మహాశయులు చాలకాలము వఱకు దక్షిణేశ్వరమునకుఁ బోలేదు. ఒకనాఁడు సురేశుఁడును చక్రవర్తి యను నింకొక భక్తుఁడును వెంట రాఁ దక్షిణేశ్వరమునకై బయల్వెడలెను. మార్గమధ్యమున శ్రీ రామకృష్ణుఁడు తన యంత్యదివసములఁ గడపిన కాశీపురోద్యాన గృహము గలదు. సురేశుఁడా ఇంటిని చక్రవర్తికిఁ జూపుచుండెను. కాశీపురనామము విన్నంతమాత్రముననే మహాశయుల యొడలు కంపింపసాగెను. ఆ గృహమువైపుకూడఁ జూడలేకపోయెను. ముఖము కళావిహీనమై యెండిపోయినట్లయ్యెను. శ్రీ రామకృష్ణుని నిర్యాణ విషయమై చర్చ వచ్చినప్పుడెల్ల మహాశయులు "ఇదియంతయు ఆ మహాత్ముని లీలామాత్రమే. ప్రాణికోటికి ముక్తినిచ్చుటకై ఆ వ్యాధిని దనకుఁ దానే తెచ్చిపెట్టుకొనె"ననును. ఈదారిని నడచుట కాతని కిది రెండవతూరి.

మిత్రులు ముప్వురును దక్షిణేశ్వరము చేరిరి. ద్వారప్రాంగణమున మహాశయులు సాఁగిలఁబడెను. చక్రవర్తి యిదివరలో ఈ ప్రదేశమును జూచియెఱుఁగఁడు. అందువలన సురేశుఁ డతనికి శ్రీ రామకృష్ణుఁడు జపము సల్పిన ప్రదేశములను బిల్వవృక్షము, పంచవటి మున్నగువానిని జూపించుచుండెను. మహాశయుఁడు వారితో నొక ప్రాణవిహీనమగు విగ్రహమువలెఁ బోవుచుండెను. అతని మనమప్పు డెచ్చట నుండెనో ఎఱుఁగ నశక్యము. తరువాత వారు శ్రీ రామకృష్ణుఁడుండిన గదిని సమీపించిరి. ఆ గదిని సమీపించునప్పటికి మహాశయుఁడు "అయ్యో, తండ్రీ! ఇచ్చట నేమి చూచుటకు వచ్చితి"నని యా గదియొద్ద నిలువునఁ గూలెను. చక్రవర్తి లేవఁదీసెను. కాని ఎన్నివిధములఁ బ్రయత్నించినను, అతని నా గదిలోనికిఁ దీసికొనిపోవుట యశక్యమయ్యెను. అతఁడు తన జీవితమున నెన్నఁడును ఆ గదిలోనికిఁ బోయి యెఱుఁగఁడు. దక్షిణేశ్వరమున కేగినపుడెల్ల దూరమునుండి యా గదికిఁ బ్రణామ మాచరించి వెడలిపోవువాఁడు.

ఆ దినముననే శ్రీ రామకృష్ణుని మేనల్లుఁడగు హృదయముఖోపాధ్యాయుఁడు అచ్చటికి వచ్చియుండెను. అతనియొద్దఁ గొన్ని బట్టలుండెను. ముఖము విచారగ్రస్తమై వాడియుండెను. ఇప్పుడాతఁడు బట్టల నమ్ముకొనుచు జీవించుచుండెను. అతఁడు మహాశయుని బాగుగ నెఱిఁగి యుండుటచే నిర్వురును శ్రీ రామకృష్ణునిఁగూర్చి ముచ్చటింప నారంభించిరి. జగన్మాతపై హృదయుఁడు కొన్ని పాటలను పాడెను. మహాశయుఁడు వానిని విని శ్రీ గురుదేవుఁడీ పాటలనే పాడుచుండువాఁ డనెను. తరువాత హృదయుఁ డతి విచారముతో "మీరలుగదా ధన్యతములు. ఆ మహాత్ముని యవ్యాజ కరుణామృతము మీపై వర్షింప ధన్యులైతిరి. కాని నేను మాత్రము జీవనోపాధికై యింటింటికి వీథివీథికిఁ దిరుగుచు బట్టల నమ్ముకొనవలసిన వాఁడనైతిని. మామ నాపై నొక్కింత దయార్ద్రదృష్టిం బఱపి యుండుచో ధన్యుఁడనై యుందును" అని వేదనచే హృదయము బరువెక్క బాలునివలె దుఃఖమాఁపుకొనలేక కన్నీరు కాల్వలుగట్ట విలపించెను. తరువాత వారు మార్గమధ్యమున నున్న ఆలంబజారు మఠములోనికిఁ బోయి సాయంప్రార్థనలఁ గావించి ప్రసాదము స్వీకరించి గృహోన్ముఖులైరి. రామకృష్ణానందుఁడు వారలను గొంతవఱకు సాగనంపెను. హృదయుఁడును, మహాశయుఁడును రామకృష్ణానందుని సెలవు గైకొని గిరీశుని గృహముఁ జేరిరి. అచ్చటనుండి మహాశయులు తన బసకు బయలుదేరిరి.

ఈ కాలమున మాతృదేవి (శ్రీ రామకృష్ణుని ధర్మపత్ని) గంగానదీ తీరమున నున్న నీలాంబరబాబు తోఁటయింటియందు నివసించుచుండెను. ఒక యాదివారమునాఁడు మహాశయు లామెను జూడఁబోయెను. పోవునప్పుడు కొంత మిఠాయియు, ఒక ఎఱ్ఱని యంచు గల వస్త్రమును గొంపోయెను. చక్రవర్తియు నాతనితో నేగెను. మధ్య మధ్య మహాశయులు బాలునివలె "అమ్మా! అమ్మా!" యనుచు కేకలిడుచుండెను. కొంతవడికి వారిర్వురును అహీరితోలా ఘట్టము సమీపించి యట గంగానదిని దాఁటి కొలఁదికాలములో బేలూరును జేరిరి. మహాశయుని వేదన యధికమయ్యెను. పెద్దగాలికి అడిపోవు నెండుటాకువలె దేహము వడఁకసాగెను. ప్రేమానందస్వామి యల్లంత దూరముననే ఈతనిఁ జూచి యాతని యాగమ

నమును మాతృదేవికిఁ దెలియఁబఱచెను. మహాశయులు గృహమును సమీపింపఁగనే ప్రేమానందుఁడు ప్రేమపూరిత హృదయముతో మహాశయునిఁ బట్టుకొని దేవి సమ్ముఖమునకుఁ గొంపోయెను. అట నొక యరగంట సేఁపు ఉన్నతరువాత అందఱును ఈవలికి వచ్చిరి. మహాశయుఁడు అసంపూర్ణస్మృతితో "తల్లి తండ్రికంటె నెక్కుడు దయ చూపించు" ననెను. ప్రేమానందుఁడు "ఆహా! ఈ దినమున మాతృదేవి మహాశయునిపైఁ దన ప్రేమజ్యోత్స్నను బ్రకాశింపఁ జేసినది. ఆతఁడు తెచ్చిన మధురపదార్థములఁ దాను స్వీకరించి స్వహస్తముతో ప్రసాద మిడినది. ధన్యుఁడు గదా ఈ పుణ్యాత్ముఁడు" అనెను. కొంతసేఁపిట్లు గడపి మిత్రులిర్వురును మఱల కలకత్తాకు మరలిరి.

మాతృదేవి మహాశయున కొక వస్త్రమును కానుకగా నొసంగెను. దాని నాతఁడు పూజా సూచకముగ సరకులను కొనుటకు అంగడికిఁ బోవునప్పుడు శిరమున ధరించుచుండెను.

మహాశయులు పూజకు వలయు సంబారముల నన్నిటికిని "పాలుల" నుండి యుప్పువర్తకముపై వచ్చు ఆదాయభాగము నుండి కొని తెచ్చుచుండెను. ఒకసారి సరకులకై కలకత్తాకు పోయినప్పు డొక భక్తుని కోరికపై దేవికి విసరుటకై వెండిపిడిగల చామర మొకదానిని గొని ఇతర సరకులతోఁగూడ స్వస్థలాభిముఖుఁ డయ్యెను. సాగనంపుటకు వచ్చిన మిత్రుఁడు సామానుల నందిచ్చు తొందరలోఁ దన గొడుగు నాతఁ డెక్కిన రైలుపెట్టెలోఁ బొరపాటున విడిచిపోయెను. పాప మాతఁడు గొడుగును మఱచిపోయినాఁడని దానిని కాపాడుచుండఁ గొండొక ప్రయాణీకుఁడు మహాశయుఁ డెంత చెప్పినను వినక అది తనదని తీసికొనెను. బండి కదలిన తరువాత నా ప్రయాణీకుఁడు మైమఱచి నిద్ర చెందెను. దానిచే నాతఁడు గమ్యస్థానమును దాఁటి చాలదూరము పోయెను. అచ్చట ఎక్కువ యైన సుంకమిచ్చుట కాతనియొద్ద పైకము లేకపోవుటచే సధికారులు ఆతనిని ఆ స్టేషనులో ఆపిరి. మహాశయు లీ సంగతిని జ్ఞప్తికిఁ దెచ్చుచు "చెడుకార్యముల కెల్లప్పుడును శీఘ్రముగనే ఫలము గలుగును.

కాని మందబుద్ధులగు మానవులు తెలివి తెచ్చుకొనలేక యున్నారు” అనెను.

ఆ రైలుపెట్టెలోనే యొకఁడు తన యుంపుడుకత్తెతోఁ బ్రయాణము చేయుచుండెను. మహాశయుఁడు వారిని జూడఁగనే యొక దృశ్యమును గనెను. ఒక భూతము ఆ మనుజుని కంఠము నొడిసిపట్టి రక్తమును పీల్చుచుండెను. చూచుచుండఁగనే ఆ వ్యక్తి రక్తమాంసములెల్ల పోయి శల్యావశిష్టుఁడయ్యెను. అంత మహాశయులు నిశ్చేష్టుఁడై “అమ్మా, అమ్మా” యని కేకలిడెను. ఆతఁడీ విషయమై “ఇది యంతయు సత్యము. నమ్ముఁడు. దీని నంతయు ఈ కండ్లతోనే చూచితిని” అనెను.

ఈసారి మాత్రము నాగమహాశయులు దుర్గాపూజానంతరమున గొలఁదికాలమునకే కలత్తాకు మరలిపోయిరి. కలకత్తాలో నున్నంత కాలమును సురేశ, చక్రవర్తులతోఁ దఱచు ఆలంబజారునకు దక్షిణేశ్వరమునకు గిరీశుని గృహమునకుఁ బోవుచుండువారు.

కుమార్తులీలో నున్న ఈతని బసకు పెక్కుమంది వచ్చువారు. కాని అందెవరైన అతనియెడ గౌరవభావముగాని యణఁకువగాని చూపుచో “అయ్యా! మాంసయుతమగు నీ యస్థిపంజరమున నేమున్నది? శ్రీరామకృష్ణునిగూర్చి ఏదైనఁ జెప్పి నా యాత్మకు శాంతి నొనఁగూర్పుఁ” డనువాఁడు.

అప్పుడప్పుడు గిరీశబాబు మహాశయుని కాతిథ్యమిచ్చువాఁడు. మహాశయు లానందమునఁ దప్పక స్వీకరించువాఁడు. గిరీశుని గృహమున భుజించుచో దేహాత్మలు రెండును పరిశుద్ధమగు ననువాఁడు. శ్రీ రామకృష్ణ శిష్యులలో ఎవరి యింటనైనను గొంకులేక భుజించును. అట్టి చోటుల జాతిమత భేదములను పాటింపక “ఇది జగన్నాథాలయము *”అనువాఁడు.

మహాశయు లొకనాఁడు గిరీశుని కతిథి యయ్యెను. ఆనాఁడు శ్రీ రామకృష్ణునికి ఖిచుడి నివేదన చేసి యా ప్రసాద మొక పళ్లెరముననుండి

---

* పూరియందలి జగన్నాథాలయమున జాతిమత భేదములఁ బరిగణింపరు.

కూరల నింకొకదానిలోను పడ్డించిరి. అది చూచి మహాశయులు "అయ్యో! ఈ కూరలు జహ్వాచాపల్యమును వృద్ధిచేయును. కనుక దయయుంచి తీసివేయుఁ"డని ప్రార్థించుచుఁ గొలఁదిమాత్రము కూరను ఖిచుడియున్న పాత్రలోనికిఁ గొనెను. చివరకు ఉప్పుఁగూడఁ జపలత్వమును వృద్ధిచేయు నని తీసికొనువాఁడుకాఁడు.

ఇంకొక దినమున గిరీశుఁడు విందునకుఁ బిలిచెను. అనాఁడు గిరీశుఁడు "కొయ్" చేపయొక్క గ్రుడ్లను గొన్నిటిని సంపాదించెను. కాని మహాశయులు, శాకాహారి యగుటచే అతనిచే వీనిని దినిపించుట కష్టము. అతఁడందుల కొక పన్నాగమును బన్నెను. నాగమహాశయులు శ్రీరామ కృష్ణ శిష్యవర్గమును దనకుఁ దమ ప్రసాదము నిడుమని యడుగుట కలదు. వారట్లిచ్చుట కెన్నఁడును ఒప్పుకొనువారు కారు. అనాఁడు మహాశయులు గిరీశుని ప్రసాద మడిగినతోడనే "జయ శ్రీ రామకృష్ణ" యనుచుఁ దన యాకునందుఁ గొన్ని గ్రుడ్లను దీసి యాతనికిఁ బ్రసాదముగ నిచ్చెను. మహాశయు లది ప్రసాదమగుటచే మాఱుమాటాడక గ్రహించుచు "గిరీశా! నీబుద్ధి యతి తీక్ష్ణము సుమా" యని ప్రశంసించెను.

శీతకాలమున మహాశయులు కప్పుకొనుటకు వస్త్రము లేక చలిచే బాధపడుచుండెనని తెలిసి గిరీశుఁడు దేవేంద్ర మజుమ్‌దారను ఒక భక్తునిచే నొక కంబళము నిచ్చిపంపెను. అది గిరీశుఁడు పంపినట్లెఱిఁగి మహాశయుఁ డద్దాని కెన్నిమారులో నమస్కరించి శిరముపై నిడుకొనెను. మహాశయుఁ డెట్టి కానుకను దీసికొనఁడని గిరీశుఁ డెఱుఁగును. కాని దేవేంద్రునివలన తానంపిన కంబళము స్వీకరింపఁబడెనని విని మిగుల సంతసించెను. అంతఁ గొన్నిదినములకు, అతఁడద్దాని నుపయోగపఱచు కొనుటకు బదులు శిరముపై నిడికొని తిరుగుచుండెనని తెలిసి మిక్కిలి యాతురపడి యద్దాని నిజస్థితి తెలిసికొనిరమ్మని దేవేంద్రునంపెను. దేవేంద్రుఁడును తిరిగివచ్చి యా సంగతినే చెప్పెను.

కలకత్తాలో మూఁడుమాసము లుండి తరువాత మహాశయులు స్వస్థానమునుజేరెను. దీనదయాళు దేహస్థితి ఆ దినమున కాదినము క్షీణ

దశకు వచ్చుచుండుటచే ఇప్పటినుండి తఱచు కలకత్తాకుఁ బోఁజాల కుండెను.

వివేకానందుఁడు మొదటిసారి అమెరికానుండి మరలివచ్చినప్పుడు చక్రవర్తి యాయనను జూడఁబోయెను. చక్రవర్తి మహాశయుని బాగుగ నెఱుఁగునని తెలిసి యాయన "ఓయీ 'వయమ్తత్త్వాన్వేషాత్ హతా మధురకత్వం ఖలు కృతీ' మన జీవితములన్నియు సత్యాన్వేషణమున నిరుపయోగముగ జరిగిపోయినవి. మనలో అతఁడొకఁడే శ్రీ గురుదేవుల కత్యంత ప్రియసుతుఁడు" అని తనకు మహాశయుని జూడవలెనని యున్నదని యట్లాతనికి జాబు నంపుమనియుఁ గోరెను.

వివేకానందస్వామి అమెరికానుండి మరలి వచ్చెనను సంగతి తెలిసినతోడనే మహాశయుఁడు కలకత్తాకు వచ్చెను. అప్పటికి బేలూరు మఠాలయపు కట్టడము పూర్తియగుటచే వివేకానందస్వామి యచ్చటనే వసించుచుండెను. మహాశయులు జాబు అందిననాఁటి సాయంకాలముననే అచ్చటికిఁ జేరుకొనెను. స్వామిని గని సాఁగిలఁబడెను. స్వామికి రుగ్మతగ నున్నది యని తెలిసి యాతురతతో "నీవు బంగారు గనివని ఠాకూరు చెప్పెడివారు. నీ యారోగ్యమును గాపాడుచోఁ బ్రపంచమంతయు దుఃఖ మునుండి యుద్ధరింపఁబడును. జగమంతయు నీపై నాధారపడియున్న" దనెను. అనంతరము స్వామి, మహాశయుని ఆ మఠమునందుండు మనెను. అందుల కాతఁ "డయ్యా! నేనేమి చేయుదును? గుర్వాజ్ఞ నెట్లు తిరస్కరింతును? ఠాకూరు నన్ను ఇంటనే యుండుమని అజ్ఞాపించి" రనెను. మహాశయుని రాకచే ఆనాఁటి అధ్యయన పాఠశాలకు శిష్టానధ్య యనము. అందఱును మహాశయుని ముందుఁ గూర్చొనిరి. స్వామి శ్రీరామ కృష్ణ నామోచ్చారణ మొనర్చినంతనే మహాశయుఁ డుత్తేజితుఁడై లేచి "జయ్‌రామకృష్ణ, జయ్‌రామకృష్ణ" యని యఱచుచు, "క్రిందటిసారి నేను దక్షిణేశ్వరమునకుఁ బోయినప్పుడు గురుదేవుఁడు కాన్పింపలేదు. కాని ఠాకూరీ మఠమందిప్పుడు ప్రత్యక్షమై యున్నా" రనెను. వివేకానందుఁడు దేవాలయములను మఠములను నిర్మించు విషయముపైఁ దన యభిప్రా

యము సతుగ మహాశయులు, "ఇవి యన్నియు దేవదేవుని యిచ్ఛానుసార ముగ జరుగుచున్నవి. మీరుమాత్రము దేహారోగ్యమును గాపాడుకొన వలయును. మీ శరీరపోషణమే సమస్త మానవులకు సుఖదాయకమై దుఃఖవిముక్తినిఁ గలుగఁజేయు" ననెను. అంత స్వామి తక్కుంగల సన్న్యాసుల దిక్కుమొగమై "మహాశయునిఁ జూచినంతమాత్రముననే, దేవదేవుని యవ్యాజ కరుణా కటాక్షమున మనుజుఁ డెంతటి యుచ్ఛస్థితికి రాఁగలుగునో మన కెల్లరకుఁ దెలియఁగలదు. ఇంద్రియ నిగ్రహముసను వైరాగ్యముననుఅతఁడే మనకన్నను మిన్న" యనెను. కొంతసేపైన తరు వాత నాగమహాశయుని పూజాప్రదేశమునకుఁ దీసికొనిపోయిరి. అచ్చట మహాశయుఁడు సాష్టాంగపడెను.

ప్రతి సాయంతనముననుఁ వివేకానందస్వామి మఠముచుట్టును విలాసార్థము నడయాడుట వాడుక. ఆనాఁడు మహాశయుఁడు గూడ అతని ననుసరించెను. మహాశయుఁడు రాత్రులు మఠమునందుఁ గడపఁ జాలఁడని ఎఱిఁగియుండుటచే స్వామి యొక శిష్యునితో నావను సిద్ధపఱుపు మని చెప్పెను. అప్పటికిఁ గొలఁది వెలుతురుమాత్ర ముండెను. చీఁకటి పడుచుండుటచే స్వామి సెలవుగొనఁగోరి మహాశయు లాతనికి సాష్టాంగ పడి "జయ శివావతారమూర్తీ! జయ శంకరా!" అనెను. స్వామి యాతని లేవనెత్తి "మహాశయా! అప్పుడప్పుడు నీ పవిత్రదర్శన మిచ్చి మమ్ము ధన్యులను జేయుచుండు" మనెను. ఎన్నఁడైన స్వామినిగూర్చి సంభా షణ వచ్చినయెడల "శంకరభగవానునకు జయము" అనును. స్వామి పశ్చిమదేశ దిగ్విజయ ప్రసంగమున మహాశయుఁడు భావప్రపూర్ణుఁడై, గద్గదకంఠుఁడై స్వామి గొప్ప యవతారమూర్తి యనువాఁడు.

బాగ్‌బజారునందలి స్వర్గీయ బలరామబోసుని గృహమునకు శ్రీ రామకృష్ణుఁడు తఱచు వచ్చుచుండువాఁడు. మహాశయు లా గృహము శ్రీవాసుని ♦ పెరడని చెప్పువాఁడు. సాధారణముగ శ్రీ రామకృష్ణుని

♦ శ్రీవాసు గౌరాంగుని యాప్తశిష్యులలో నొకఁడు. ఈతని గృహ ప్రాంగణమునకు గౌరాంగుఁడు తఱచు వచ్చుచుండువాఁడు.

శిష్యులు కలకత్తాకు వచ్చినప్పు డందు విడియువారు. అచ్చటి కితఁడు వారి దర్శనార్థమై పోవుచుండును. ఒకనాఁ డట్లు పోయినప్పుడు చక్రవర్తి వెంటఁదగిలెను. ఆ దినమున నా గృహమున బ్రహ్మానంద ప్రేమానందులు విడిసియుండిరి. వారేదో విషయమై మాటలాడుచుండిరి. ఇంతలో మహాశయుఁడు రా ఆ సంభాషణమును ముగించి శ్రీ రామకృష్ణునిగూర్చి ముచ్చటించిరి. తరువాత వారు గృహోన్ముఖు లగుచుండ బ్రహ్మానందుఁ డిట్లనెను: "నాగమహాశయుని సన్నిధానమున మనస్సు అన్ని విషయములను మఱచి గురుమహాశయుని జ్ఞప్తికిఁ దెచ్చెను. ఇట్టి ఆధ్యాత్మికశక్తి సమన్వితు లుండుటచేఁ గదా భగవత్తత్త్వము హిందూదేశమున ఇంకను నిలిచియున్నది? ఈతఁడే ధన్యతముఁడు". మహాశయునికి సన్న్యాససోదర శిష్యులయం దమిత గౌరవము. "వారు మానవమాత్రులు కారు. భగవల్లీలార్థ మవతరించిన దేవతాస్వరూపులు. వారిని దెలిసికొనుట ఎవరితరము" అనువాఁడు.

క్రమక్రమముగ దీనదయాళుని యంతిమ దివసములు సమీపించెను. అంత్యకాల మంతయు ఈశ్వరప్రార్థన ధ్యానాదులయందే గడచెను. ప్రాపంచిక విషయములకుఁ దన మనమున తావొసంగక ఎట్టి కల్మషముచేతను స్పృశింపఁబడక యుండెను. ఒకనాఁటి ప్రాతఃకాలమున మహాశయుఁడు తండ్రి చేయి పట్టుకొని నడపించుచుండెను. అంత హఠాత్తుగ దీనదయాళు స్మృతివిహీనుఁడై భూమిపైఁబడెను. మహాశయులు తండ్రిని జేతులపై లేవనెత్తి గృహములోనికిఁ గొంపోయెను. అప్పటికి స్మృతివచ్చెను. మహాశయుఁడు తండ్రికి మరణకాల మాసన్నమయ్యెనని తెలిసి వైద్యునికొఱకుఁ జెప్పిపంపి తానాతని చెవియందు భగవన్నామమును జపింపఁదొడఁగెను. మరణసంసిద్ధుఁడై యున్న దీనదయాళుకూడ అతని స్వరముతోఁ దనకంఠ మైక్యము చేసి దేవదేవుని-నామము జపించెను. ఇంతలో వైద్యుఁడు వచ్చెను; అది శిరస్సంబంధమైన వ్యాధి యనియు, మిక్కిలి యపాయకరమైన స్థితిలో నుండెననియు ఇఁక జీవితాశ కన్పట్టదనియుఁ జెప్పెను. పితాపుత్రులిర్వు రిట్లు ఈశ్వర నామము జపించుచుండ, దీనదయాళుని కంఠ మాగిపోయెను.

దీనదయాళు పరలోకగతుఁడగునప్పటి కాతనికి ఎనుబది సంవత్స రముల వయస్సు. తండ్రి యుపసానదశయందుఁగూడ స్మృతిరహితుఁడై యుండక భగవన్నామము జపించుచుఁ దన నాటకమునకు భరతవాక్యము చెప్పెనని మహాశయుఁడు సంతుష్టాంతరంగుఁడై యుండెను.

మతానుసారముగ మహాశయులు విచారసూచకములగు వస్త్రము లను ధరించి, శాస్త్రవిధిప్రకారము హవిష్యమును మాత్రమే స్వీకరించి యుపవాసముండి పిండప్రదానమును యథావిధిగ నొనర్చెను. తరువాతఁ దా నిహమునఁ దండ్రి కొనర్పఁగల యంత్యకర్మ యగు శ్రాద్ధకర్మ వచ్చెను. అది యెంతయో గొప్పగఁ జేయవలెనని యాతని యభిలాష. కోర్కెలుండ వచ్చునుగాని తీర్చుకొనుటకు ధనమెచ్చటనుండి వచ్చును?

ఈతనియెడ భక్తి గౌరవములు గల భక్తులు కొందఱు "రాలీ" సోద రుల కంపెనీలో పనిచేయుచుండిరి. వారికీ సంగతి తెలిసి యాతని ఎఱుక లేకయే తమలోఁదాము చందాల వైచుకొనిరి. మహాశయుని కీ సంగతి ఎట్లో తెలిసి, వారిని దనకొఱకై యట్లు కష్టపడవలదని వేడుకొనెను. చివరకుఁ దన యింటిని గుదువపెట్టి ౫౦౦ రూపాయిలను, పొరుగుననున్న యొకర్తుకనుండి కొంతసొమ్మును ఋణముచేసి మొత్తము రు. ౧౨౦౦ లతో అత్యంత వైభవముగ శ్రాద్ధకర్మల నొనర్చెను.

అనంతర మాతఁడు గయకేగి శిరోముండనము గావించుకొని శాస్త్ర విధిగఁ బిండప్రదాన మర్పించి మరలఁ గలకత్తాకు వచ్చెను.

మహాశయులు పితృశ్రాద్ధకర్మలకై యప్పుల పాలయ్యెనని "పాలుల" కుఁ దెలిసి కుమార్తులీలో నున్న ఈతని గృహమున కద్దె ఎక్కువ చేయ నిశ్చయించు కొనిరి. రంజితుకూడ ఈ యుద్దేశమును బలపఱచెను. కాని మహాశయుఁ డందుల కొప్పుకొనలేదు. చాలకాలమునుండి యందు అద్దె కుండిన కీర్తివాసుఁడు మహాశయుని ధార్మికభావమునకు సంతసించి తనకుఁ దానే యెక్కువ బాడుగ నిచ్చుట కియ్యకొనెను. కాని మహా శయులు తన యసమ్మతిని జూపుచు "కీర్తివాసా! నీవు రాత్రింబగళ్లు కష్టించి సంసారమును సాగించుకొనుచున్నావు. అతి దుర్ఘటమున నద్దె

లిచ్చుచుంటివి. నేను నీయొద్దనుండి యెక్కువ అద్దె తీసికొనుట కంగీక రింపఁజాల''ననెను. మహాశయులు కీర్తివాసునిఁ బుత్రునివలెఁ బ్రేమించు చుండెను. కీర్తివాసుఁడును మహాశయులు కలకత్తాలో నుండునంత కాలము ఎక్కువ గౌరవముతోను, ప్రేమతోను గొలుచుచుండెను. చాల కాలమువఱకుఁ గీర్తివాసుఁ డా గృహమందే యుండి మహాశయులుండిన గదిని శిథిలమైన యతని చాఁపను జాగ్రతతోఁ గాపాడుచుండెను.

నాగమహాశయులు గయనుండి కలకత్తాకు మరలి వచ్చినప్పుడు శ్రీమాతృదేవి బాగ్‌బజారునం దుండెను. ఒకనాఁ డామె దర్శనార్థమై యాతఁడు కొన్ని మధురపదార్థములను ఒకవస్త్రమును దీసికొనిపోవుచుండ మార్గమధ్యమున శూలనొప్పి యమితముగ వచ్చెను. అందువలన ముందున కొక్కయడుగైన నిడలేక ప్రాంతముననున్న యొక గృహావరణ మధ్యమున స్మృతిరహితుఁడై పడిపోయెను. అట్లు రెండుగంట లుండిన తరువాత బాధ కొంత యుపశమింప లేచెను. అచ్చటనుండి యింటికి బండిపైఁ బోవచ్చును. పోవుటకు వలయు పైకముకూడఁ దనదగ్గఱ నుండెను. కాని మొదట ననుకొనినట్లు మాతృదేవిని దర్శింపకుండ నింటి కెట్లు మరలఁగలఁడు? అందువలనఁ దన యశక్తతకు దుఃఖించి బాధ పూర్తిగ నుపశమిల్లిన యనంతర మామె దర్శనము చేసికొని రాత్రి 9 గంటలకు ఇంటికిఁ దిరిగిపోయెను.

ఆ సంవత్సరము ప్లేగువ్యాధి కలకత్తాలో నిరంకుశముగ వ్యాపించెను. ప్లేగుయొక్క ఆవిర్భావమున కదియే మొట్టమొదటిసారి. ధనికులు, పేదలు అను వివక్షత లేక నొక్కుమ్మడి నందఱును కలకత్తా సరిహద్దులను దాఁటి పారిపోయిరి. పట్టణము పాడుపడిన ట్లుండెను. మెస్సర్సు "పాలులు" కూడ కలకత్తాలో నున్న తమ గృహమును నాగమహాశయుని యాధిపత్యమున నునిచి వారి గ్రామమునకుఁ బోయిరి. ఒక వంటబ్రాహ్మణుఁడును, ఒక బ్రాహ్మణోద్యోగి (గుమాస్తా) యు నింకొక నౌకరును మాత్రమే యాతనితో నుండిరి. ఒకనాఁడు చక్రవర్తి మహాశయుని జూచుటకు "పాలుల" గృహమునకుఁ బోవ నాతఁడు కండ్లకు జోడుపెట్టుకొని

గీతాపారాయణముఁ జేయుచుండెను. నాగమహాశయులు చక్రవర్తిని జూచి "ఇట్టి యజ్ఞానియు మూఢుఁడ నగు నాకు గీతార్థము బోధపడునా? నీవు బ్రాహ్మణుఁడవు, పండితుఁడవు. కావున దయయుంచి నాకీ శ్లోకార్థముఁ దెల్పుచుఁ జదివి వినిపింపు" మని వేఁడుకొనెను. చక్రవర్తి యందలి, "కర్మణ్యకర్మ యః పశ్యేత్" అను శ్లోకము చదివి దానికి వివిధ వ్యాఖ్యాతలు వ్రాసిన వ్యాఖ్యానానుసారముగ నర్థముఁ జెప్పెను. ఆ టీక లన్నిటియందును శ్రీధరస్వామి టీక యాతనికి నచ్చియుండుట వలన దాని నెంతో ప్రీతిపూర్వకముగఁ గొనియాడెను.

మూఁడుదినము లిట్లు సవ్యముగ జరిగిపోయెను. నాల్గవనాఁడు బ్రాహ్మణోద్యోగికి ప్లేగు వచ్చెను. వైద్యుని బిలిచిరి. కాని యాతని కెవ రుపచారము సేయుదురు? ఎవ్వరుగూడ నారోగి ప్రక్కనుండుటకు సాహసింపఁజాలకపోయిరి. ఇఁక నాగమహాశయు లొక్కఁడు మాత్రము పరిచర్య చేయవలసివచ్చెను. రోగ మభివృద్ధి నెందెను. వైద్యుఁడు నిరాశ చేసికొని వదలెను. మృత్యువాతఁ బడఁబోవు నారోగి మహాశయునిఁ దన్నొల్లయిన గంగానదీతటమునకుఁ జేర్చుమని వేఁడుకొనెను. మహాశయునికెవ్వరును సాయము రాకపోవుటవలన నాతఁడే దగ్గరనున్న ఘట్టమునకుఁ గొంపోవలసివచ్చెను. రోగి త్రోవలోనే "గంగా—గంగా" యని స్మరించుచు మహాశయుని యొడిలోనే ప్రాణముల విడిచెను. రోగి ప్లేగువ్యాధిచే మరణించుటవలన నా శవమును బూడ్చుట కెవ్వరును రాకుండిరి. కాని ఎట్టకేలకు మహాశయు లెక్కుడు ధన మిత్తునని యాశపెట్టిన తరువాత కొందఱు బ్రాహ్మణు లద్దానిఁ బూడ్చిరి. ఈ సత్కార్యమున నాతని కిరువదియైదు రూపాయిలు వ్యయమయ్యెను. ఆ దినమున సురేంద్రనాథసేను, అమృతోష్ బాబు, నరేంద్రనాథబోసు అను మువ్వురు జను లాతనిఁ జూచుట కాతని ఇంటికిఁ బోయియుండిరి. వారీతని చెయిదమును జూచి యాశ్చర్యపడిరి. నరేంద్రబోసు ఈతనికిఁ బిచ్చిపట్టిపోయెననియే నమ్మెను.

ఒకదినమున నాగమహాశయులు కాళీఘట్ట స్థాపితమగు జగన్మాతృ దేవాలయమునకుఁ బోయెను. మాతను దర్శించి మరలివచ్చుటలో

మైదానమున నొకభక్తునిఁ గలసికొనెను. భక్తుఁ డీతనికి "ఏడెను ♦" తోఁటలఁ జూపుట కచ్చటికిఁ గొంపోయెను. తోఁటలోని కడుగు పెట్టుటారంభముగ మహాశయులు బాలునివలె ప్రతి వస్తువును జూపి "ఇది యేమి ? అది యేమి ?" అని ప్రశ్నింప మొదలిడెను. తరువాత మరలి వచ్చునప్పుడు, "మనుజుఁడు సౌఖ్యములకొఱకై యనేకమార్గములం బడి పోవుచుండును. జీవితము సార్థకతఁ జెంద జనన మరణ రహస్యములఁ దెలిసికొనుటకుఁ బ్రయత్నించుట మాని యశాశ్వతములగు విషయేచ్ఛల ననుభవింపఁ గోరును. ఈ ప్రపంచమును గొలఁది దినములలో వీడవలసి యుండునని తెలిసియు నిట్లున్నది. ప్రపంచమంతయుఁ దామసిక రాజసిక ప్రకోపమై కామినీ కాంచనాధీనమై యుండ నరులద్దానివెంటఁ దవిలి యున్మత్తులై పోవుచున్నారు. తండ్రీ! ఏమి నీ లీలలు ! ఏమి నీ నటనాకౌశలము ! నీ ప్రభావమునందు శుకాది మహర్షులుగూడ ముగ్ధులగుచున్నారుగదా ?" అనెను.

ఒక దినమున నాగమహాశయులును మఱికొందఱు భక్తులును శ్రీ రామకృష్ణుని జీవితమునుగూర్చి ముచ్చటించుకొనుచుండిరి. అంత నచ్చట నున్న నిరంజనానందస్వామి మహాశయునితో "నయ్యా శ్రీ గురుదేవుఁడు తమ్ముఁదాము నీచులమనియు, కించిజ్ఞులమనియుఁ గ్రిందుపఱచుకొనవలదనియు నట్లుచేసినవారు తప్పక నధఃపతితులగుదురనియు సెలవిచ్చిరి గదా. మీరేల ఇట్లు మిమ్ములనే నిందించుకొందురు ? అంతఱికంటె నల్పునిగ నేల భావించుకొందు" రనెను. మహాశయు లందుల "కయ్యా! నాయల్పత్వమును నీచత్వమును నాకుఁ బ్రతి నిమిషమును బ్రత్యక్షమగుచుండ నేనే శివుఁడ నని ఎట్లు తలంపఁగలను ? 'శివోహం' అని మీరు తలంపవచ్చును. గిరీశుఁడు తలంపవచ్చును. మీ భక్తి మేరువును బోలినది. నా కట్టి భక్తి లేదే! మీరెల్ల నన్నాశీర్వదించినయెడల ఠాకూరు తన కృపావర్షమును నాపై వర్షించినయెడల నా జీవితము సార్థకము కాఁగలదు" అని ప్రత్యుత్తరమిచ్చెను. అతని మాటలయందలి యట్టి మనోనిశ్చయమును జూచి నిరంజనానందుఁడు మాఱు వల్కలేక

♦ కలకత్తాలో సుప్రసిద్ధములగు ఆరామములు.

పోయెను. ఈ విషయమునుగూర్చి ప్రసంగించుచు గిరీశుఁ డిట్లనెను: "ఇట్టి మనోనిశ్చయముతో సహంభావమునెల్ల పోఁద్రోలినయాతఁడే దక్క నొండెవఁడును నాగమహాశయుని యత్యుత్తమస్థితికి రాఁజాలఁడు. అట్టి వారు మెట్టినచోటు అతి పావనప్రదేశము కాఁగలదు."

గృహమున కేతెంచి మహాశయులు అనాఁడు తన యల్పత్వమును గూర్చి తలపోయుచుఁ గొంతమంది యాగంతుకుల యెదుటఁ దానొక పాప ముల మూట యనియుఁ గీటకాధముఁ డనియుఁ జెప్పెను. ఇంతలో నిరంజ నానందుఁడు చెప్పిన మాటలు జ్ఞప్తికి రా "ఈ దినమునసే కదా గిరీశుని ఇంట, కీటకాధముఁడనని తలఁచిన కీటకాధముఁడనే యగుదుననియు, అట్లుగాక నేనే శివుఁడనని భావించిన శివుఁడనే యగుదుననియు వింటిని. ఇఁక నా గతి ఏమి కావలయును" అనెను. కొంతవడికి మఱల నిట్ల నెను. "అట్లు కాదు. నిజము చెప్పుటయే మంచిది. నేను నిజముగ కీటకమాత్రుఁడనే. పుర్వును పుర్వని పలుచుటయందెట్టి తప్పును లేదు. సత్యము పల్కుట నేరము గాదు. శ్రీ గురుదేవుని కృపాతిశయమునను సాధువర్యులగు మీ యొక్కయు, గిరీశుని యొక్కయు దయాతిరేకము నను నేను సత్యపరిపాలనమునుండి యెన్నఁడును దప్పకుందునుగాత!" ఇట్లు చెప్పుచు నచ్చట నుండినవారలకెల్ల నమస్కరించెను. శ్రీ గురుదేవుని మనసున నెంచి సాష్టాంగముగ నమస్కరించెను. తరువాత కొంతవడి యూరకుండి మరల నిట్లనెను: "ఈ యస్థిపంజరముపై నా కింకను ఇంత మోహముండగా నేనే శివుఁడనని నేనెట్లు చెప్పుకొనఁగలను? గిరీశుఁ డసహాయశూరుఁడు. సాక్షాత్ భైరవాంశ సంభూతుఁడు. కావున అయన తాను శివుఁడని చెప్పుకొనఁ జెల్లును". గిరీశుఁడు తలంపునకు రా నాతనికి నమస్కరించెను. మరల "అయ్యా! నేను నీచాతినీచుఁ డను. మి కెట్టి సేవచేయఁగలను? మీకుఁ బొగాకు చిలుములను దయారు చేసి ఇచ్చుటకే తగుదును" అని చిలుములఁ జేయ నారంభించెను.

రామకృష్ణపురవాసియు శ్రీ రామకృష్ణ భక్తాగ్రేసరుఁడు నగు శ్రీయుత నవగోపాల ఘోషు శ్రీరామకృష్ణ వార్షికోత్సవమును ఎక్కుడు వైభ

వముతోఁ జేయ నమకట్టెను. బెంగాలీ వారపత్రిక యగు "వసుమతీ" సంపాదకుఁడు శ్రీ ఉపేంద్రనాథ ముఖర్జీ నాగమహాశయుల నుత్సవ మున కాహ్వానించెను. నాగమహాశయుఁడు ఉత్సవదినమున ప్రాతఃకాల ముననే అహిరీటోలాలో నున్న యుపేంద్రుని గృహమునకుఁ బోయెను. ఈతఁడు వచ్చుటకు ఉపేంద్రుఁ డొక బండిని గుదిర్చి యుండెను. కాని మహాశయుఁడు నడచివత్తునని చెప్పెను. గుఱ్ఱములను గొట్టినచో మహా శయులు సహింపలేఁడని యుపేంద్రుఁ డెఱిఁగియుండుటచే బండివానిని కొట్టవద్దని యాజ్ఞాపించి మహాశయుని నెంతో బ్రతిమాలి బండి నెక్కిం చెను. గమ్యస్థానమును జేరుచునే ప్రథమమున నవగోపాలబాబునకు సాష్టాంగ వందన మాచరించెను. తరువాత నింటిలోని కరిగి చావడిలో నొకమూల నిలువఁబడి యతిథులకు విసరమొదలిడెను. నవగోపాల బాబును పక్కంగల యతిథు లెంతేని బ్రతిమాలిరి గాని, లాభము లేక పోయెను. రామకృష్ణపుర మంతయు శ్రీ రామకృష్ణుని పవిత్రనామముతో నానాఁడు ప్రతిధ్వనించెను. అతిథులందఱును శ్రీరామకృష్ణ సంకీర్తన మున మైమఱచియుండిరి. శ్రీ రామకృష్ణ భక్తసేవాపరాయణుఁడగు మహాశయునికి వారికి విసరుట దక్క కార్యమేమియుఁ గన్పట్టలేదు. ఆ మూల నట్లే విసరుచు నిల్చుండెను. తరువాత భక్తులందఱును ప్రసాద స్వీకారమునకుఁ బోయినప్పుడు దానుగూడ ముకుళిత కరకములుఁడై వారితో నేగెను. కాని వారి పంక్తినిఁ గూర్చొనుట కియ్యకొనలేదు. అందఱును ఎంతయో వేఁడినమీఁదట ఒక్క మెతుకును మాత్రము స్వీకరించెను. ఈతని నడవడిని జూచి యందఱాశ్చర్య నిమగ్నులైరి.

ఉత్సవానంతరమునఁ గలకత్తాకు మరలునప్పు డెందఱు ప్రయత్నిం చినను మహాశయుని బండి నెక్కింపలేకపోయిరి. అందువలన వారంద ఱాతనితో నడువవలసినవారైరి. వచ్చునప్పుడు మహాశయు లిట్లనెను: "శ్రీ రామకృష్ణదేవుఁడు 'నవగోపాలుని భార్య విద్యాప్రకృతి స్వరూపిణి' యనెను. ఈ భక్తవర్గమును కేవల మనుష్యమాత్రులని తలఁచువాడు పశుప్రాయులు. మానవు లెన్నఁటికిని గాఁజాలరు."

అటుతర్వాత కలకత్తాయందు నాగమహాశయులు కొలఁదికాలమే యుండి స్వస్థానమునకు మరలిపోయెను. ఇదియే కలకత్తాకుఁ బోవుట కాతనికిఁ గడపటిసారి.

శ్రీ రామకృష్ణుఁడు దేహమును జాలించిన తరువాత మహాశయులు స్వస్థానమునకుఁ బోయి, యచ్చట నేకాంతప్రదేశమున నొక కుటీరమును నిర్మించుకొని యందుఁ దా నొక్కరుఁడుమాత్రము వసించుచుండునట్లు సంకల్పించెను. ఇది యాతని సహధర్మిణికిఁ దెలిసి "మిమ్ములను నే నేవిషయమునుగూర్చియుఁ గూడ నెన్నఁడును వేధించియుండలేదు. ఇఁక వేధింపఁబోను. వేఱుగ నుండు టెందులకనెను. భార్య చెప్పిన యీ మాట లపై నమ్మకముంచి మహాశయు లా యింటియందే తన కుటుంబముతో నివసించుట కొప్పుకొనెను. కాని యింటియందు గార్హస్థ్య ధర్మమున నుండె నను మాటమాత్రమేగాని జీవితమును సన్న్యాసులకన్న నెక్కుడు కఠిన నియమములతోఁ గడపెను. అతని భార్య అయునయుం దేనాఁడును ఎట్టి మనోవికారమును బొడగాంచ లేదు. "శ్రీ రామకృష్ణ దివ్యనామముఁ గైకొని యాయన సకల విషయేచ్ఛలఁ ద్రొక్కివైచెను. ప్రజ్వలితాగ్ని మధ్యమున నుండెను.గాని దేహమెచ్చటను గనుగంచలే"దనెడిది.

ఒకమారు దియోబాగునందలి యాతని గృహమునకుఁ గులగురువు సంతతివారగు నిర్వు రేతెంచిరి. వారిలో నొకఁడు భక్తుఁడు. అతని పేరు నవీనచంద్ర భట్టాచార్యుఁడు. దీనదయా ళిదేపనిగ నాతని బలవంతపఱు చుటచేత నాతఁడు మహాశయునిఁ జూచి "యోయీ! గృహస్థాశ్రమ ధర్మ మును దెలిసికొని వివాహము చేసికొనుట యెందులకో, భార్య యననేమో తెలిసి వంశమును నిలుపుటకై కడంగు"మనెను. ఇది విని మహాశయుఁ డమితదుఃఖమున నిలువునఁ గూలఁబడి మూర్ఛనొందెను. ఒడలంతయు గాయములుపడి రక్తసిక్తమయ్యెను. తరువాతఁ గొంతవడికి లేచి యాభక్తునిఁ జూచి "యయ్యా! తమరు మా కులగురువుల సంతతివారు, మఱియు భక్తులు. అట్లుండియు నన్నిట్టి నీచకార్యమునకు సిద్ధపడుమని యాజ్ఞఁ జేయుటకంటె వేఱొక పాపకార్య ముండునా?" యనుచుఁ బ్రక్కనున్న

యొక యిటుకరాయిఁ దీసికొని తల పగిలి గాయమై రక్తము స్రవించు వఱకును గొట్టుకొనెను. ఇది చూచి యా భక్తుఁడు మిక్కిలి విచారించి తన యాజ్ఞను రద్దుచేసెను. తోడనే మహాశయుఁడు సంతోషముతో నాతని పాద ధూళిని స్వీకరించెను.

ఒకతఱి దీనదయాళు మహాశయునిఁ గోపమున నిట్లనెను. "సన్న్యాసివలె నిట్లుండిన నీకు కూడుగుడ్డలెన నెట్లు వచ్చును?" అంత నాగమహాశయుఁడు "తండ్రీ! సంసారవిషయమై జిజ్ఞాస పడవలదు. వృక్షము లన్నియు లేఁజివుళ్ల నెల్లప్పుడు నలరారుచునే యుండును. నాకు ఏ స్త్రీపైనను మోహమెన్నఁడును జనించియుండలేదు. జనని గర్భమునుండి వెలువడినప్పు డెట్లుంటినో యిప్పుడు నట్లే యుంటిని. ఇఁకఁ గట్టుకొనుటకు గుడ్డ యేల?" అనెను.

మహాశయుని సంసారవైముఖ్యమునకు దీనదయా ళాతని దఱచు మందలించువాఁడు. ఈ విషయమై తండ్రికొడుకుల కొకనాఁడు వాద మేర్పడెను. మహాశయుఁడు ఉద్రేకముతో "నా జన్మమం దెన్నఁడును నాకు మోహము జనించియుండలేదు. ఈ ప్రపంచముతో నాకెట్టి సంబంధమును లేదు. నాహం నాహం (నేను కాదు, నేను కాదు,)" అనుచు దిగంబరుఁడై గృహమునుండి వెడలిపోయెను. ఇది చూచి భార్య వెక్కి వెక్కి ఏడువ నారంభించెను. ఆమె దుఃస్థితిఁ గాంచి జాలిగొని, మహాశయుని భక్తుఁడొకడు ఆతని మరల నింటికిఁ గొనివచ్చెను.

దియోబాగు వాస్తవ్యయు, మధ్యవయస్కురాలు నగు వితంతు వొకర్తుక తఱచు మహాశయునికడకు వచ్చుచు నొక గొప్ప భక్తురాలివలె నటించుచుండెను. కాని యామె యపవిత్రభావమును, ఆమె దుర్వృత్తియు మహాశయుని సూక్ష్మదృష్టికిఁ దెలియనయ్యెను. అట్టి వయసు నందుఁ గూడ నామె యట్టి భావముఁ గలిగియుండుట కాతఁడామెను జాల నసహ్యించుకొనెను. ఈమె మనోభావములను మహాశయుని భార్య గ్రహించి యామె నింటికి రాకుండఁజేసెను. దీనిగూర్చి మహాశయుఁడిట్లు చెప్పువాఁడు: "అయ్యో! యీ తుచ్ఛ, దుర్గంధపూరిత కళేబరమును

కుక్కలును గ్రద్దలును గూడఁ జెనకఁజాలవు. అట్టి ఈ శరీరముపై ఆమెకు మోహ మెట్లు కల్గెనో తెలియకున్నది. శ్రీ గురుదేవుఁడు నన్నింకను ఎన్ని విధములఁ బరీక్షించుచున్నాఁడు! కరుణామయుఁడగు భగవంతుని కటాక్షము లేక మోహాంధకారమునుండి వెలువడుట ఎట్టివానికిని అసంభవము” అనెను. అప్పుడప్పు డీతని ముఖమునుండి సులభగ్రాహ్యముగ గొప్ప వేదాంతసత్యములు గూడ వెలువడుచుండెను. మోహమున కెంత దూరమో భగవంతుని కంత దగ్గఱ యని యాతఁడు తఱచు చెప్పువాఁడు.

కామినీవిషయమున నుండిన వైముఖ్యమునకన్న నాతనికిఁ గాంచనము పట్లనె ఎక్కుడు వైముఖ్యము. ఒకతఱి “పాలుల” బంధువులలో నొకనికి విషూచి తగిలెను. ఎన్ని వైద్యములో చేయించిరి. కాని రోగము తగ్గలేదు. వైద్యమందు మహాశయుని కౌశలమును ఎఱఁగియున్నవా రగుట నాతని సాయపడుమని వేఁడుకొనిరి. మహాశయుఁడును మాట తీసివేయ నేరక యొక హెూమోపతీ మందును జెప్పెను. ఆ మందు నీయఁగనే వ్యాధి కుదిరెనను సంతసమున “పాలులు” మహాశయునికి బహుమాన మీయవలెనని కొంత సొమ్మును దీసికొని వెళ్ళిరి. మహాశయుఁడు తీసికొనలేదు. వా రెంతయో బలవంతపఱచిరి. అంత మహాశయుఁ డేడ్చుచు “అయ్యో! దైవమా! నన్ను ఈ నింద్యార్థమగు వృత్తిని ఏల నేర్చునట్లు చేసితివి? ఇందువలన నెన్ని పాపముల కొడిగట్టవలసియున్న” దనెను. అతని యాక్రందమును జూచి “పాలులు” “మహాశయా! నీవు మనుష్యమాత్రుఁడవు కా” వనిరి.

ఈ యలౌకిక గృహమేధికృత్యము లన్నియు నలౌకికములుగనే యుండెడివి. “పాలుల” కోరికపై నొకనాఁడు మహాశయుఁడు భోజేశ్వరమునకుఁ బోయెను. భోజేశ్వరమునుండి మరలఁ గలకత్తాకుఁ బోవునప్పుడు దారిబత్తెములక్రింద నెనిమిది రూప్యములను, చలి నాపుకొనుట కొక కంబళము నిచ్చిరి. భోజేశ్వరమునుండి యోడరేవున కాఱుమైళ్ళ దూరము. మహాశయుఁడు ఓడరేవును జేరి టిక్కెట్టు తీసికొనఁబోవు సమయమున నొక భిక్షుకి యిద్దాఱుగురు బిడ్డలు తన్ను బట్టుకొని వ్రేలాడుచుండ మహాశయు

నకు నమస్కరించి ప్రతిదినముగఁ దన కష్టములను జెప్పుకొని తన కేమైన నిమ్మని ప్రార్థించెను. మహాశయుఁ డామె దీనాలాపములకుఁ జాలిగొని తనయొద్ద నున్న యెనిమిది రూప్యములను కంబళము నామె కిచ్చెను. భిక్షుకియు సంతసించి యాతని దీవించి వెడలిపోయెను. అఱువైమైళ్ళు నడచుటవలనఁ గలిగిన యలసట నపనయించుకొన నెంచి యటఁ గొండొక తడవు విశ్రమించెను. ఓడ రేవు విడిచిపోయిన తరువాతఁ గలకత్తాకు నడచుట కారంభించెను. అతని యొద్ద ఏడణాల యాఱుపైసలు మాత్ర ముండెను. మార్గమధ్యమున నేదేని దేవాలయమున్న నందలి ప్రసాదము స్వీకరించియు మఱొకప్పు డటుకులను భుజించియు ఆఁకలిని దీర్చుకొనుచుఁ బ్రయాణము సాగించెను. నడుమ నదులను దాఁటవలసినప్పుడు చిన్నవైనచో, నీఁదియుఁ బెద్దవైనచోఁ గొలఁది పైకమునకుఁ జిన్ననావ నెక్కియు దాఁటిపోవువాఁడు. ఇట్లు తనయొద్ద నున్న కొలఁది యణాలపై నాధారపడి యిరువది దినము లేకదీక్షగ నడచి కలకత్తా చేరెను.

ఒకసారి మహాశయుఁడు ఉప్పువర్తకము చెడిపోవుటచే దగ్గఱ పైకము లేక మిక్కిలి దుఃస్థితియం దుండెను. తఱచు నిరాహారుఁడై పోవలసి వచ్చెడిది. అంత, చాలకాలమునకు "పాలులు" రెండువేల మణుగుల యుప్పును పంపిరి. అమ్ముటకై మహాశయుఁడు ఖిదిర్పురమునకుఁబోయెను. అంత యుప్పున కధమము ఏడురూప్యములైనను వచ్చియుండును. కాని మహాశయుఁడా యెండలోఁ గూర్చొనియుండి పదుమూఁడణాలకంటె నెక్కువ సంపాదింపలేకపోయెను. ఆ పదుమూఁ డణాలను దీసికొని యింటికి వచ్చుచుండఁగా వారిలో నొకఁడు తన కష్టములను జెప్పుకొని తన కేమైన నియ్యుమని వేఁడుకొన నా పదుమూఁడణాల నాతని కిచ్చి రిక్తహస్తుఁడై యింటికిఁ బోయెను. ఆ దినమున కాఁకలి బాపుకొనుట కింట నొక బియ్యపు గింజయైన లేకుండెను.

చిన్నతనమునఁ బిల్లి మ్యావు మనుటయుఁ గుక్క మొఱుఁగుటయు మహాశయుని చెవిని, వాని క్షుద్బాధను సూచించు శబ్దములుగఁ బడుచుండెను. అప్పు డతఁడు మేనత్తను జూచి "అమ్మా! అవి యట్లేందుల కేడ్చుచున్నవి ?

వానికిఁ గొంచె మాహారమిడరాదా?" యని కొంచె మన్నముతీసికొని "యన్నా! యేడ్వకుము. ఇదిగో యాహారము స్వీకరింపు" మని పెట్టువాఁడు.

మహాశయుల ఇంటియొద్ద నొక చిన్న చెఱు వుండెను. అతఁడు పదుమూఁడు పదునాల్గు సంవత్సరముల వయస్సున నుండినప్పు డను దినమును భోజనానంతర మా చెఱువునొద్దకుఁ బోయి ముఖమును జేతులును బ్రక్షాళనము చేసికొనువాఁడు. ప్రక్షాళనార్థము పోవునప్పుడు తనతో నన్నమును బప్పును దీసికొనిపోవును. ఈతని చేతితో నిడు నాహారమున కలవాటుపడిన యా చెఱువునందలి చేఁప లీతని పిలుపును వినఁగనే వచ్చి చేతినుండి యా పప్పును అన్నమును స్వీకరించెడివి. ఇట్లాతఁడు కలకత్తాకు విద్య నభ్యసించుటకుఁ బోవువఱకును జేఁపలతో నాడుకొనువాఁడు. మహాశయుఁడు పశుపక్ష్యాదులకుఁగూడ జ్ఞానము కలదనియు జన్మాంతరముల నుచ్చ జన్మల నెత్తి యవి ముక్తములగుననియుఁ జెప్పువాఁడు.

వేసవికాలమున నొకనాఁటి యుదయమున మహాశయుఁడు గృహ మంటపమునఁ గూర్చొని పొగ పీల్చుచుండ రెం డడవిమైనపు గోరువంక లాతనిముందు వ్రాలెను. మహాశయుఁడు వానిని గమనింపక పోవుటచే నా గోరువంక లాతని పాదముల ముక్కుతోఁ దాఁకి తాము వచ్చిన సమాచార మును దెలిపెను. అంత మహాశయుఁడు వానిని జేతుల లేవనెత్తి ముద్దుగొని "యమ్మలారా! వచ్చితిరా! ఇంచుక నాగుఁడు. ఆహారముఁ గొనివత్తు" నని లోనికిఁ బోయి యన్నము దెచ్చి తన చేతులతోఁ దినిపించెను. కాని వాని యాఁకలి యింకను దీరకపోవుటచే నవి వానిప్రక్క ప్రదక్షిణము చేయ నారంభించెను. మరల లోనికిఁ బోయి మరికొంత యన్నమును జలమును దెచ్చి యిడ నా పక్షు లాతని చేతిపైఁ గూర్చొని యా తెచ్చిన యాహారమును దిని తృప్తిచెందెను. తృప్తిచెందిన యనంతర మా పక్షుల నుపలాలించి "మీ రిఁక నరణ్యమున కేగి యిచ్చవచ్చిన ట్లాడుకొని రేపీ వేళకు రం" డన నవి యెగిరిపోయెను. తరువాత నాగమహాశయుఁ డిట్లనెను. "ఆహా! శ్రీ రామకృష్ణుఁడు తన పుత్రులతో నెన్నివిధముల నాడుకొనుచున్నాఁడు. అతని వింతలీలల నెవరెఱుఁగఁగలరు?"

నాగమహాశయుఁ డహింసాధర్మ ప్రత్యక్షస్వరూప మని చెప్పవచ్చును. "అహింసా పరమో ధర్మః" అను సిద్ధాంతమును అతఁడు అక్షరము వదలక యనుష్ఠించెను. నారాయణగంజిలో జనపనార నుత్పత్తిచేయు (Jute Mills) యంత్రాలయములయందుఁ బనిచేయుచుండిన యిర్వు రాంగ్లేయోద్యోగులు వేఁట తమకమున దియోబాగునకు వచ్చిరి. తుపాకుల ధ్వని విని మహాశయుఁడు వారి దరికిఁ బరుగునఁ బోయి చేతులు జోడించి "యయ్యా! దయయుంచి యీ దుష్కృత్యమునుఁ జేయవల"దని దీనముగ వేఁడుకొనెను. ఈతని మాటల యర్థమును దెలియక వారు తుపాకులను మరల దట్టించి కాల్చుటకుఁ దొడంగిరి. మహాశయుఁ డంత టఁ బెదరించుచు, "కాల్చినచో జాగ్రత" యనెను. ఆ దొర లితఁ డున్మత్తుఁడని వారి పనులయందు నిమగ్నులై యుండిరి. తోడనే మహాశయుఁ డొక్కక్షణమున వారిపై కురికి రెండు చేతులను రెండు తుపాకులను బట్టు కొనెను. తుపాకుల నాతని చేతినుండి తీసికొనుటకు వా రెంతయో ప్రయత్నించిరి. అతని సంకల్పశక్తి యపారము కావున నాతఁ డపుడు సింహబలునివలెఁ గన్పట్టెను. వారల కతనితోఁ బెనఁగుట యసాధ్యమయ్యెను. తరువాత మహాశయుఁ డా తుపాకుల నింటికిఁ గొంపోయి యొకమూల నునిచి యట్టి ముష్కరాయుధములఁ దాకినందు లకు రెండు చేతులను రాతిపై బెట్టి రాచి రాచి కడిగెను. ఉద్యోగులును నారాయణగంజికిఁ బోయి యీతనిపై నభియోగము తే నమకట్టిరి. ఇంతలో మహాశయుఁ డొక బంగాలీ యుద్యోగస్థునిచే నా యాయుధముల వారికిఁ బంపివేసెను. అతఁ డా తుపాకుల వారి కిచ్చి మాట సందర్భమున మహాశయుని సాధుస్వభావమును గూర్చి చెప్పెను. అతనిపై భక్తిగౌరవము లుదయింప వారు దమ యుద్దేశమును మార్చుకొనిరి. అప్పటినుండి వారు మరల వేఁటకై దియోబాగునకుఁ బోలేదు.

మహాశయుఁడు ఎట్టి ప్రాణియైనను గష్టపడుట చూచి సహింప లేకుండెను. ప్రతిసంవత్సరమును వఱదలలో నెన్నియో చేఁపలు కొట్టు కొనివచ్చి యాతని ఇంటియొద్ద నున్న చెఱువునందు నివాస మేర్పఱచు కొనును. ఒక దినమున నొక జాలరి యా చెఱువునందుఁ గొన్ని మత్స్య

ములఁ బట్టి యూరి కట్టుబాటుప్రకారము చెఱువు స్వంతదారునకు ఈయవలసిన భాగము నిచ్చుటకై మహాశయుని యింటి కేగ నాతఁ డా జాలరి గంపలోఁ గొట్టుకొనుచున్న చేఁపలను జూచి జాలినొంది తత్క్షణ మా జాలరి యడిగిన రొక్కమిచ్చి వానినన్నిఁటిని కొని మరలఁ జెఱువున విడిచెను.

ఇంకొకదినమున వేఱొక బెస్తవాఁ డా తటాకమునఁ జేఁపలఁ బట్టి యమ్ముట కీతని గృహమున కేగెను. ఈ సారి గూడ మహాశయుఁడు వాని నన్నిటిఁ గొని యథారీతిగఁ జెఱువున విడిచెను. జాలరి దీనిని జూచి భయపడి యా చేఁపల వలయును దట్టయుఁ దనకు జేరఁగనే యా పిచ్చి వాని జారినుండి పారిపోయెను. జన్మమధ్యమున మరల నాతఁడు మహా శయుని ప్రాకారమును దాఁటి ఎన్నఁ డావైపునకుఁ బోయి ఎఱుఁగఁడు.

మహాశయుఁడు అహింసా వ్రతదీక్షయం దెంత పట్టుదలతో నుండె నన నాతఁడు సర్పములు మొదలగు క్రూరజంతువులఁగూడఁ జంప నొల్లకుండెను. ఒకపరి త్రాఁచుపా మొకటి యీతని పెరటిలోనికి వచ్చెను. దానిఁ జూచి యచ్చట నున్నవారందఱును భయభ్రాంతులైరి. మహాశయుని భార్య ఆ పామును జంపివేయుట మంచిదని చెప్పెను. అందుల కాతఁడు "అడవులలోనుండు ఈ పాములఁ జంపుటవలన నేమి రాఁగలదు ? మన మనస్సులలో నున్న పాములఁ జంపవలెను" అనుచు నా పామును నంబోధించి, చేతులు జోడించి "మీరు మనసాదేవియొక్క ప్రత్యక్షస్వరూపము. మీకు యోగ్యనివాసము అరణ్యము. ఈ నాకుటీర మును విడిచి మీ నివాసమునకే పోయి నన్నాశీర్వదింపు"డనెను. ఈతని మాటయందలి యర్థమును దెలిసినదానివలె ఆ పాము పడగను దించి యరణ్యమువైపునకుఁ బోయెను. మహాశయుఁడు తఱచుగ "నీ బహిః ప్రకృతి మన మనస్సులయొక్క పరివర్తనమే. నీ వీ ప్రకృతి నెట్లు చూడ నెంతువో నీ కది యటులనే కన్పించును. అది యద్దము వంటిది. దర్ప ణము నెదుటఁ జేయు వెక్కిరింతలనెల్ల నందలి ప్రతిబింబము మన కటులనే సమర్పించును" అనువాఁడు.

ఒకదినము మహాశయుఁడు చెఱువునందు ముఖప్రక్షాళనము చేయుచుండఁగా నొకపాము అతని కాలి బొటనవ్రేలిని గఱచెను. పాము తన పనిని నిర్విఘ్నముగఁ జేయుటకై మహాశయుఁ డచ్చోటినుండి కదల లేదు. తరువాత నాతనిభార్య వచ్చి యీ వింత చూచి గడగడ వణఁకెను. మహాశయుఁడు అంత "ఎందు కిట్లు భయభ్రాంత వయ్యెదవు? ఉపద్రవ మేమియు లేదు. పాప మీ నీటిపాము నా వ్రేలిఁ జూచి యది కప్ప యని భ్రమపడి పట్టుకొని త్వరలోఁ దన ప్రమాదమును దెలిసికొని నా కపాయము గలుగకుండ విడిచిపుచ్చినది" యనెను.

ప్రాణిలోకమునం దెల్ల నొక్క పరమాత్మయే నివసించుచుండె ననుట యాతని కనుభవసిద్ధము. సర్వలోకమును ఆ పరమాత్మయందే పుట్టి ఆ పరమాత్మయందే తమ జీవయాత్రను గడపుచున్నది యనుట యాతనికి సాక్షాత్కారము. ఎల్లప్పుడును నీ విట్లెందుకు చేతులను జోడించుకొని యుందు వనినఁ దనకు సర్వ ప్రాణిలోకమునందును ఎల్లెడలను తన ఇష్టదేవత కానుపించుచుండె నని చెప్పువాఁడు. సజీవమగు పాదునుండి యొకయాకును గోయుటకూడ నాతనికి కష్టముగ నుండెను. అందుమాత్ర మా పరమాత్మ స్పందనము లేదా? నాగమహాశయుఁడు చీమలు, దోమలు మొదలగు చిన్న ప్రాణులనుగూడ నశ్రద్ధగఁ జూచువాఁడు కాఁడు. చీమలు తనపైఁ బ్రాఁకినచో సంతోషమున వాని నింకొక క్షేమకరమగు స్థానమునకుఁ జేర్చువాఁడు. ఈ భూతదయార్ద్ర భావ మాతని మనమును సంపూర్ణముగ వశముచేసికొన నొక్కొక్కప్పుడు అతఁడు తన పాదముల క్రిందఁబడు ననేక జీవములు మృతిజెందు నని యెచ్చటికిని బోకుండ నుండువాఁడు. ఒక్కొక్కప్పుడుచ్ఛ్వాసనిశ్వాసముల వలన గాలిలోని సూక్ష్మజీవములు నశించునని వాయువును బంధించువాఁడు. అట్టి సందర్భములయందు అతని మరల నూపిరి పీల్చునట్లు చేయుట కొక సూత్రము "నీవు ఆత్మహత్యను జేయఁ గడంగుచున్నా వనుటయే". ఆత్మహత్యనుగూర్చి శ్రీ రామకృష్ణుఁడు చెప్పిన వాక్యముల నాతఁడు జవదాఁట నొల్లఁడు. "ఈశావాశ్యమిదం సర్వం" అను నుపనిషద్వాక్యము ననుభవసిద్ధముగఁ దెలిసికొని అన్ని

టను నొకే జీవశక్తి ప్రవహించుచున్నదని యెఱిగి మానవులకువలెనే చెట్లు చేమలకును సుఖదుఃఖము లున్నవని గ్రహించి, తదనుగుణముగఁ దమజీవితమును గడపిన యనేక సాధుపుంగవుల జీవితములు మన హిందూదేశమున విశ్రుతపూర్వములు. పవిత్ర వాఙ్మయమున నాళ్వారులయొక్కయు, నాయనారులయొక్కయు జీవితములయం దిట్టి యనుభవము లెన్నియేని గలవు.

ఒకప్పుడు మహాశయుని భక్తులలో నొకఁడు ఆయన యింటి చావడిలోఁ గూర్చొని చావడికిఁ దూర్పుభాగమున కాధారముగ నుంపఁబడిన స్తంభములను చెదలు పట్టియుండఁ జూచెను. తోడనే యాతఁ డా స్తంభమును గొట్టగ నా చెదపురుగులు రాలి భూమిపైఁ బడెను. మహాశయుఁడు దీనిని జూచి "అయ్యో! ఎట్టిపని యొనర్చితివి! పాప మీ పుర్వు లెంత కాలమునుండియో యీ స్థానమున శాంతిప్రదముగ నివసించుచుండెను. ఇట్లు వీనిని చెదరఁగొట్టు టెంతక్రూరము! ఎంత యన్యాయ"మని చెప్పెను. ఇట్లు చెప్పుచుండ నాతని కన్నులఁ గరుణాశ్రువులు నిండి యుండెను. పాప మా శిష్యుఁడు నిస్తబ్ధుఁడై ఖిన్నుఁడై బొమ్మవలె నిలువఁబడి పోయెను. అంత మహాశయుఁ డా పుర్వుల సమీపించి "ఇఁక మీరు మరల మీస్థానము నాక్రమించుకొనుఁడు. మిమ్మెవ్వరును బాధపెట్ట"రని మరల నవి పుట్ట పెట్టుకొనుటకు సాయపడెను. కొంతకాలమునకు స్తంభములు కూలి పోయెను. కాని యా చెదపురుగులను బాధించుట కాతఁ డొప్పుకొనలేదు.

మహాశయునికి బాల్యమునుండియు గోవనిన నతిశయభక్తి. ఆవులం దాతఁడు జగన్మాతృస్వరూప మెక్కుడుగ దర్శించువాఁడు. తఱచు దాని పాదధూళి శిరమునం దుంచుకొనును. ఒక దినమున నాతని యొద్దఁ చెఱకుగడ ముక్క యుండఁగఁ జూచి దాని యాకులఁ దినవలెనని యావొకటి ప్రయత్నించుచుండెను. అంత మహాశయు లా చెఱకు ముక్కను చిన్నముక్కలుగ గోసి యావునకుఁ బ్రేమతోఁ బెట్టెను. తరువాత దాని పాదములకు సాష్టాంగపడి విసర నారంభించెను. విసరు

చుండఁగ నాతని మనమున భక్తిభావ ముదయించి యాతఁడు స్మృతిరహితుఁడై పడిపోయెను.

మహాశయుఁడు శక్త్యుపాసకుఁడు. శక్తియుపాసనయందు బ్రహ్మమును తల్లి రూపమునఁ బూజింతురు. ఆయనయు శ్రీ రామకృష్ణుని వలెనే "త్రోవలెన్నియైనను గమ్యస్థాన మొక్కటియే. ఇందు జాతి మతభేదములు ప్రయోజనపడవు. ఏయొక్క మతమును నమ్మి యందు నిష్ఠ గలిగియున్నను ఈశ్వరుఁడు తప్పక కటాక్షించును" అని నమ్మెను. అతనికి జాతిమతములయం దెట్టి భేదబుద్ధియు లేకుండెను. శైవులయినను, వైష్ణవులైనను * బౌలులైనను, కర్తాభజులైనను అత డొకే రీతిని గౌరవించెను. అతనికి మునల్మానులయందును క్రైస్తవులయందును. హిందువులయందును సమాన గౌరవ ముండెను. మసీదును జూచినపు డెల్ల నాతఁడు చేతుల జోడించువాడు. అదేరీతిగ క్రైస్తవ దేవాలయముల గాంచినప్పుడును "జీససునకు జయమగుగాక" యనుచు నమస్కరించువాఁడు.

భక్తి సాధనలగూర్చి యిట్లనువాఁడు: "ఫలవృక్షము క్రిందనుండు కాపరివలె బుద్ధి యెల్లప్పుడును మెలఁకువగ నుండవలెను. పండ్లు పక్వమగుట ఈశ్వరుని కృపాధీనము. సాధకుఁడు తన సాధనలయొక్క ఫలము ననుభవించుట యెల్ల నాతని కటాక్షమే. కొందఱియెడల నెట్టి పురుషప్రయత్నమును లేకయే యా కరుణ ప్రసరించును. ఈ ప్రకారము వారు నిద్రించుచుండ కృపాసింధువగు భగవంతుఁడు వారిపై నమృతమును వర్షించెనా యనునట్లు అందఱకును ఆశ్చర్యకరముగ నుండును. అట్టి వారలు ఎట్టి సాధనలను అభ్యసింపవలసిన యవసరమే యుండదు. వారలు ♦ కృపాసిద్ధు లనఁబడుదురు. భగవంతుని యను

---

* వీ రిర్వురు చైతన్యమతమునందు రెండు విధములవారు.

♦ భగవంతుని యవ్యాజ కృపాకటాక్షమునకుఁ బాత్రులైనవారు కృపాసిద్ధులు. ఇట్టివారనేకులు అవతారమూర్తుల చరిత్రలయందుఁ గానఁగుదురు. ఉదాహరణరూపమున చైతన్య మహాప్రభుని కృపకుఁ బాత్రు

గ్రహము లేక యాతని నెవ్వరునుఁ జూడఁజాలరు. పరమేశ్వరుఁడు భక్తుల పాలిటి కల్పతరువు. తన్నుఁ గోరిన దెల్లయు నొసఁగును. కాని మనుజుఁడు బుద్ధిగలిగి మరల సంసారసాగరమునఁ బడఁద్రోయు కోర్కెలఁ గోర రాదు. అతని చరణ కమలములయం దచంచలభక్తియు ఆత్మజ్ఞానమును ఇచ్చునట్లే కోరవలెను. అట్లు కోరినయెడల నాతఁడు ప్రాపంచిక విషయ బంధవిముక్తుఁ డగుచు అతని కృపకుఁ దప్పక పాత్రుఁడగును. ప్రాపంచి కేచ్ఛలఁ దవిలినచో సుఖ మెన్నఁడును ఉండఁజాలదు. ఏ భక్తుఁడు సదా యాశ్వరధ్యానమందే మునిఁగి యాతని భక్తగణమును భక్తితోఁ బూజించుచుఁ బవలు రాత్రి యనక యా దేవదేవుని నామస్మరణముఁ జేయుచుండునో యాతఁడు మాత్ర మి దుఃఖభూయిష్ఠమగు నీ ప్రపంచ మున కతీతుఁడగును.”

మఱియు అణిమాద్యష్ట సిద్ధులనుగూర్చి ఇట్లనువాఁడు: “హృద యము పవిత్రమై ఆధ్యాత్మిక పథమున నుచ్చైఃస్థితిని బొందు కొలఁదిని గొన్ని సూక్ష్మతరములగు విషయేచ్ఛలు మనస్సు నాకర్షింపఁ జొచ్చును. అట్టి వానికిఁ గొన్ని యలౌకికశక్తులు వచ్చి అతఁడు వానిని ఉపయోగించు కొలఁది అవి అతనిని అధఃపతితునిఁ జేయఁ జూచును. నిర్మలాత్మునికి వస్తువితర్క మనవసరము. స్వచ్ఛమగు స్ఫటికమునఁ గూడఁ బ్రతి లౌకిక విషయమును సంపూర్ణముగఁ గోచరమగును. కాని ఇట్టి మహిమ లాతని మనము నాకర్షించినచో నాతఁడు తన యాదర్శజీవితమునుండి యధఃపతితుఁ డగును.”

నాగమహాశయుని సమక్షమున నాతని భక్తుల కెట్టి సందేహము లుద యించినను వారాతని నడుగువారుకారు. మహాశయుఁడే యా సంగతిని ప్రసంగవశమున నెత్తి వారికిఁ దృప్తియగునట్లు సందియములఁ దీర్చు వాఁడు. ముఖమును జూచి ఎట్టివాని యొక్కయు స్వభావమును దెలిసి కొనఁగల శక్తి గలవాఁడు. అతఁ డొకని పక్వభావమునుగూర్చి చెప్పిన

---

లైన బందిపోటు దొంగలును హంతకులును నగు జగన్నాథుఁడు మాధ వుఁడు నను సోదరులు ఇచ్చట పేర్కొనఁ దగినవారు.

వాక్యము లెన్నఁడును తప్పిపోలేదు. ఒక్కొక్కసారి భార్యతో నెవరో యొకరు తమ యింటి కతిథులుగ రాఁబోవుచున్నారనియుఁ దాను అంగడికేగి వస్తువులను గొనివత్తుననియుఁ జెప్పి యాతఁ డంగడికిఁ బోయి మరల వచ్చునప్పటి కా చెప్పినవారు తప్పక వచ్చియుండువారు.

ఒక దినమున నశ్వినీకుమారచక్రవర్తి యను నాతఁడు శరచ్చంద్ర చక్రవర్తితో మహాశయుని జూచుటకు దియోబాగునకు బయలుదేరెను. అశ్వినికి శూలనొప్పి ప్రతి సాయంత్రమును వచ్చి రాత్రియంతయు నాతని మూర్ఛాబద్ధునివలెఁ బడవేయుచుండెను. ఆ బయలుదేరిననాఁడు వారు దియోబాగును సాయంత్రములోపలఁ జేరలేకపోయిరి. అందువలనఁ బ్రతి నిమిషమును ఆ బాధ ఎప్పుడు వచ్చునో యని భయపడుచుఁ బయనము సాగించుచుండిరి. కాని భగవానుని దయవలన నే కష్టమును లేక దియోబాగును జేరిరి. అశ్విని వేళ తప్పుటచే నిఁక నారాత్రి గూడ నే బాధయుఁ గలుగునట్లు తోఁచదని చెప్పఁగ శరత్‌చంద్రుఁడు సంతసించెను. అయిదుమాసములు నిద్రాహారములు లేక బాధపడుచుండిన యాతఁడు ఆరాత్రి నొప్పి రాకుండుటచేఁ దృప్తిగ భుజించి హాయిగ నిద్రించెను. అట్లు వారిర్వును సుఖముగ మూఁడుదినము లుండిరి. తరువాత అశ్విని యీ సంగతి జ్ఞప్తికి వచ్చినప్పుడెల్ల "నేను నా పూర్వ దుష్కర్మమువలన ననుభవించుచుండిన బాధయెల్ల నొక్కసారి యీ మహాత్ముని దర్శనము సేయఁగనే యుపశమిల్లెను. అప్పటినుండియైన నాయననే పట్టుకొని యాయన దయకై వేచియుండినచో నీ నరికి నా స్వభావ మెంతయో మాఱి నా యదృష్టము ఫలింప ముక్తిమార్గమున నెంతయో దూరము పోయియుందును గదా" యని విచారించువాఁడు.

ఇంకొకతఱి నొక బ్రాహ్మణ బాలకునికి స్ఫోటకము వచ్చెను. వితంతువగు నాతని తల్లి యా బాలునియెడల జీవితాశ గన్పట్టక పోవుటచే మృత్యుశయ్య నలంకరింపనున్న యా చిఱుతని మహాశయుని యింటి గుమ్మముముందుఁ బడవైచెను. కాని భగవదనుగ్రహమువలన నా బాలుఁడు రోగవిముక్తుఁ డయ్యెను. తరువాత సురేశుఁడు "మహాశయా!

యా బాలుఁడెట్లు జీవించెనని" యడుగ "సురేశా! బాలుఁడు జీవించిన మాట మాత్రము నిజము, కాని ఎట్లు బ్రదికెనో యది నే నెఱుఁగ "ననెను.

వేసవికాలమున నొకనాఁడు మహాశయుని గృహమున కొకింత ఉత్తరమున నున్న పూరిఇంటికి నిప్పంటుకొనెను. కొలఁది సేపటిలో నా యగ్నికి వాయువు తోడై యగ్నిని సహస్రముఖముల వ్యాపింపఁ జేసెను. చూచుచుండఁగనే భయంకరమగు జ్వాలయయ్యెను. మహాశయుని ఇల్లు ఈ పూరిఇంటికి ముప్పది బారల దూరమున నుండెను. అగ్నికణము లన్నివైపుల కెగురుచుండెను. చుట్టుప్రక్కలఁ బ్రదేశమంతయుఁ గోలాహల మయ్యెను. ప్రతివ్యక్తియు మంటల నార్పుటకుఁ బ్రయత్నించుచుండెను. మహాశయుని కిది యేమియుఁ దెలియక ముకుళిత హస్తుఁడై యామంట కెదురుగఁ గూర్చుండెను. మహాశయుని భార్య తన గృహముగూడ నాయగ్ని కాహుతి యగునను భయమున కంపిత దేహయై యింట నున్న గుడ్డలు మొదలగునవి యావలకుఁ దీయుచుండెను. మహాశయుఁ డిది చూచి "యోసీ మూర్ఖురాలా! ఇంకను ఎట్టి యజ్ఞానమున నుంటివి? ఈ తుచ్ఛములగు వస్తువులతో నేమిచేయుదువు? పరబ్రహ్మమూర్తి యీ రూపమున నీ యింటి కెంతయో దగ్గఱకు వచ్చినాఁడు. అతనికిఁ బూజల నర్పించి ప్రార్థించుటకు బదులుగ నీ స్వల్పములును నీచములునగు వస్తువులకై దేవులాడుచుంటివా?" యని "జయ్ పరమేశ్వరా! జయ్ సచ్చిదానందా!" యని కేకలిడుచు నృత్యము సేయుచు "మనుష్యుని రక్షించుటకై భగవంతుఁ డున్నప్పుడు భయమెందులకు? ఆయనకు రక్షింపఁ గోరిక లేకున్నచో, నా వ్యక్తిని రక్షించుటకు భూమియం దెట్టి శక్తియును లే" దనెను. తరువాత నా పూరియింటిని భస్మమొనర్చి యగ్ని చల్లారెను. మహాశయుని గృహము చెక్కుచెదర కట్లే యుండెను.

అర్ధోదయము ♦ వచ్చిన సంవత్సరమున నా పవిత్ర దినమునకు

---

♦ ఇది ప్రతి ఏబది సంవత్సరముల కొకమారు వచ్చుచుండును. ఇది పూర్వాచార పరాయణుల కతి పవిత్రదినము.

మూఁడు నాల్గుదినములకు ముందే మహాశయుఁడు స్వస్థానమునకు మరలి వచ్చెను. అందువలన దీనదయాళు మిక్కిలి కోపము చెంది "యోరీ! నీ దెట్టి మతమో తెలియకున్నది. కడు వింతగ నున్నది. ఇదియా నీ మత సారము. వివిధదేశములనుండి వచ్చిన మనుజు లెట్టిన నా గంగాతోయ ముల స్నానము చేసినఁ జాలునని వేచియుండు సమయమునఁ బడిపోయి నట్లు పరమ పవిత్రమగు గంగానదిని వదలి యిచ్చటికి వచ్చితివా? చేతికి దొరికిన రత్నమును బోఁగొట్టుకొని గాజుపెంకులకై వెదకు నభాగ్యశాలివి నీవు! ఇప్పుడైనను దరుణము మించిపోలేదు. సన్నుఁ గలకత్తాకుఁ గొని పొ"మ్మని తీక్ష్ణముగఁ బలికెను. అంత మహాశయులు "నాయనా! గంగా మతల్లిపై నిజమగు భక్తి యున్నయెడల ఆమెయే యాతని గృహమున కేతెంచి పావనము చేయును. అతఁ డామెకొఱకై వేఱొక చోటికిఁ బోనేల?" యనెను. ఇంతలోఁ బవిత్రదిన మేతెంచెను. శ్రీమతి హరకామిని, కైలాస బోసు ఇంకను మఱికొందఱు నాగమహాశయుని భక్తు లాదినమున దియో బాగునకు వచ్చిరి. సరిగ నా పవిత్ర సమయమున మహాశయుని ఇంటి పెరటియందు ఆగ్నేయదిక్కున భూమి పగిలి మర్మర ధ్వనులతో నీ రుబు కుచుఁ బెరటిని నించివేయుచుండుటను జూచి హరకామిని నిశ్చేష్ట యయ్యెను. మహాశయుఁ డప్పుడు గదిలో నుండెను. ఈ ధ్వని విని యీవలికి వచ్చి యా ప్రవాహమునకు సాష్టాంగపడి "యమ్మా! గంగా భవానీ! జగద్వ్యాపినీ జయము! పాపహారిణీ జయము" అని యతి గౌరవమునఁ గొంత యుదకమును శిరముపైఁ జల్లుకొని మరల సాష్టాంగ పడెను. తరువాత నింట నున్నవా రందఱును ఆ నీటియందు స్నానముల నాచరించిరి. ఈ వార్త వ్యాపింపగనే జనులు తండోపతండములుగ వచ్చి యచ్చట స్నానమాచరించిరి. ఇఁక మహాశయుని గృహావరణ మంతయు "గంగాభవానికి జయ" మను వాక్యములతోఁ బ్రతిధ్వనించెను. అంత నొక ఘంటకుఁ బ్రవాహ మాగి నీరు తగ్గుట కారంభించెను. ఈ యుదంత మంతయు సత్యమని సాక్ష్య మొసఁగుటకు మహాశయుని కాలమునాఁటివా రిప్పటికి నున్నారు. ఆ పవిత్రతోయముల ముట్టుటవలన ఎన్ని సంవత్సర ములనుండియో బాధపడుచున్న హరకామిని రోగవిముక్తురా లయ్యెను.

ఈ విషయ మెన్నఁడును మహాశయు లెవరితోడను జెప్పలేదు. దానిఁగూర్చి ప్రశ్నించినప్పుడుఁ గూడ "నరమ్యో! కొలఁది యున్న గొప్ప చేయుట మానవ స్వభావము గదా" యనును. ఈ సంగతిని వివేకానందులతోఁ జెప్పఁగా నాతఁడు "అట్టి మహాత్ముల సంకల్పశక్తి కసాధ్యమేదియు లేదు. వారి శక్తిచే ఎట్టివారును సంసారబంధములు తొలఁగి ముక్తులు కాఁగల రన నిఁక వారి కసాధ్య మేమియుండును?" అనెను.

మహాశయునికిఁ దన జీవితమందలి ప్రతి కార్యమందును, రామ కృష్ణుని పవిత్రసాన్నిధ్యము తెలియుచునే యుండెను. ఒకతఱి మహా శయుఁడు నిద్రించుచుండ నొక మార్జాల మాతని ముఖముపైఁ బడి ఎడమ కంటిని గోకెను. అది కొంచెము గాయమై బాధపెట్ట సాగెను. కాని దానికై లెక్క సేయక "పూర్వజన్మకృత దుష్కర్మల కిట్లు రామకృష్ణదేవుఁడు శిక్ష విధించుచున్నాఁడు. ఇదికూడఁ దప్పక నాతని కృపయే" యని యూర కుండెను. గాయముకూడ నెక్కువ చికిత్స చేయకయే నిమ్మళించెను. ఆతనికిఁ బ్రతివస్తువునుగూడ రామకృష్ణ స్వరూపమే. జగమంతయు నాతనికి రామకృష్ణ తేజోమయముగఁ దోఁచెను.

కలకత్తాలో నుండగా నొకప్పుడు రెండు చేతులలోను ఒకవిధమగు బాధ యుదయించి మిక్కిలి కష్టపెట్టెను. ఆ బాధమూలమున నాతఁడు చేతులను గదల్పలేక యెల్లప్పుడును ముడుచుకొనియుండవలసి వచ్చెను. తా నెల్లప్పుడును ముకుళితహస్తుఁడై యుండునట్లు గుణపాఠమును నేర్పు టకై శ్రీ గురుదేవుఁ డట్లు విధించెనని యాతఁడు చెప్పువాఁడు.

శూలనొప్పితో నాతఁడు బాధపడుచున్నప్పుడు, "జయము రామ కృష్ణా! ఈ యస్థిపంజరమును సంపూర్ణముగ నీ పాలు చేయకుండుట కిది తగిన శిక్షయే. ఇది యెల్ల నీ కృపాకటాక్షము. తండ్రీ! ఈ విధముగ నైనను సదా నిన్నే స్మరింపఁజేసి నీ దయకుఁ బాత్రునిగఁ జేయు చున్నావు. శ్రీ రామకృష్ణుని స్మరింపఁజేయుటచే నీ బాధ గూడ ధన్యతమ మైనది. ఓ దేవా! నీకు జయము. నీ కృపకు జయమగుఁగాక! ఇది నీ కృపాతేజఃప్రసారమే! తప్పక నీ తేజఃప్రసారమే! నీ దయకుఁ బాత్రుఁ

డగుట తప్ప మనుజునకు వేఱొండు ముక్తిమార్గము లే"దని స్తుతించు వాఁడు.

మహాశయులు గురుపీఠము నెన్నఁడును ఎక్కలేదు. ఎవరైనను నేదేని బోధింపుమని కోరిన "ఒకరికి బోధించుట కెవ్వరికిని అధికారము లేదు. కర్మపరిపక్వము కాఁగానే శ్రీ రామకృష్ణుని దయ ప్రసరింప జ్ఞాన చక్షువు తనంత నదియే యున్మీలనమగును. ఆ కంటితో నెచ్చటఁ జూచినను సర్వము శ్రీ రామకృష్ణమయముగఁ దోఁచును. అప్పుడు ప్రతి వస్తువును వింతరూపముతోఁ గన్పట్టు" ననును.

కాని భక్తు లెన్నఁడేని అధైర్యపడి యున్నయెడల "మీరు శ్రీ రామకృష్ణునియెడ విశ్వాస ముంచినప్పుడే మీ కిది తుది జన్మ యని నమ్ముఁడు. ఎవ్వఁడు హృదయపూర్వకముగ నా దేవాదిదేవుని నమ్మునో అతఁడు ధర్మపథమునుండి తొలంగక చతుర్విధ పురుషార్థములను బొందును" అనుచు వారలకు ధైర్యము చెప్పువాఁడు.

వంగదేశమునందు ప్రసిద్ధ నాటకాచార్యుఁడగు గిరీశచంద్ర ఘోషు నాగమహాశయుని గూర్చి అర్థగాంభీర్యముగ నిట్లనువాఁడు: "మహామాయ నరేంద్ర (వివేకానంద) నాగమహాశయులఁ దన వలయందుఁ బడవేసికొనుటకుఁ బ్రయత్నించి గొప్ప కష్టమునకు లోనయ్యెను. నరేంద్రుని వశపఱచు కొనుటకుఁ బ్రయత్నింపఁగా నాతఁడు పెద్దయై పెద్దయై యామె వలత్రాళ్లు చాలనంత పెద్దయగుటచే విఫలమనోరథయై తన యుద్యమమును విరమించెను. ఇఁక మహాశయుని బంధించుటలో నాతఁ డంతకంతకు సూక్ష్మమై యామె త్రాళ్లనుండి తప్పించుకొని పోవుచు నామెను భంగపఱచెను."

---

# భక్తవర్గము

నాగమహాశయుఁడు గురువుగ వర్తించుట కెన్నఁడును ఒప్పుకొని యుండలేదు. అతఁ డెవరికిని ఉపదేశము చేయలేదు. తాను శాస్త్ర విధిప్రకారమే నడచుకొనుచు నితరు లా విధిని మీఱిన దుఃఖించువాఁడు. "శూద్రుఁడుపదేశము చేయుట కర్తుఁడు కాఁ"డను శాస్త్రప్రమాణమును దిరస్కరింప నొల్లఁడు. కాని యాతని కటాక్ష మహిమచే అనేకుల హృదయములయందు జ్ఞానాగ్ని రగిలెను. అతని పవిత్ర సంస్పర్శము అధఃపతితుల నెందఱనో కాచి రక్షించెను. అట్లుండినను దన్నెవరైన గురువుగ నిర్దేశించిన మనసునఁ జాల బాధపడువాఁడు. "నేను అధమజాతి శూద్రుఁడను. నేనేమి యెఱుఁగుదును ? మీరంద ఱిచ్చటికి వచ్చి మీ పాదధూళిచే నన్ను ధన్యునిఁ జేయుచున్నారు. శ్రీ రామకృష్ణ గురువర్యుని దయచే మిమ్మందఱిని జూడఁగల భాగ్య మిచ్చినందుల కెంతయు ధన్యచరిత్రుఁడనైతి" ననును.

బ్రాహ్మణ భక్తుఁ డొకఁ డాతని నుపదేశింపు మని మిక్కిలి బలవంతపెట్టెను. అందుల కాతఁ "డయ్యా! నీవు బ్రాహ్మణుఁడవు. అందును విద్యాధికుఁడవు. అట్టి నీవు శాస్త్రవిధుల నుల్లంఘించుట తప్పు. శాస్త్ర విధులను దిరస్కరించినందుననే మన మిట్టి దుర్గతిపాలైతిమని తెలియుము. నేను గృహస్థుఁడను. గృహస్థాశ్రమధర్మమును బాలించుటయే నా ధర్మము. అదియే నా గురువాక్యము. ఆ యాజ్ఞను ఏమాత్రమును జవదాఁటుటకు నా కధికారము లేదు" అనెను. కాని యా భక్తుఁడు హతాశుఁడై చాల దీనవదనుఁ డగుటనుఁ జూచి "నాయనా! అధైర్యపడకుము. పరమశివుఁడే నీ కుపదేశింపఁగలవాఁడు" అని ఆశీర్వదించెను. తరువాతఁ గొంతకాలమున కాతఁడు వివేకానందునివలన నుపదేశమందెనని విని సంతసించి యిట్లనెను: "ప్రస్తుత కాలమున శ్రీ గురుదేవుని సన్న్యాసశిష్యులే యుపదేశము చేయుట కర్తులు. వారే సరియైన గురువులు. వారి యొద్ద నుపదేశమందినవారలు ధన్యులు. వారలు తప్పక భగవంతుని యనుగ్రహమునకుఁ బాత్రు లగుదురు."

నాగమహాశయునియొద్ద నుపదేశమంది యాతనికి శిష్యులై మెలఁగు చుండినవార లెవ్వరును లేకపోయినను అతని భక్తవర్గము లెక్కకు మిక్కుటమై యుండెను. అతఁడు వారలఁ బ్రేమించి వారలెన్నఁడును ధర్మపథము నతివర్తింపకుండునట్లు జాగ్రతతోఁ జూచుచుండువాఁడు. భక్తుఁడు దూరమున నున్నను, దగ్గఱ నున్నను, దన సమక్షమున నున్నను, లేకపోయినను, ఎల్లప్పుడాతని ముక్తిపథగమనాభివృద్ధికై ప్రార్థనల నల్పు వాఁడు. ఒకసారి యాతని భక్తుఁడొకఁ డాతనిఁ జూడవలెనని మిక్కిలి యభిలాషఁ జెంది దియోబాగునకు రా నుద్యమించెను. అతఁడు ఢక్కా కళాశాలలోఁ జదువుకొనుచుండెను. అతఁడు ఢక్కానుండి నారాయణ గంజికి వచ్చునరికి సాయంతనమయ్యెను. అది వర్షాకాల మగుటచే రోడ్లు పొలములు మొదలగునవన్నియు నీటితో నిండియుండెను. నారా యణగంజినుండి దియోబాగునకుఁ బోవు మార్గము శ్రీ శ్రీ లక్ష్మీనారా యణ్‌జీ దేవాలయము ప్రక్కనుండి పోవును. ఆనాఁడు ఆకాశము మేఘావృతమగుటఁ జీఁకటి మిక్కిలి దట్టమయ్యెను. వాన బోరున ధారా పాతముగ వర్షించుచుండెను. కష్టములలో కష్టము లనునట్లా సమయ మున నచ్చట నొక నావకూడ దొరకదయ్యెను. ఇఁక వేఱుమార్గము గానక ఆ నీటిని ఈఁది యావలికిఁ జేరుటకు నిశ్చయించెను. నాగమహా శయుని మనసార ధ్యానించి యా గంభీర ప్రవాహమున నుఱికెను. రాత్రి తొమ్మిదిగంట లయ్యెను. అప్పటి కా భక్తుఁడు చలిచే దేహమం తయు మొద్దువాఱ మహాశయుని యింటి కుత్తరమునఁ దేలుచు వచ్చెను. అప్పటి కీతని యుద్యమము తెలిసినవానివలె మహాశయుఁ డతనికై గట్టున వేచియుండెను. ఈతనిఁ జూడఁగనే "అయ్యో! ఎంత సాహసమున కొడి గట్టితివి! ఇప్పు డీ పంటభూములన్నియుఁ బాములతో నిండియున్నవి. ఇట్టి నిశీథ మధ్యమున నాకాశము చిల్లులు వడునట్లు వర్షించుచుండ నిట్టి యసాధారణ కార్యమును జేయ నడుకట్టుట పాడియా? ఎట్టి పని యొనర్చితి"వని మందలించుచుండ, నాతని మందలింపుల కుత్తరు వొసంగక యాతనివెంట నాతని ఇంటిలోనికిఁ బోయెను. మహాశయుని భార్య కట్టుకొనుట కొక పొడివస్త్ర మిచ్చి యట్టి సాహసకృత్య మొనర్చి

సందుల కామె గూడ పుందలించెను. అంత నా భక్తుఁ డేడ్చుచు "మహా శయా! మిమ్ముఁ జూడకుండుట దుర్భర మయ్యెను" అనెను. ఎట్టకేలకు శరత్కుమారి వంటచేయుటకు లోనికేఁగెను. కాని వండుటకు ఎండు పుల్లలు లేకపోయెను. ఇది మహాశయునికిఁ దెలిసి భక్తుఁడెంత వలదని వేఁడుకొనినను మానక యింటి వాస మొకదానిని దెగఁగొట్టి భార్యకిచ్చి "ఏమి? నాకొఱకై ప్రాణములను గూడ లెక్కసేయక యిట్టి రాత్రి యందుఁ బాములతో నిండియున్న పొలములలోఁ బడి యాఁడివచ్చిన యాతనికై ఈ మాత్రము చేయవలదా? ఇట్టివాని కెంత కొలఁది సేవ యొనర్చినను ధన్యుఁడ నగుదు" ననెను. భక్తుఁడుగూడ తా నారాత్రి కష్టములనుండి యావలఁబడి రక్షింపఁ బడుటకు మహాశయుని కృపయే కారణ మనుకొనెను. ఈ విషయమును సోదరి నివేదిత తన "The Master as I saw Him" అను గ్రంథమున నతిశయముగ వర్ణించియున్నది.

ఇంకొక సమయమున నా యువకుఁడే యాత్మహత్య గావించుకొన సంసిద్ధుఁడైయుండ మహాశయుఁడు అతి విచిత్రముగ రక్షించెను. అప్పుడా యువకుఁడు కలకత్తాలోని మెట్రొపాలిటన్ కళాశాలలోఁ బట్ట పరీక్షకుఁ జదువుచుండెను. ఆ పరీక్షకుఁ జదువు కాలములో నొక నాఁ డాతఁడు వెన్నెలలో డాబాపైఁ బచారుచేయుచుండెను. చుట్టు ప్రక్కల నంతయు శాంతిప్రదముగ నున్నను అతని మనసు విచారగ్రస్తమై క్రుంగియుండెను. నాగమహాశయుని జాలకాలమునుండి చూడకుండు టయే ఇందులకుఁ గారణము. అది యాతని నెంతయో బాధింపఁ దొడఁ గెను. అతని యాత్మ యింకను జ్ఞానోద్దీపితము కాలేదు. గురువర్యుఁ డగు మహాశయుని దర్శనరహితమగు తనజన్మ దుర్భరమయ్యెను. శ్రీరామ కృష్ణుని ఇతర శిష్యుల సాన్నిధ్యమునఁ గొంత శాంతి నొందుదమన్న వా రెవ్వ రీతని నప్పటి కెఱుఁగరు. నాగమహాశయుఁడు ప్రతి సంవత్సరము వలెనే యా సంవత్సరముఁ గూడ దుర్గాపూజార్థమై నరకులఁ గొనుటకుఁ గలకత్తాకు వచ్చునని యెఱుఁగును. అయినను అతఁడు అంతవఱకు వేచి యుండలేకపోయెను. "మహాశయునివంటి మహాత్ముఁడు కటాక్షిం

చియు ఆనందమయ బ్రహ్మస్వరూపమును గాంచఁజాలని నా బ్రతు కేఁటెందుల ''కని తలపోసి యాతఁడు డాబానుండి క్రిందికి దుమికి చనిపోవు టకు నిశ్చయించుకొనెను. కాని యాతని వాక్యములు క్రియారూపముగఁ బరిణమించునంతలో నా నిశీథ మధ్యమున నొక వాణి యిట్లు వినఁబడెను: "రేపుదయమున నీవు మహాశయునిఁ జూడఁగలవు". అప్పుడచ్చట నెవ్వరును లేకున్నను, ఈ మాట లెట్లు విననయ్యెనా యని యాతఁడు చకితుఁడయ్యెను. వెంటనే లోనికిఁ బోయి పరుండెను.

మఱునాఁడు ఆ యువకుఁడు నిద్రనుండి లేచునప్పటి కెవరో తలుపు తట్టుచుఁ బిలుచుచుండిరి. అంత నాతురతతో నేగి తలుపు దీయు నరికి మహాశయుఁడు చేత నొక సంచితోఁ బ్రత్యక్షమయ్యెను. ఈతనిఁ జూడఁగనే మహాశయుఁడు "ఎట్టి సాహసమున కొడిగట్టితివి. శ్రీ రామ కృష్ణ సామ్రాజ్యమునఁ బ్రవేశించిన తరువాతఁ గూడ నెందుల కిట్లు నిరాశఁ జెందెదవు. తొందరపడకుము. ఆత్మహత్య మహాపాపము" అని మంద లించెను. మఱియు "ఇంతవఱకును నీవు లోఁతునకుఁ బోక, ఒడ్డు నకు దగ్గఱనే యుంటివి. ఇప్పుడిప్పుడు లోఁతునకుఁ బోవుచున్నా" వనెను. తరువాత నాతని బేలూరు మఠమునం దున్న శ్రీరామకృష్ణ శిష్యుల దరికిఁ గొనిపోయి "అయ్యా! యీ యువకుఁడు మిక్కిలి యశాంతిగ నున్నాఁడు. దయయుంచి ఈతఁడు శ్రీ గురుదేవుని కృపకుఁ బాత్రుఁడగున ట్లాశీర్వదింపుఁ" డనెను.

మహాశయుఁ డొకమాఱు తన దర్శనమునకై తఱచుగ వచ్చుచుం డిన శిష్యులతో నిట్లనెను:—"నాయనలారా! మీరు నాకుఁ బ్రాణాధికులు. నావలన మీకెట్టి యుపకారము గలుగవలసి యున్నను నా ప్రాణముల నైన నర్పింప సంసిద్ధుఁడనై యున్నాను. అంతకుఁ దక్క నీ యస్థి పంజరమునకు వేఱు ప్రయోజనమేమి యుండును."

మహాశయుని భక్తవర్గములో మొట్టమొదట నెన్నఁ దగినది యాయన సహధర్మిణి యైన శరత్కుమారి. మహాశయుని యింట ఆతిథ్యము గొన్న ప్రతివారు, ఒక దేవకన్యవలె నామె యింటి పనులన్నియుఁ

జూచుకొనుచు, భర్తను, అతిథుల నెట్లు సేవించుచుండెనో, ఎఱిఁగి యుండిరి. ఆమె ఉదయమున నందఱికంటె ముందుగ లేచి ప్రాతఃకాల కృత్యములఁదీర్చి భగవద్ధ్యానమునకుఁగూరుచుండును. తన భర్తయు నతిథు లును భుజించువఱకు భోజనము సేయదు. ఆమె యింటిపనులన్నియు స్వయముగనే చేసికొనును గాని తుదకుఁ దన సోదరియగు హరకామినిని గూడఁ దోడుపడ నియ్యకొనదు. ఆమెకుఁ దనభర్త దక్క నితర దైవ మేదియు లేదు. నాగమహాశయునియందే సదా ధ్యానముంచి మనసారఁ బూజించును. ఒకసారి ♦ మహాష్టమి దినమున భర్తకు పాదపూజ సేయఁ దలపెట్టెను. కాని యందుల కాతఁ డియ్యకొనఁడయ్యెను. "పూజకు అర్హురాలగు నామెనుండి పూజనెవ్వఁడు గ్రహింపనొప్పును?" అనెను. అయిన నంతటితో నామె యధైర్యపడక సమయము కొఱకు వేచి యుండి తుదకొకపరి మహాశయు లౌకములనన్యమనస్కుఁడై యుండ నా తరుణము గ్రహించి తన కోర్కె నెఱవేర్చుకొనెను. తరు వాత నామె యా పూల నొక బంగరుపూనయం దిమిడ్చి తన మెడలోఁ గట్టుకొనెను.

ఆమె సాన్నిధ్యము మహాశయుని శిష్యవర్గమున కత్యంత ప్రోత్సాహ జనకము. ఆ నారీశిరోమణి పవిత్రతయొక్క యాదర్శస్వరూపము. ఆయమ హృదయకోమలత్వము, శాంతి, ఓర్పు, మానవసేవయందలి స్వార్థ త్యాగము అన్నిటికన్న నామె పవిత్రతయుఁ దపశ్చరణమును జూపరుల నాశ్చర్యముగ్ధులఁ జేసి యామెయెడ భక్తిగౌరవములఁ గలుగఁ జేయును.

నాగమహాశయుఁడు జీవించియున్నంత కాలమును భక్తులందఱును ప్రతి శనివారము దియోబాగునకుఁ బోవువారు. శరత్కుమారి యందఱ కును ఫలాహారాదికములను సిద్ధముచేసెడిది. మహాశయుఁడు తనయింట నెన్నఁడును వర్ణాశ్రమధర్మముల నతిక్రమించి యుండలేదు. బ్రాహ్మ ణులు భుజించునప్పు డాతఁడు బద్ధాంజలియై గృహప్రాంగణమున

♦ అక్టోబరునెలలోని నవరాత్రులలోని యెనిమిదవ దినము.

నొక పార్శ్వమున నిలువఁబడియుండును. శరత్కుమారి దగ్గఱ నుండి మిక్కిలి భక్తిశ్రద్ధలతో భోజన మిడును. మహాశయుని గృహమున కరు దెంచిన వారెవ్వరు నొక సాధువర్యుని యాశ్రమమునకు వచ్చినట్లు తలం పక తమ జననీజనకులకడకు వచ్చినట్లే తలఁచువారు. నాగమహా శయుఁడు పరలోకగతుఁడైన తరువాతఁ బూజ్యపాదులగు శ్రీ వివేకానంద స్వామి ప్రతివత్సరమును వచ్చునట్లే దియోబాగునకు వచ్చెను. ఇట్లు స్వామి ప్రతిసంవత్సరమును తప్పక వచ్చుచుండునని తెలియుటచే నాగమహా శయుఁడు తాను జనిపోవుటకు ముందాతని స్నానాదికములకుఁ దగు నేర్పా టులను గావించియుండెను. స్వామి పూర్వమువలెనే మహాశయుని గృహ మునకుఁ బోయి, శౌచస్నానాహారాదికముల దేశాచారమునకుఁ దగు రీతి నిర్వర్తించుకొని తన ప్రతిజ్ఞను కాపాడుకొనెను. స్వామి యట నొక దినముండి ఢక్కాకుఁ బోయెను. పోవునప్పుడు శరత్కుమారి యొక వస్త్ర మొసంగెను. స్వామి యద్దాని నుష్ణీషముగా ధరించి మహాశయుని గుణగాన మొనర్చుచు దియోబాగునుండి వెడలిపోయెను. ఢక్కాకుఁ బ్రచారక కార్యముపైఁ బోవుటకుఁ బూర్వము మహాశయుని భక్తుఁడగు నొకనితో "అచ్చటి కేఁగి యుపన్యాస మిచ్చుటకు నా కిష్టము లేదు. మహ శయుని పాదస్పర్శచేఁ బవిత్రమైన యచ్చోటున నేనేమి చెప్పుదు" ననెను. అంత నాభక్తుఁడు "అయ్యా! ఆయన ఎప్పుడును మౌనముగనే యుండు వాఁడు" అనెను. అందులకు స్వామి యిట్లనెను : "అతఁడు మాటాడవలసిన యవసరమే లేదు. అట్టి మహాపురుషుల చింతాతరంగములు దేశము యొక్క చింతాస్రోతముయొక్క గతిని మార్చివేయఁగలవు."

మహాశయుని చిన్ని మఱఁదలగు హరకామినియు నాతనినే యిష్ట దైవముగఁ బూజించుచు మనసార నాతని పదపద్మములనే ధ్యానించు చుండెను. ఆమె హృదయస్థమగు భక్తియు నిరాడంబర జీవనమును మిక్కిలి కొనియాడఁ దగినవి. మహాశయుఁడుగూడ నామెయందుఁ బుత్రికా వాత్సల్యముంచి నామె ఇంట జరుగు పూజామహోత్సవ సందర్భముల యందెల్ల నామె ఇంటికిఁ బోవువాఁడు. మహాశయుఁడు రాని పూజ యసంపూర్ణమని యామె విశ్వాసము.

ప్రాపంచిక విషయముల నామెకు నేవిధమయిన సంబంధమును లేదు. రోగముననుు, శోకముననుు, సుఖముననుు, దుఃఖముననుు, మఱెట్టి పరిస్థితులయందును అప్రచలితయై యుండెడిది. మహాశయుని భక్తులనందఱ నొక్క కుటుంబములోనివారిగ నెంచి మిక్కిలి యాదరించునది.

మహాశయుని యత్తగారు ఒక గొప్ప భక్తురాలు. ఒకసారి యామె కలకత్తాకు వచ్చి కుమార్తెతోడను, అల్లునితోను కుమార్తులీలో బసచేసెను. అచ్చటఁ బ్రతిదినమును గంగాస్నాన మాచరించి యచ్చటి మట్టితో శివ లింగమును జేసి పూజించునది. ఒక దినమున నామె యట్లు పూజించు చుండ నా లింగము ఊర్ధ్వభాగమున బీఁటవారెను. అది యామె చూచి మిక్కిలి విచారించి యా దినమంతయు నా నదీతీరమున నేడ్చుచుండెను. చీఁకటి పడినను ఇంటి కామె రాకపోవుటచే మహాశయుఁ డామెకై వెద కుచు గంగాతీరమున నేడ్చుచున్న యామెను జూచెను. ఆమె యాత నితో జరిగినదంతయుఁ జెప్పఁగా నాతఁడామెను "నీకెట్టి చెడుగును సంభవింప"దని యోదార్చెను. తరువాత నామె యాతనితో నింటికేగి విచారభారమగు మనముతో నిద్రింప నా నిద్దురలో శివుఁడు ప్రత్యక్షమై "బిడ్డా! నీ భక్తికి సంతసించితిని. ఇఁకమీద నీవు నా విగ్రహమునకుఁ బూజచేయుట యనవసరము" అనెను. ఆమె ఆ విషయమును మఱు నాఁడల్లునితోఁ జెప్పెను. ఆదినము మొదలామె విగ్రహారాధనమును మాని వైచెను. కారణ మేమని యడుగ "శివుఁడే నా యల్లుఁడై యుండ నిఁక నాతని ప్రతిమ నర్చింపనేల" యని ప్రత్యుత్తర మిచ్చెడిది.

హరప్రసన్న మజుందారుని భార్యగూడ మహాశయుని భక్తులలో నొక పేరుపొందిన యామె. వివేకానందుఁ డామెనుగూర్చి యొక శిష్యునితో "మీ యూరియందు మంచి పాండిత్యమును భక్తియుఁ బొందియున్న స్త్రీ యామె యొక ర్తయే" అనెను. మహాశయుఁ డామె "నమ్మా!" యని పిలుచుచు నామె చేతినుండి భుజించుట కెంతయో ఉత్సహించువాఁడు.

ఏ దేశమున నెచ్చోట నెట్టి క్షోభము సంభవించినను అచ్చట మహా శయుఁడు ప్రత్యక్షమైనమాత్రమున అంతయు నివారణమగునని యాతని

శిష్యులలో నొక గొప్ప విశ్వాసము గలదు. దాని కనుగుణముగఁ దమ దేశములయం దట్టి క్షోభము సంభవించినచో వారాతనిఁ గొంపోవువారు. ఇట్టి సందర్భముననే యాతఁ డొకనాఁడు భోజేశ్వరమునకు వెళ్ళియుండెను. హరప్రసన్నుని యూరు దానికిఁ జేరువ యగుటచే నాతని నచ్చటి కాతఁడు పిలుచుకొనిపోయెను. అతని భార్య మహాశయుని అంతకుముందుఁ జూచి యుండలేదు. తన భర్త యొక సాధువునెడ భక్తిగలిగి యుండెనని మాత్ర మెఱుఁగును. ఆమె స్వభావసిద్ధముగా భక్తురాలు. దానికిఁదో డట్టి భగవ ద్భక్త సందర్శనము లభించెను. అప్పటినుండి యాతని నామె పుత్రుని వలెఁ బ్రేమించుచు నప్పుడప్పు డాతని దర్శనమునకై డియోబాగునకుఁ బోవుచుండెను. ఒక దినమున వీరిద్దఱు నడచుచు వచ్చుచుండ నొక వైష్ణవి యగు భిక్షుకి యెదురువచ్చెను. ఆమె యూరి కంతకును బరిచితు రాలు. అమె మహాశయుఁ డొక స్త్రీ వ్యక్తితోఁ (హరప్రసన్నుని భార్యతోఁ) గలిసి పోవుచుండుటఁ గాంచి "దుర్గాచరణా! యీపె యెవతె?" యని యడిగెను. అందుల కాతఁ "డీమె నాతల్లి" యనెను. ఆ వైష్ణవి యీమె యాతని తల్లి కాదని, యాతని జనని బాల్యమందే గతించినదనియు నెఱుఁగును. దానిచే "నీమె నీకెట్టి తల్లి" యని మఱలఁ బ్రశ్నించెను. తోడనే యాతఁ "డీమె నా జనని. నిక్కముగ నా జనని" యని మఱలఁ బ్రత్యుత్తరమిడెను. అంత నా ముదునలి "ఇప్పుడు నిన్ను సరిగఁ దెలిసికొంటిని! నీపేరు దిగంతము వ్యాపింపఁ దగినది. నాయనా! చిరంజీవివై మన మాతృభూమికి కీర్తిని సంపాదింతువు గాక" యని దీవించెను.

హరప్రసన్నుని భార్య చక్కఁగఁ బాడఁగలదు. మధురమగు తన కంఠమున జగన్మాతృస్తవముఁ బాడుచుండునప్పుడు "జనని తన్నుఁ గూర్చి తానే పాడుకొనుచున్న"దని మహాశయుఁ డనువాఁడు.

మహాశయుని జననియగు త్రిపురసుందరికి మాధవీ ఠాకురాణియను పెదతల్లి గలదు. ఆమె మనుమని మిక్కిలి ప్రేమించెడిది. మహాశయుఁ డామెను "అవ్వా" యని పిలుచును. అమె ఢక్కాకు సమీపమున

నొక యూరియం దుండెడిది. ఇప్పటికిని ఆ దేశమునం దామె గుణ సంకీర్తనము జరుగుచుండును. మహాశయుఁ డామెను జూచుట కప్పు డప్పుడు పోవువాఁడు.

దియోబాగున కనతిదూరమున కాశీపురమను నూరు కలదు. అం దొక మహమ్మదీయుఁడు మహాశయునియెడ భక్తిగలిగి యుండెను. అతని భావములు ఇతరులకువలె సంకుచితములు గాక విశాలవంతములుగ నుండెను. అతఁడు మహాశయు నొక పీరు (భగవంతునిఁ గనుగొనిన వాని)గ భావించి యాతని హితోపదేశములను భగవంతుని యాజ్ఞలనుగ శిరసావహించును. ఈ మహమ్మదీయుఁడు మహాశయునికి సేవ చేయ వలెనని చాల ఆశపడెను. నాగమహాశయుఁ డాతని నొక గొప్ప సాధువుగ ఎఱిఁగియుండుటచే నాతని సేవ నొల్లక, ఆతని నతి భక్తి భావముతో నెదుర్కొనుచుండెను. అతఁడు తఱచు మహాశయుని యొద్దకుఁ బోవుచు నాతని పవిత్రగోష్ఠియం దుండును. ముదుసలియై డెబ్బది సంవత్సరములవఱకు జీవించెను. తన సహధర్మిణి బాల్యమందే కాలగతి నొందినను మరల వివాహము చేసికొనక భక్తిపరుఁడై జీవితమును అతి పవిత్రవంతముగఁ గడపెను. సంసారబాధ్యత నంతయుఁ గుమారునిపైఁ బడవైచి నిశ్చింతగ భగవద్ధ్యానమును సలుపుచుండెను.

మహాశయుఁడు తఱచు ఇట్లు చెప్పువాఁడు :—"పరమేశ్వరుని యీ విశాల రాజ్యమందు జాతిమత భేదములు లేవు. అతని దృష్టి కందఱును సమానులు. ఏనామమున నేరూపమునఁ బూజించినను దా నాతని స్వాధీనమందుంటినని మనమున నాతని చరణ కమలములనే సర్వదా ధ్యానించుచు నాతనినే శరణుజొచ్చియుండువాఁ డా దయామయుని కృపకుఁ బాత్రుఁడగును. వివిధములగు నీ మతము లాతని రాజ్యమును జేరుట కేర్పఱుపఁబడిన వివిధ మార్గములు."

నాగమహాశయుని దయకుఁ బాత్రులై జీవితము మాఱి సన్మార్గావలంబులైన వారిలో దియోబాగునందలి కాళీకుమార్ భునియా యనునాతఁడొకఁడు. ప్రథమమున నాతఁడు మిక్కిలి బీదవాఁడు. కాని తరువాత నాతఁడు దియో

బాగునంపలి యొక సంపన్నునికి దత్తుపోయెను. కాళీకుమారుఁడు యౌవన మున దుష్టుఁడుగను జారుఁడుగ నుండి పెంపుడు తండ్రివలన సంక్రమిం చిన ధనమంతయు వ్యయపఱచెను. నాగమహాశయుని సత్సంగతి యబ్బి నను ప్రథమమునఁ దా నలవాటుపడిన దుర్గుణములనుండి మఱల్చుకొన లేక పోయెను. అందువలన మహాశయుఁడు మొట్టమొదట నాతనిఁ జూచువాఁడు కాఁడు. పూర్వపు దుష్కార్యములఁ దలఁచుకొని కాళీకుమారుఁ డాలోచనా పరుఁడై యాతనియొద్దఁ గూర్చుండువాఁడు. ఒకసారి యాతఁడు తన తల నొక స్తంభమునకుఁ గొట్టుకొనుచుండ మహాశయుఁడు చూచెను. జాలిగొన్న వాఁడయ్యు నదిపైకిఁ దెలియనీక "ప్రతివ్యక్తియుఁ దన కర్మఫలము ననుభ వించి తీఱవలయు" ననెను. ఆ యువకుఁ డీతని సాంగత్య మబ్బిన కొలఁ దియు దుర్గుణముల నుండి విముక్తుఁడై జీవిత మత్యంత పవిత్రతమముగఁ గడపెను.

హరప్రసన్న మజుందారును గూర్చి యిదివఱలోఁ దెలిపియుంటిమి. అతఁడు మహాశయుని భక్త శ్రేష్ఠులలో నొక్కఁడు. ఒకసారి మహాశయుఁ డొక భజనసమాజమున భగవత్కీర్తనలఁ బాడుచుండ పరవశుఁడై స్మృతితప్పి పడియుండుటయు నాతని ముఖమందు బ్రహ్మతేజము మూర్తీ భవించి యుండుటయుఁ జూచి యాతఁ డచ్చెరువడి "ఈతని మనస్సు భగవంతునియందు లీనమై యుండనోపును. ఇదియే సమాధి" యను కొనుచు అతని పరిచయము గలిగించుకొనుట కాతురతపడెను. నాగ మహాశయునిగూర్చి తెలిసిన కొలఁదియు నా కోరిక ప్రబలమై యెల్లప్పు డాతని సన్నిధియందే యుండవలె ననియు నాతని దర్శనము చేయవలయు ననియు నువ్విళ్లూరుచుండెను. మహాశయుఁ డాతని మిక్కిలి ప్రేమించు చుండెను. మార్గదర్శకములగు మహాశయుని గుణములన్నియు నీ హర ప్రసన్నునియందు మూర్తీభవించెను. అతని విశ్వాసము, నమ్రత, భక్తి, యన్నిటికన్న నెక్కుడగు నతిథిసంసేవనము మొదలగు గుణములఁ జూచిన మహాశయుని యపరావతార మననొప్పును.

యౌవనమునం దతి సుఖలాలసుఁడుగ నుండిన సతోబారు ముఖర్జీ యను నొక యువకుఁడు మహాశయుల సాంగత్యమువలనఁ దన జీవితమున

నొక గొప్ప ఘూర్పుగలిగి ప్రవర్తించెను. అతనియందలి యొక విశేష గుణ మేమనఁగాఁ దనకు సరియనియు ధర్మమనియుఁ దోఁచిన కార్య మెట్టి దైనను అందు ఎంత త్యాగమొనర్పవలసియున్నను ధైర్యవిహ్వలుఁడు గాక యాతఁ డొనర్చి తీర్చువాఁడు. అతనికిఁ గొంత కవిత్వముఁ జేయు శక్తి గూడ నుండెను. ఒకసారి యాతఁడు భగవంతుఁడు పాపులను రక్షించుట కొఱకై మనుష్యావతార మెత్తెనని యొక నాటకమును రచించెను. అది దియోబాగునందుఁ బ్రదర్శింపఁగ నాగమహాశయుఁడు చూచెను. ఆ నాటక మందు నమ్రతయొక్కయు దయయొక్కయు మూర్తియైన నాగమహా శయునివంటి పాత్ర యుండెను. నతోబారు గూడ దియోబాగు నివాసియే. మహాశయుని భార్యను శిష్యులను మిక్కలి గౌరవించుచుఁ బ్రాణాధిక ముగఁ జూచువాఁడు.

శ్రీ రామకృష్ణుని శిష్యులలో అన్నాదాతాకూ రనునాతఁడు పేర్వడసి యుండెను. చదువను వ్రాయను దెలియక యున్నను అతనికి ఈశ్వరుని యందు గొప్ప విశ్వాసము. తఱచుగ నాతఁడు మహాశయుని యొద్దకు వచ్చుచుండువాఁడు. మహాశయుఁడుగూడ నాతని నిరాడంబర వర్తనము నకు సంతసించి ప్రేమించువాఁడు. ఈతఁడు ఢక్కాలో నున్నప్పుడు ప్రభు త్వోద్యోగి యగు నొక స్నేహితుని గృహమునకుఁ బోవుచుండెను. వివేకా నందుఁడు అమెరికాయందు గడించిన కీర్తికి అతనిపై నసూయ నెంది యా యుద్యోగి, స్వామిపై నెన్నియో నేరములను గల్పించి చెప్పచుం డెను. అన్నాదాతాకూ రది సహింపలేక "స్వామిజీనిగుఱించి ఇంకొకమాట చెప్పితివా నీ ప్రాణములు నీకు దక్క"వనెను. ఆ దినము మొదల లా పురుషుని మరల నాతఁడు దర్శింపలేదు. అతని యంత్యదివసములు శ్రీ రామకృష్ణ, మహాశయ నామములు నాల్కపైఁ దాండవమాడుచుండఁ గడచెను.

హరకామినిని గూర్చి ఇంతకుముందే చెప్పియుంటిమి. ఈమె భర్త యగు కైలాసచంద్ర దాసుఁడు గూడ మహాశయుని చరణదాసుఁ డయ్యెను. నాగమహాశయుఁ డెల్లరను నారాయణాంశులుగ దర్శించుటచే

నేరివల్లను సేవ పొందుట కొల్లఁ డయ్యెను. అయినను ఈతని విషయమున మాత్ర మా నియమము లేకుండెను. అతఁ డీసాధువును గురువుగ భావించి అతని యాజ్ఞను ప్రేమతోను సమ్రతతోను శిరసావహించి సేవ సేయుటయే తన జీవితముయొక్క పరమావధిగ నెంచుకొనెను.

పార్వతీచరణుఁ డనునాతఁ డింకొక భక్తుఁడు. ఈతఁ డేకాంత మును మిక్కిలి కోరువాఁడు. మత విషయమో యెన్నఁడును జర్చింపఁడు. నాగమహాశయునియం దత్యంత విశ్వాసము గలిగి యాతనిపైఁ బ్రతి విష యమున నాధారపడి యుండెను. ఇతరులు వేదాంతసంశయములను గూర్చి చర్చించుచుండునప్పు డీతఁడు నిశ్చలముగఁ గూర్చొని తన యిష్ట దైవమును ధ్యానించును.

మహాశయుని పొరుగింటివాఁ డగు గోపాలచంద్ర చక్రవర్తి అతని సాన్నిధ్యమును మొదటఁ జవిచూచిన భక్తుఁడు. అతనినుండి మహాశయుని చరిత్రమును గీర్తియు వినినవా రాతని కెంతయుఁ గృతజ్ఞులు. బాల్యావస్థలో నొక స్త్రీ యాతనికి మధురభావ ♦ ముపదేశించెను.

దానివలన నాతనియం దొక నూతనతేజ ముద్భవింప నాతనియం దొక వశీకరణ శక్తికూడ నుండెను. భక్తబృందములో నీతఁడు సత్యగోపాలుఁడని పేర్కొనఁబడును. ఈతఁడు చక్కఁగఁ బాడఁగలఁడు మఱియు మృదంగవాద్యమున నసమానుఁడు. నాగమహాశయుఁ డీతని మొదటఁ జూచినప్పుడు "సత్యగోపాలుఁడు గొప్పభక్తుఁడు, పూర్ణమగు విశ్వాసము కలవాఁడు. కాని యీతనికి ఇంద్రియసుఖములయం దాశ ఇంకను వీడలేదు" అనెను. తరువాత నీతనికి మహాశయునితో సంబంధ మెక్కువ యగుకొలఁదియుఁ దన తప్పిదములన్నియుఁ దెలిసికొని మధుర భావమును వదలి సాధారణ భక్తిమార్గ మవలంబించెను. నాగమహాశ

---

♦ భగవంతునిపట్ల భక్తునకుండఁదగు భావములలో సత్యున్నత మైనది. బృందావనమందలి గోపిక లీ భావముననే కొలిచిరి. కాని సాధ కుఁడు ఈ భావమును ప్రప్రథమముననే యవలంబించిన యధఃపతితుఁ డగును. కనుక నిది కొంచె మపాయకరమైనది.

యునిఁ దన గురువుగ భావించుచు నాతని వేదములకన్న మిన్న యని కొల్చుచుండెను.

పైనఁ బేర్కొనఁబడినవారు గాక మహాశయుని భక్తు లింకను ఎందఱో కలరు. మన మెఱుఁగనివా రింకెందఱుండిరో తెలియదు. అట్లు ఒరుల కెఱుకపడుట వా రొల్లరు. ఒకసారి మహాశయుని దివ్యరూప సందర్శనముఁజేసిన నెట్టివారైన నాతని మఱువఁజాలరు. ఎందఱు యువకులో యాతని కటాక్షమువలన తమ జీవితములు మాఱ జీవితము యొక్క పరమావధిని దెలిసికొనిరి. వివేకానందస్వామి అట్టి మహాపురుషుల సాంగత్యమున నైదు నిమిషములలో నెట్టివారి జీవితములైనను బూర్తిగ మాఱి పవిత్రతమము లగునని చెప్పియున్నారు. "మతము గురువునుండి శిష్యునకు సంక్రమించు"నను నీ వాక్య మీతనియెడ సత్యమయ్యెను.



# అంత్య దినములు - మహాసమాధి

**B. S. 1306** వ సంవత్సరమున నాగమహాశయుఁడు దుర్గాపూజకు యథాపూర్వము కలకత్తాకు రాలేకపోయెను. ఆ సంవత్సరము నవంబరు మాసమునఁ గలకత్తాలో నున్న చక్రవర్తి యనునాతని భక్తునికి మహాశయుల భార్యయొద్దనుండి మహాశయుఁడు తీవ్రమగు జబ్బుచే బాధపడుచుండెనని తంతివార్త వచ్చెను. ఆ నాఁడాభక్తుఁడు శ్రీ రామకృష్ణ మిషన్ సభయందు "వేదమతము" అను వ్యాసమును జదువవలసియుండెను. అందువలన నాతని కేమి చేయుటకును దోఁచకుండెను. కాని యద్భుతానందస్వామి యాతనితో "నోయీ నీకు వేదములఁగూర్చి చెప్పుట కెన్నియో తరుణములు లభించును గాని యీ సమయము దప్పిన ప్రత్యక్షవేదమగు నాతనిఁ జూచుట తటస్థింప" దని చెప్ప నాతఁ డాధినముననే దియోబాగునకుఁ బయనమయ్యెను.

మఱునాఁడు చీఁకటిపడుటకుఁ బూర్వమే దియోబాగు చేరుకొనెను. చక్రవర్తి లోనికిఁ బ్రవేశించునప్పటికి మహాశయుఁడు తన గదిముందొక (పరదాలచేఁ గట్టఁబడిన) చావడిలోఁ బరుండి యుండెను. అది శీతలకాల మగుటచేఁ జుట్టుప్రక్కలనున్న పొలములనుండి చలిగాలి మిక్కుటముగ వీచుచుండెను. ఆ చలిగాలికి ఆరోగ్యవంతుఁడే కొయ్యబారి పోవుచుండ నిఁక రోగిమాట వేఱఁ జెప్పఁబనిలేదు. ఆ చావడికి వైచిన పరదాలుకూడఁ జినిఁగిపోయి యుండుటచేఁ జలిని ఏమాత్రమును ఆపలేకుండెను. ఈస్థితియం దాతనిఁ జూచి యట్లాతని నా చావడిలో నుంచుటకుఁ గారణమేమని శరత్కుమారి నడిగెను. అందుల కామె "నాయనా! ఏ దినమునుండి యశక్తత వలన మంచము పట్టెనో నాటినుండి మేమెంత ప్రార్థించినను వినక యిచ్చటనే పరుండి యున్నారు. కొలఁది దినములకుఁ బూర్వము శూలనొప్పి వచ్చినది. ఆపైన గ్రహణిబాధ సంభవించినది. రోగము ప్రబలమైనందున నాయన యనుజ్ఞపై నీకుఁ దంతివార్త నంపితి" నని ప్రత్యుత్తర మిచ్చెను.

మహాశయులు తన బాధను ఒరులకుఁ దెలుపఁడు. భార్యతో నొకసారి "నా ప్రారబ్ధము ఫలోన్ముఖమైనది. ఇఁక కొలఁదిమాత్ర మనుభవింప వలయు" ననెను. ఈ రోగ మంకురించుటకుఁ బూర్వ మాతని దేహము కృశింపఁ జొచ్చెను. పగటిపూట మాత్రము కొలఁదిగ భుజించి రాత్రులం దుపవసించువాఁడు. అంతకంతకు శల్యావశిష్టుఁ డయ్యెను. భార్య యధైర్యచిత్తయై యేడ్వఁగా "అస్థిమలమాంస భూయిష్ఠ మగు నీ దేహమునకై విచారింపకు" మనెను. ఎందఱు బ్రతిమాలినను మందు పుచ్చుకొనుటకు సమ్మతింపలేదు.

ఇప్పు డాతని రోగ మతిశయింప నా తెరలమధ్యఁ బరుండెను. ఎందఱో అతని లోనఁ బరుండుటకుఁ బ్రార్థించిరి. కాని విఫలమనోరథులైరి. జబ్బు సహింపరానిదిగ నుండినను రోగమునకు లొంగక యితరమును మఱచి శ్రీ రామకృష్ణ నామమునే జపించుచుండెను.

ఇట్లు పదుమూఁడు దినములు బాధ పడెను. చనిపోవువఱకును జక్రవర్తి ప్రక్కను గూర్చుండి భగవద్గీతలను ఉపనిషత్తులను జదువుచు

నొక్కొక్కప్పుడు జగన్మాతను స్తవముజేయుచు, నవనర మగునప్పుడు సేవఁ జేయుచు నుండెను. అతని కీర్తనల వినినప్పుడు మహాశయుఁడు స్మృతిరహితుఁడై గంటలకొలఁది సమాధి నిమగ్నుఁడై యుండువాఁడు. సమాధి తీఱిన యంతనే నిద్రనుండి మేల్కాను పసిబాలుని చందమున "నమ్మా యమ్మా" యని యేడ్చువాఁడు. ఆ సమయమున నాతనిఁ జూచి నచో నాతఁడు తప్పక సాత్త్వికమూర్తి యని యనుకొనుట నిశ్చయము. చైత న్యము వచ్చిన తరువాత నొకప్పుడు "సచ్చిదానంద, అఖండ చైతన్య" యని యుచ్చరించువాఁడు.

జబ్బులో నున్నంతకాలమును అతని భక్తులు ప్రతిదినమును వచ్చి చూచుచు నొక్కొక్కప్పుడు రాత్రులు గూడ నచ్చటనే గడపుచుండిరి. అంతటి యవస్థలో నున్నను మహాశయుఁ డాశ్చర్యజనకముగ అతిథి నారాయణస్వరూప మను సిద్ధాంతమును మఱువక సత్కరించువాఁడు. వారికిఁ ద్వరగ భోజనము పెట్టు విషయముననను నిద్రపోవుటకుఁ దగు నదు పాయములఁ జేయు సందర్భముననను భార్యను హెచ్చరించుచు అతి జాగ రూకుఁడై యుండెను. వారికి సరిగ సత్కారము జరుగుచున్నదో లేదో యని మిగుల నాతురతఁ జెందువాఁడు. ఆ పదుమూఁడు దినము లొక ఉత్సవమువలె నుండెను. నాగమహాశయుఁ డొక్క శ్రీ రామకృష్ణులఁ గూర్చి తక్క నితర విషయములఁగూర్చి మాటలాడక పోవుటచే నతిథు లా పవిత్ర భావతరంగములయందు మునిఁగి తమ కష్టములను మఱచి యొక్క భగవంతునే సదా ధ్యానించుచుండిరి. తన జీవితమును గూర్చిగాని రోగ మును గూర్చిగాని వారెవ్వరైన శ్రద్ధగొని యెట్లుండునో యేమోయని భయముఁ జెందుచో వారితో "నయ్యా! శల్యభూయిష్ఠమగు నీ కళేబరముఁ జూచుట కెందుల కింత వ్యయప్రయాసలకోర్చి వచ్చితిరి? ఇది యిఁక నెంతో కాల ముండదు. ఇది మాటిమాటికి మాఱుచుండు" ననును.

మహాశయుఁడు వ్యాధిలో నున్నప్పుడు చక్రవర్తి రాత్రిం బవళ్ళచ్చ టనే గడపెను. మహాశయు లొక్కొక్కమాఱు "ఈశ్వరుఁడెంత కరుణా మయుఁడు! ఇది యంతయు నాతని కరుణాప్రసార సంజనితమే"

యనువాఁడు. కాని యాతని బాధఁ జూచి చక్రవర్తి యొకసారి "భగవంతుఁడు దయామయుఁడు కాఁడు, క్రూరుఁ" డని యనుకొనెను. నాగమహాశయుఁ డాతని మనోభావము గ్రహించి "నాయనా! భగవానుని దయఁగూర్చి యీషణ్మాత్రమును సంశయింపకుము. ఈ కళేబరము ప్రపంచమున కేమి యుపకృతి చేయఁగలదు? ఇది యిప్పుడు మంచ మెక్కినది. ఈ యవస్థలో నా గృహమున కేతెంచు నారాయణమూర్తులను సేవింప లేకున్నాను. అందువలన శ్రీ రామకృష్ణుఁడు తన యనంతమగు కృపామహిమచే నీ దేహమును మఱలఁ బంచభూతములఁ గలయునట్లు చేయుచున్నాఁ" డనెను. తరువాత క్షీణకంఠముతో నెమ్మదిగ "దేహము తన జాగ్రతయం దుండుఁగాక, దుఃఖములును కష్టములును దమ జాగ్రత్తలోఁ దాముండుఁగాక. ఓ మనస్సా! నీవుమాత్రము దీనియందు గాక ఆనందమయ ఆత్మస్వరూపముననే మగ్నమై యుండుము" అని తన్నుఁదాను హెచ్చరించుకొనెను.

మఱలఁ జక్రవర్తి దిక్కు మొగమై "ఈ దేహమునకై విచారింపకుము. మాంసమజ్జాయుతమగు నీ దేహమును మఱచిపొమ్ము. జగన్మాతృ సంకీర్తనము చేయుము. శ్రీ రామకృష్ణ చరిత్రమునే చెప్పుకొనుము. ఇదియే ప్రాపంచిక వ్యాధులను నిర్మూలన మొనర్పఁగల్గిన యౌషధము. అంతఁ జక్రవర్తి భక్తిపూరితుఁడై మాతాసంకీర్తనమొనర్చుచు దేహమును మఱచెను. కొంతవడికి శరత్కుమారి పిలువఁగాఁ దెలివివచ్చి చూచునప్పటికి మహాశయులు మంచముపైఁ గూర్చొని యుండెను. చూపులు నాసికాగ్రమున బంధింపఁబడియుండెను. సంకీర్తనమును వినుచు నతఁడు సమాధిగత మనస్కుఁడయ్యె. ఆతఁ డట్లు కూర్చొని యుండఁగాఁ జక్రవర్తి చూచి యుండలేదు. ఇప్పరి సహాయము లేనిదే ఒకప్రక్కనుండి యింకొక ప్రక్కకుఁ బొరలుటకుఁ గూడ శక్తిలేని యాతఁడు ఇట్లు కూర్చొనియుండుట వారికి ఆశ్చర్యమును గొల్పెను. చక్రవర్తి శరత్కామిను లది యేమి యుపద్రవమును దెచ్చునో యని కంపింపసాగిరి. వారెట్టకేలకు అతనిని నెమ్మదిగఁ బరుండఁబెట్టిరి. ఇంతలో మహాశయునికిఁ దెలివి వచ్చి జగదీశ్వరీనామ ముచ్చరించుచుండెను.

ఆ దినమునకంటె నాదినము రోగము వృద్ధియగుచుండెను. కొంచె మైనను ఆహారము లోనికిఁ బోవుటలేదు. క్రమముగా ఎవరైనను అతని యొద్ద రాత్రులు మేల్కొని యుండవలసిన యవసరము వచ్చెను. శరత్కుమారియుఁ జక్రవర్తియు ఒకరితరువాత నొకరు మేల్కొని కనుపెట్టు కొని యుండసాగిరి. ఒకసారి చక్రవర్తి యధైర్యచిత్తుఁడై వినయముతో "అయ్యా! మీ కరుణామృత మొకింత నాపై వర్షింపుఁడు. మీరీప్రపంచ మును వీడినతరువాత నేనెట్లు జీవింపఁగలను? ఎవరిపై నాధారపడి యుండఁగల?" ననెను. అంత మహాశయులు "ఇందు భయపడవలసిన విషయమేమున్నది? శ్రీ రామకృష్ణపాదముల శరణుజొచ్చిన తరువాత నాయన దయ తప్పక నీపై ప్రసరించునని నమ్ము ము. ఎవరాతనిఁ గోరుదురో వా రాతనిఁ దెలిసికొని తీఱుదు" రనెను.

ఈ కాలముననే శారదానందస్వామియు రామకృష్ణోద్యమ వ్యవహారముల సందర్భమున ఢక్కాలో నుండెను: అతఁడు తఱచు మహాశయుని యొద్దకు వచ్చి యాతని పరిచర్యవిషయమై తగు సలహా నిచ్చుచుండెను. అతఁడు మిగులఁ జక్కఁగఁ బాడఁగలఁడు. అందువలన మహాశయు లాతని నొకనాఁడు శ్రీరామకృష్ణులు ప్రేమించు కీర్తనలనుఁ బాడుమని కోరెను. అంత నాతఁడు మూఁడు కీర్తనలనుఁ బాడెను. మహాశయుఁడు సమాధిగతుఁ డాయెను. తోడనే శారదానందులు చెప్పినట్లు భక్తులాతని చెవిలో జగదీశ్వరీ నామోచ్చారణ చేసినంతనే తెలివివచ్చెను.

మహాశయునికిఁ దాను దేహమును జాలించుటకుఁ బూర్వము కాళీ మాతను బూజింపవలెనను కోరిక యుదయించెను. అందుల కొకదినము నిశ్చయింపఁబడెను. కాళీవిగ్రహమును దీసికొనివచ్చిరి. శారదానందుఁడు "ఈ ప్రస్తుతావస్థలోఁ బ్రక్కనుండి లేచి యాతఁ డీ విగ్రహమును జూచుట కష్టము. అందువలన నా విగ్రహము నాతని పడకయొద్దకుఁ గొని తెండు. అతఁడు దర్శించినతరువాత పూజకై మఱల మండపమునఁ బెట్టవచ్చు" ననెను. ఆ ప్రకారమే విగ్రహము నెదుటఁబెట్టిరి. చక్రవర్తి "అయ్యా! అదిగో నీవు పూజింప నభిలషించిన విగ్రహ మెదురుగ నున్నది చూడుఁ" డనెను. అప్పటికి అతఁడు కండ్లు మూసికొని

యుండెను. ఈమాటల వినినతోడనే కండ్లుతెఱచి చూచునప్పటికి విగ్రహము కన్పట్టెను. తోడనే స్మృతిరహితుఁడై "అమ్మా! అమ్మా!" యని కేకలిడి సమాధి చెందెను. జగదీశ్వరీనామము చెవియం దుచ్చరించిరి. కాని యీసారి చైతన్యము రాలేదు. నాడి నిలిచిపోయెను. హృదయచలనము గూడ నాగిపోయెను. శరత్స్వామిని "అయ్యో! మాతాపూజన మను వంక బెట్టి మనలను విడిచిపోయె"నని యేడువఁ దొడఁగెను. శారదానందుఁ "డమ్మా! కంపించి యాతని ముందు కేకలిడకుము. మరల నాతనికి స్మృతివచ్చు" ననెను. ఈరీతిగ రెండుగంటలు గడచెను. తరువాత హఠాత్తుగ నాతఁ డమ్మాయని కేకలిడుచు మరలఁ బ్రకృతావస్థకు వచ్చి "పూజ యైనదా?" యని యడిగెను. అంతఁ జక్రవర్తి "విగ్రహమును మీ యెదుట నుంచితిమి. మీయాజ్ఞ యైనతోడనే దానిని మండపమున నుంచి పూజింప నెంచితి" మనెను. పిదప నాగమహాశయుని యాజ్ఞపై శాస్త్రవిధిగఁ దగు పూజల నొసర్చిరి.

మఱునాటి ప్రాతఃకాలమునఁ జక్రవర్తి "నిన్నటి మీ యవస్థ గాంచిన తోడనే మరల మీ రీప్రపంచమునకు రారనుకొంటి" మనెను. అందులకు మహాశయులు నీరసమగు స్వరముతో "ప్రారబ్ధము కొఱత యున్నంత వఱకు ఈ దేహము పో"దనియెను.

పూజానంతర మందఱును జనని ఈ తఱి ఈతని కటాక్షించి రక్షించునని యాశఁజెంది యుండిరి. కాని మహాశయుఁడు "జగదీశ్వరి నన్ను రక్షించుటకుఁ గాక నా యభ్యుదయమును గోరు మిమ్మందఱిని దుఃఖముల నుండి రక్షించుటకొఱకు దయచేసినది. జగన్మాత మీ యందఱిపై దయ వర్షించి యాశీర్వదించుగాత" మని యనుటచే కాళీపూజ యందలి యాతని భావమును వారు గ్రహించిరి. మఱునాఁడు శ్రీ రామకృష్ణుని గూర్చి ముచ్చటించునప్పుడు "మీ కందఱకును శ్రీ రామకృష్ణుని చరణ కమలములయందు భక్తివిశ్వాసము లుదయించుగాక. నేను తుచ్ఛుఁడను. నే నెందులకును బనికిరాని యధముఁడ" నని యాతఁ డెఱుఁగును. కాని యాతఁడు ప్రేమప్రపూర్ణుఁడగుటచే సన్నాతని ప్రేమవార్ధియందు

ముంచె" ననెను. పిదప "జయరామకృష్ణ, జయరామకృష్ణ" యనుచు నమస్కరించెను.

మఱునాఁడు మహాశయునికిఁ బితృశ్రాద్ధకర్మలకై యప్పిచ్చిన యుత్తఁడు అతనిఁ జూచుటకై వచ్చెను. మహాశయు లతనికి నమస్కరించి "యయ్యా నీయప్పులఁ దీర్చలేకయున్నందుల కెంతయు విచారించు చున్నాను. నీ యుదారస్వభావము మూలముననే నాతండ్రి కంత్యక్రియలఁ జేయఁగల్గితిని. కాని నీధనము విషయమై యాతురతఁ జెంద నవసరము లేదు. నేను చనిపోయిన తరువాత నీ గృహమును నీ యధీనము జేసి కొనుము. నాభార్య పుట్టినింట నుండు" ననెను. ఇది విని యాతఁడు మిగుల ఖేదించి "అయ్యా! అప్పు విషయమై విచారింపకుఁడు. నే నప్పు కొఱకు రాలేదు. మిమ్ముఁ జూచుటకు వచ్చితి" ననెను. "ఇది యం తయు దేవదేవుని దయ" యని మహాశయులు కొంతవఱకుఁ గండ్లు మూసి కొని యుండెను.

ఈ సత్పురుషుఁడు వెడలిపోయిన మూఁడు గంటలకు మహాశయుని యం దొక వింతయగు మార్పు గల్గెను. ప్రక్కమీఁద నుండలేక ఇటు నటు పొరలుచు సంధిలో అప్రసక్తముగ మాటాడఁ జొచ్చెను. చుట్టు ప్రక్కలంతయుఁ జలిగా నుండెను. అయినను ఎంతసేపు విసరినను వేడి తగ్గలేదు. అతఁడు "ప్రక్కనుండి లేవవలెనని యున్న" దనెను. అందు వలన లేవఁదీసి కూర్చుండఁబెట్టిరి, కాని తత్క్షణమే మరలఁ బరుండఁబెట్ట వలసివచ్చెను. మరలఁ గొంతసేపటివఱకు నిశ్శబ్దముగ నుండి మరల సంధిలో మాటలాడఁజొచ్చెను. ఇంతలో హఠాత్తుగ "రక్షింపుఁడు రక్షిం పుఁడు" అని యఱచెను. శరత్కామిని యేడ్చుచు "నీవేకాదా నీయంత్య సమయమున నెట్టి సంధికిని లోఁబడనని చెప్పియుంటివి? మఱి యిట్లేందు లకుఁ గలవరపడుచున్నా" వనెను. పిదప నొక గంటకుఁ దెలివి వచ్చి నిద్రఁజెందెను.

ఈ హఠాత్సంధిని గూర్చి చక్రవర్తితో వివేకానందుఁ డిట్లనెను: "ఆ సమయమున నాతని బహిఃప్రకృతిని మాత్రమే చూచితివి కాని

లోపల నేమి జరుగుచుండెనో తెలియవైతివి. అప్పుడాతఁడు లోపల పూర్తిగఁ దెలివిగలిగియే యుండెను. మనుష్యస్వరూపమున నుండి మనుష్య స్వాభావికములగు బాధల నందకున్నచో నాతఁడు మనుష్యమాత్రుఁడని చెప్ప వీలుకాదు. ఇట్లే ఇతర ముక్తపురుషులయందు ఎందఱియందో చూచియున్నాము. జీవన్ముక్తుఁడగు మహాశయునియం దిదియొక లోప ముగ ఎన్నఁదగినదికాదు. మఱియు నాతఁ డెట్టి యవస్థయందుండి యట్లు 'రక్షింపుమని' కేకలిడెనో చెప్పఁజాలము. ఈ శరీరమునుండి త్వరలో విముక్తుఁడై యాత్మైక్యసంధానము పొందుటకొఱకు కేకలిడి యుండ వచ్చును". ఈ విషయముననే శ్రీయుత గిరీశచంద్ర ఘోషిట్లు తన యభిప్రాయము దెల్పెను: "శ్రీ రామకృష్ణుని శిష్యులలో నెవ్వరును గైవల్యముక్తికొఱ కపేక్షింపరు. ఒకవేళ అట్లపేక్షించినను నిర్వాణముక్తి నందఁజాలరు. ఎందువలన నన 'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' యను గీతావాక్యము ప్రకార మీ జగత్తు నధర్మమునుండి రక్షించి ధర్మసంస్థాపనము చేయుటకు మాటిమాటికి భగవంతుఁ డవతార మెత్తు చుండవలయును. ఆతనితో నీ సిద్ధపురుషులుగూడ మనుష్యస్వరూపమున వచ్చుచుండ వలయును. నాగమహాశయునికిఁ బ్రపంచమున నేమాత్రమును ధ్యానము లేకపోయినను మాయను సంపూర్ణముగ జయించినవాఁ డయినను వాను మరల నిచ్చటికి వచ్చి శ్రీ దేవదేవుని లీలయందుఁ బాల్గొనుటకై ఈ కోలఁది ఇచ్ఛతో శరీరమును విడచెను."

ఎట్లైనను బ్రాణము పోవువఱకు నతనికి మరల ఇట్టి సంధి రాలేదు.

ఇఁక మూఁడుదినములకుఁ జనిపోవుననఁగా మహాశయుఁడు చక్ర వర్తిని బిలిచి పంచాంగముఁ జూచి "ప్రయాణమునకు మంచి ముహూర్త మేర్పఱుపు" మనెను. పాపము చక్రవర్తి యిది కడపటి ప్రయాణ మని యెఱుఁగఁడు. అమాయికముగ "పుష్య త్రయోదశినాఁడు ప్రొద్దున పది గంటలకుఁ బ్రయాణమునకు బాగున్న" దనెను. మహాశయుఁ డంతఁ "జక్రవర్తీ! నీ సెలవైనచో నాదినమున నా కడపటి ప్రయాణము సాగిం తు"ననెను. పాపము చక్రవర్తి స్తబ్ధుఁడై కొంతవడికిఁ దెలివిఁ దెచ్చు

కొని శరత్స్వామితో నీసంగతి నంతయుఁ జెప్పెను. పిదప నామె "నాయనా! యిఁక నాయనకై విచారించుటవలన లాభములేదు; మఱి యెంతోకాలము జీవింపడు. ఆయన యిష్టమే జరుగుఁగాక. శ్రీ రామ కృష్ణుని సంకల్పమే నెఱవేఱుగాక" యనెను.

మరణమునకు రెండు దినములకుఁ బూర్వము శరత్స్వామిని, చక్ర వర్తి, మఱి యింకొక భక్తుఁడును శయ్యయొద్దఁ గూర్చొనియుండిరి. మహా శయుఁడు కండ్లుమూసికొని పరుండియుండెను. హఠాత్తుగఁ గండ్లు తెఱచి "శ్రీ రామకృష్ణుఁడు తీర్థయాత్రా స్థలములను నాకుఁ జూపింప నిఁట కేతెంచినాఁడు. చక్రవర్తీ! పుణ్యస్థలములఁ గొన్నిఁటినిఁ బేర్కొనుము. నేను వానిని జూచెద"ననెను. ఈతని రోగమునకుఁ గొలఁది దినములకుఁ బూర్వమే చక్రవర్తి హరిద్వారమునకుఁ బోయియుంటచే హరిద్వారముఁ బేర్కొనెను. అంత మహాశయుఁ డుద్రేక పూరితమగు కంఠమున "హరి ద్వారము, హరిద్వారము, అదిగో గంగామతల్లి హిమాలయములనుండి మర్మరధ్వనులతో వచ్చుచున్నది. ఆ తీరములనున్న వృక్షములు తరంగ ముల ననుకరించుచున్నవా యనునట్లు నాట్యముచేయుచున్నవి. చూడు మా వైపున చాందీపర్వత మున్నది. ఆహా! ఎట్టి మనోహరమగు ఘట్టము! స్నానమాడుట కెంత సుందరముగ నున్నది. నదీ గర్భమునుండి తీరము వఱకు నొకదానిపై నొకటి మెట్లు కట్టబడి యున్నవి. దయుయుంచి ఒక్క నిమిష మాగుము. ఈ యిరువది సంవత్సరములలో నొకనాఁడైన నిచట స్నానము చేయలేదు. ఈ పవిత్ర తీర్థముల నొక్క మునుక వైచి నాజన్మ మును ధరింపఁజేసికొననిమ్ము" అనెను. పిదప "ఓ గంగాభవానీ! అధః పతితోద్ధారిణీ! పాపప్రహారిణీ!" యని కేకలిడుచు సమాధిచెందెను. మరల స్మృతివచ్చిన తరువాత నాతనిఁజూడగా నప్పుడే స్నానము చేసినవాని వలె నుండెను.

తరువాత చక్రవర్తి ప్రయాగక్షేత్రముఁ బేర్కొనెను. అంత నమ స్కరించి "యమునాదేవీ! జయము గంగామతల్లీ! జయము! ఇచ్చటెచ్చ టనో భరద్వాజాశ్రమ ముండవలయునే. అది నాకిప్పుడు కాన్పింపదేమి?

అదిగో గంగా యమునా సంగమము, అదిగో అప్రక్క పర్వతపంక్తి. అయ్యో తాకూరు నాకు భరద్వాజాశ్రమము చూపలేదు'' అని సమాధిం జెందెను. అంతఁ గొన్ని నిమిషముల యనంతరము "ఇదిగో కన్పడు చున్నవి". మరలఁ గొంచెముసేపాగి "అమ్మా నీవు రాజరాజేశ్వరివి. నీవు సహజశక్తి స్వరూపిణివి. ఏమమ్మా నీవిట్లు తిరుగుచుంటివి? శ్రీ రామా జయము జయ"మని మరల సమాధిని మునిఁగెను. మరల స్మృతి వచ్చిన తరువాత సాగరతీర్థనామము పేర్కొనఁబడఁగా నాగమహాశయుఁడు సగరవంశోద్ధరణమును బ్రత్యక్షముగఁ గాంచెను. సముద్రమును దర్శించి మరల మరల నమస్కరింపసాగెను. అనంతరము సురేశుఁడు కాశీక్షేత్ర ముం బేర్కొనెను. తోడనే "శివభగవానుఁడా! జయము. జగద్భర్తకు మంగళ మగుగాక. హరహర మహాదేవ శంభో" యనుచు "ఈ మారీ మహాత్మునియందు లీనమగుదు" ననెను. పిదప పూరీ, శ్రీ జగన్నాథ క్షేత్రములం బేర్కొనిరి. అంత మహాశయుఁడు "అల్లదిగో దేవదేవుని మందిరము. అప్రక్క స్వామి ప్రసాదమును విక్రయించు ఆనందబజా రదిగో''. తరువాత నాలుగైదు మాఱులు శ్రీ చైతన్యనామ స్మరణము గూడఁ జేసెను. అప్పటికి రాత్రి 4 గంటలయ్యెను. నిద్రమత్తు వచ్చు టచే నిద్రించెను. మరల ప్రాతఃకాలమున నెనిమిది గంటలకు మేల్కొ నెను. పుష్య త్రయోదశి వచ్చెను. చక్రవర్తి బిగ్గరగ శ్రీరామకృష్ణనామ ముచ్చరించుచు ఆయన చిత్తరువు నెదురుగఁబెట్టి "ఇదిగో ఎవరి నామము నుచ్చరించుచు సర్వమును త్యజించి సన్న్యాసిజీవనమట్లు గడపితివో ఆ నీ గురువర్యుని చిత్ర మిదిగో" యనియెను. మహాశయుఁడు దాని వైపునకుఁ జూచి నమస్కరించి క్షీణస్వరమున "కటాక్షము కటాక్షము. నీయనంతమగు ప్రేమసాగరమునుండి వెలువడిన ప్రేమ" యనెను. ఇవియే యాత డంత్యసమయమున నుచ్చరించిన వాక్కులు. ఇవియే యాతని తుదిపల్కులు.

సరిగాఁ దొమ్మిదిగంట లగుసరికి నంత్య చిహ్నములు గన్పట్టెను. కండ్లు కొంచె మెఱుపువారెను. ఏదియో మంత్రములఁ జదువుచున్నట్లు పెదవు లదర నారంభించెను. పిదప నొక యఱగంటకు దృష్టి నాసికా

గ్రమున స్థాపితమయ్యెను. రోమాంచితమయ్యెను. కండ్ల నానందాశ్రువులు నిండెను. పదిగంటల యైదు నిమిషములకు మహాసమాధిలో మునిఁగెను. శరత్కుమారి యాజ్ఞపై నాతని శుభ్రవస్త్రాచ్ఛాదన మగు నొకపఱుపుపైఁ బరుండఁబెట్టిరి. అంతపఱకును బ్రాణము పూర్తిగ బహిర్గతము కాలేదు. వెలుపలకుఁ దీసికొనివచ్చిన యైదారు నిమిషముల వఱకును బ్రాణముపోలేదు. ఇప్పు డంతయు సమాప్తమైనది. ఈ జగన్నాటకమునుండి యొక యపూర్వ నటకాపతంసి తన పాత్రము ముగియగాఁ దెరచాటునకుఁ బోయెను. అప్పుడుకూడ నాతనిముఖము తేజఃపుంజమై యొప్పెను. సగము మూసిన యాతని కనుకొలఁకుల నింకను ప్రేమాశ్రువు లొకటి రెండుండెను. భక్తుల ఏడ్పులు మిన్నుముట్టినవి. చక్రవర్తి శరత్కుమారినిఁజూచి "యమ్మా! ఊరడిల్లుము. పిచ్చిదానవు గాకుము, నీభార మాయన మాపైఁ బడవైచెను. నిన్ను సంరంక్షించుటకు మీ బిడ్డలము మేమున్నార" మనెను. శోకముయొక్క ప్రథమ ఆవేగము కొంచె మఱఁగెను. పిదప నామె యనుజ్ఞపై నొక భక్తుఁ డంగడినుండి నేయి, చందనపుఁ గట్టెలు మొదలగు నుత్తరక్రియలకు వలయు సామగ్రిని దెచ్చుటకుఁ బోయెను.

అనుభవజ్ఞులగు నూరివార లా శవమును బరీక్షించి యింకను వేచి యుండవలయునా యను సందియము వచ్చెను. అంతఁ జక్రవర్తి "యయ్యా! నాగమహాశయునివంటి యోగీశ్వరుని శరీరము దహనము చేయుట కింత తొందరపడఁగూడదు. చనిపోయెనని యనుకొన్న తరువాత నధమము పండ్రెండు గంటలయినను వేచి యుండవలయు" ననెను. అందువలన రాత్రి పదిగంటలవఱకు వేచియుండుటకు నిశ్చయించిరి.

మహాశయుని శిష్యు లాతని ఛాయాచిత్రము (ఫోటో)ను దీయుట కుద్యమించిరి. అతఁడు బ్రదికియున్నప్పు డెన్నిమాఱులో కోరిరి కాని యాతఁ "డీ యస్థిపంజరముయొక్క చిత్తరువుకొఱ కెందుల కింత యాతురపడెదరు?" అని వారల నిరుత్సాహపఱచువాఁడు. ఇప్పుడు మంచి గంధము పూసి ఛాయాచిత్రమును దీసిరి. ఈ చిత్రమునుండియే ప్రియ

నాథసింహ యను నాతఁడు తైలచిత్రము (Oil Painting)ను వ్రాసెను. అది యిప్పటికిని మహాశయుల గృహము నలంకరించుచున్నది.

సంధ్యాత్పూర్వము శరత్కామిని భర్త పాదములను, బిల్వదళములచేతను బూలచేతను బూజించెను. పిదప నా మృతకళేబరము చుట్టు నేడుమార్లు ప్రదక్షిణము సల్పి పొడవగు తన శిరోజములచే నాతని పాదములఁ దుడిచెను. అనంతర మాతని కళేబర మలంకరింపఁబడెను.

మహాశయుని మరణవార్త యూరంతయుఁ బ్రాకెను. ఊరిలోనున్న యాబాలగోపాలము కడపటిసారి యీ యోగీశ్వరుని దర్శించుటకు వచ్చిరి. ఆ గ్రామమం దా దినమునఁ బ్రతి గృహమందునను హాహాకారములు మిన్నుముట్టెను.

రాత్రి పదిగంట లగునరికి గంధపుఁజెక్కలతోఁ జితి యేర్పఱుపఁబడెను. విధ్యుక్తక్రియల జరిపినతరువాతఁ జితికి అగ్ని నంటింపఁ బడెను. చక్రవర్తి చితిపై బిల్వదళముల వేయుచు వ్యాహృతిహోమమును జేసెను. ఈలోపున శారదానందస్వామి వచ్చి చితిముందు సాష్టాంగపడెను. మూఁడు గంటలలో దహనమైపోయెను. శరత్కామిని చితి నార్పెను. భక్తు లా బూడిదను ముట్టి ధన్యులమైతిమని తలఁచిరి. ఇట్లు తండ్రి గతించిన మూఁడు సంవత్సరములకుఁ దన నలువదినాల్గవ సంవత్సరమునఁ దన జన్మస్థానమున స్వగృహమున నాగమహాశయుని భౌతిక శరీరము అదృశ్యమయ్యెను. బూడిదమాత్రమే మిగిలినది.

తరువాత శారదానందుని యాజ్ఞప్రకార మాతనిచే రచింపఁబడిన యొక కీర్తనమును, ఈ బూడిదను ఒక పాత్రలో నుంచి యా శ్మశానవాటికలోఁ బూడ్చిరి. దానిపై నాతఁ డంత్యసమయమున నారాధించిన కాళికా విగ్రహమును బ్రతిష్ఠించి దానిపై నొక సుందరమగు నాలయమును నిర్మించిరి.

అతని యప్పులనుగూర్చి, తగు నేర్పాటులను గావించి శారదానంద స్వామి ఢక్కాకుఁ బోయెను.

# పరిశిష్టము

నాగమహాశయులచే విరచితములయిన కొన్ని గీతలు :—

౧

గిరివర! ఆర్ కొబె జాబె ఉమారె అనితే కైలాసభవనే।
నా హేరియా బిధుముఖ హృదయే దారుణ దుఃఖ,
కొతొ ఆర్ సహిబొ జీవనే॥
శునియా శిబేర్‌రీతి, హృదయే ఉపజే భీతి,
భూత ప్రేత సఙ్గే సాథీ, థాకే నాకి శ్మశానే॥
కి కొబొ తాహర్ గుణ్, కపాలే జ్వలే అగున్,
సిద్ధితే బడొ నిపుణ్, అపన్ పర్ నా జానే॥
దీన అకించనే భాషే, తుష్ట కొరి ఆశుతోషే
అనహ ప్రాణేర్ గౌరీ, నైలే మొరిబొ పరాణే॥

ఓ హిమవంతుఁడా! ఉమాదేవిని కైలాసమునుండి కొనివచ్చుట కెన్నఁడు పోవుదువు. ఆమెయొక్క వియోగమువలన దుఃఖము నిఁక భరింప లేవు. ఇఁక నెంతకాల మిట్లు జీవింతువు? నీ యల్లుఁడైన శివుని రీతి విని హృదయము తల్లడపడుచున్నది. భూత ప్రేతములతో సఖ్యము గలిగి దిగంబరియై శ్మశానమున నుండును. అతని గుణముల నెన్నిచెప్పఁగలను? హస్తమునందు కపాలము. అందు జ్వలించుచున్న యగ్ని. సిద్ధులయందు మిక్కిలి నిపుణుఁడే కాని తన గమ్యస్థాన మెఱుఁగఁడు. నేనేమి చెప్పఁ గలను? దీనుఁడను. భాషాజ్ఞాన మత్యల్పము, అల్పసంతోషిని. ఏమి స్తుతింపఁగలను? గౌరీదేవి ఈతని నడవడిఁ జూచి మూర్ఛిల్లినదో లేక చని పోయినదో చూచిరమ్ము.

౨

(కాళీ) ఆమి దినే దినే క్షుణ్ణమొనే
భవజ్వాలాయ్ జ్వలే మొరి!
దయా కొరొ నిజ గుణే ఆర్ జే జ్వాలా సయితే నారి॥

ఎఖొన్ దెఖా దిబె కి నా యి, కి కొరిబె బొలో తాయి !
దీనే దర్శన్ చాయి, దోహాయి లాగె త్రిపురారీ ॥

శక్తి భక్తి కిచ్చుయి నాయి, నిజగుణె దేఖచాయి
అకించనే దేహ తాయి, శ్రీచరణే దయాకొరి.

కాళీ! నేను దినదినమును ఖిన్నమనస్కుఁడనై సంసారాగ్నిం బడి మరణించుచున్నాను. నీ సహజ దయావీక్షణముల నన్నుఁ జూడుము. లేకున్న సహింపలేను. తల్లీ! ఏమి చేయుదునో చెప్పుము. దీనుఁడను. నీ దర్శనమే యపేక్షించుచున్నాను. త్రిపురారీ! నాకు నీ కరావలంబన మొసఁగుము. శక్తిగాని భక్తిగాని నా కావంతయు లేదు. నీ సహజగుణము చేతనే నన్ను దయఁజూచి యుద్ధరింపుము. తుచ్ఛమగు ఈ శరీరమును నీ మంగళచరణముల నుంచఁగోరుదును. కటాక్షింపుము.

## 3

కాళి కొథాగో తారిణీ, త్రిగుణధారిణీ
కైలాసవాసినీ, హరమనోరమా, హరమనొమోహినీ
కృపాకరొ మా దీనే, పుణ్యహీనంచ జనే,
స్వగుణే నిస్తారకారిణీ;
అపరా జన్మహరా, భక్తిముక్తిదాయినీ,
తారా బ్రహ్మమయీ పరాత్పరా, వాంఛాతీతి - ప్రదాయినీ ॥
(ఒగోమా)కే జానే తొమార్, మహిమా అపార్
అనన్త గుణాధార్, అవ్యక్త అచింత్యరూపిణీ।
కొతొ యోగీ ఋషి యోగాసనే, దివానిశి ఏకమొనే
భావియే నా పాయ్ ధ్యానే, నిఖిల - బ్రహ్మాండ - జననీ ॥
అమి దీన, జ్ఞానహీన, క్రియాహీన, భజనవిహీన
కి జాని మాహాత్మ్య, నిజగుణే త్రాణ్ కరొ దియే చరణతరణీ ॥

కాళీ! త్రిగుణధారిణీ, కైలాసవాసినీ, హరమనోహారిణీ! హర మనో మోహినీ, స్వర్గతారిణీ, జన్మనిర్మూలినీ, భక్తిముక్తి దాయినీ, దుర్గా, బ్రహ్మ

మయా, పరాత్పరీ, వాంఛాతీత ప్రదాయినీ ఎచ్చట నుంటివమ్మా ? పుణ్య హీనుఁడగు ఈ దీనునిపై నీ కృపామృతమును వర్షింపుము. ఓ జననీ! నీ యపారమగు మహిమ నెవ్వఁ డెఱుంగఁగలఁడు ? అనంత గుణధారిణివి, అవ్యక్త అంచిత్యరూపిణివి. ఎందఱో యోగులును, ఋషులు యోగాసన ములం దుపవిష్టులై, రాత్రిందివము లేకాగ్రచిత్తములతో భావించి భావించి నిఖిల బ్రహ్మాండ జననివగు నిన్ను ధ్యానమునఁ గన్గొనలేక యున్నారు గదా! నేను దీనుఁడను, జ్ఞానరహితుఁడను, క్రియాహీనుఁడను, భజన విహీనుఁడను. నీ మాహాత్మ్య మేమెఱుంగఁగలను ? నీ నైజగుణములచేతనే నన్నుఁ దరింపఁజేయుము.

౪

(ఒగో) శ్యామా మా అమార్—
కేవల్ ముఖేర్ కొథా హొలో సార్
తుమి జే అమార్ సర్వస్వ ధన్,
తా తొ అన్తరేర్ సహిత్ భావినా ఏక్‌బార్ ॥
మొనే కొరి ఛాడి విషయవాసనా,
సార్ కొరి తవ నామ ఉపాసనా,
కిన్తు కర్మఫెరే కిఛ్ఛు మా హొలో నా,
నిజగుణే ఏబే కొరొ మా నిస్తార్ ॥
మనేరే బుఝాయి జతొ, కిఛ్ఛుతే నా హొయ్ నత
అకిఞ్చన పదాశ్రిత, యన్త్రణా సహె నా ఆర్.

ఓ శ్యామజననీ! నా ముఖమున నీ గుణగానమే యొప్పుచున్నది. నా సర్వస్వ ధనమవగు నిన్నే అంతరంగమున భావించుకొనుచున్నాను. మనస్సునందలి విషయవాసనను విసర్జించి నీ నామోపాసనమే చేయు చున్నాను. కాని కర్మమాత్రము మాఱినది కాదు. దయఁగొని నీ మంగళే చ్ఛచే నన్నుద్ధరింపుము. మనస్సున నెంత తెలిసికొంటినో దానికిఁ గొంచె

మైనను వినీతుండ నగుటలేదు. అల్పుండను. నీ చరణములనే ఆశ్రయించుకొన్నాను. ఇంక నీ బాధను సహింపలేను.

ౘ

అజి ఏకి హేరి శుత అపరూపదర్శన్।
ధరాయ్ అసిలేన్ మా, కరుణామయీ,
కరిపృష్ఠే కరి ఆరోహణ్॥

తప్త-కాంచన-వరణీ, హాస్యయుతా త్రినయనీ,
వదనే ఝులొకే కొతొ బెశేర్ మణి,
గలే హార్ గజముక్తా రక్తవస్త్ర పరిధాన్॥

నానా అలంకార భూషిత, రూపే త్రిజగత్మోహిత,
దశభుజే సుశోభిత
ఆయుధ తస్త్రే శంఖ చక్ర ధనుర్బాణ్॥

అమల-కమల-దల, నిన్దిత-చరణ-తల,
కిబా తాయ్ సునిర్మల,
నఖర్ ఛలే ప్రకాశే సిత శశీ సుశోభన్॥

దివానిశి ఒరూప్ హేరి, బాల యువ ఆది కొరి,
జతొ సబ్ నరనారీ,
పాశొరిలొ శోక దుఃఖ సబే పులకితమన్॥

భావే చిత గద్గద్, దియే జవా కోకొనదొ,
పూజే మాయేర్ అభయ పద్,
అతుల శోభా సమ్పద యోగిగణేర్ హృదయధన్॥

కలుష నాశియే తారా,
పుణ్యస్రోతే భాసాలే ధరా,
అకిఞ్చనే దియే ధరా,
దహి ఒ రాఙ్గా చరణ్॥

అమ్మా! నేఁడిట్టి యపురూప వేషమును ధరించి వచ్చితివేమి? మదగజము వాహనము, తప్తకాంచన దేహము, హాస్యయుత వచనము, త్రినయనములు, వదనమునఁ బ్రకాశించుచున్న బేసరిమణి, కంఠమున ముత్యాలహారము, రక్తవస్త్రము పరిధానము. ఆహా! నానాలంకార భూషితవు. త్రిజగన్మోహన రూపధారిణివి. దశభుజములచే విరాజిల్లుచున్నావు. శంఖచక్ర ధనుర్బాణాదికముల ధరించియున్నావు. పద్మములను ధిక్కరించు చరణయుగ్మము. ఆహా! ఎట్టి నిర్మలరూపము! నఖములు శుభ్ర చంద్రికలతో నెకసక్కెము లాడుచున్నవి! అమ్మా! ఎల్లప్పు డీ రూపమునే ధరించి స్త్రీలను, పురుషులను, బాలురను వృద్ధులను అందఱను శోకదుఃఖములచేఁ బులకింపఁ జేయుచున్నావు గదా!

అతుల శోభాసంపదలను, యోగిగణ హృదయధనమును అభయప్రదములు అగు నీ పాదపద్మములను భావావేశమున గద్గదిక చెంది చెంగల్వలాది పుష్పములచేఁ బూజింతును. నీవు కలుషములను నశింపఁ జేసి పుణ్యస్రోతమున నీఁదులాడింపఁ జేతువుగదా! తల్లీ నాకు నీ చరణ కమలముల నాశ్రయ మొసంగుము.



PRINTED AT THE B. N. K. PRESS, LTD., MADRAS-26.

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

| | రూ. | అ. |
|---|---|---|
| శ్రీ రామకృష్ణ లీలామృతము | 5 | 0 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 3 | 8 |
| బ్రహ్మానంద బోధనలు | 3 | 8 |
| శ్రీమద్భగవద్గీత | 4 | 0 |
| శ్రీ వివేకానంద జీవితచరిత్ర క్యాలికో | 3 | 8 |
| ,, సాదా ప్రతి | 3 | 0 |
| జ్ఞానయోగము | 3 | 4 |
| నారద భక్తిసూత్రములు | 3 | 0 |
| ప్రబోధ రత్నాకరము | 2 | 4 |
| రాజయోగము | 2 | 4 |
| కర్మయోగము | 1 | 8 |
| భక్తియోగము | 1 | 4 |
| అనుష్ఠాన వేదాంతము | 1 | 4 |
| వివేక సూర్యోదయము | 1 | 0 |

| | రూ. | అ. |
|---|---|---|
| శ్రీ దొడ్డ భాగవతము (ప్రథమ సంపుటము) | 6 | 8 |
| ,, (ద్వితీయ ,, ) | 5 | 8 |
| ,, (తృతీయ ,, ) | 7 | 8 |
| ,, మూడును ఒకేపరి కొన్నచో | 18 | 8 |
| శ్రీ శారదాదేవి చరిత్ర | 2 | 0 |
| శ్రీ శారదా ప్రసంగములు | 2 | 8 |
| భారతీయ మహిళ | 1 | 0 |
| హిందూమతము | 1 | 4 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | 0 | 12 |
| గిరీశ చంద్ర | 0 | 12 |
| చికాగో నగరోపన్యాసములు | 0 | 8 |
| భక్తిమార్గము | 0 | 8 |
| గురూపదేశములు | 0 | 8 |

ఇవియేకాక ఎన్నియో తెలుగు గ్రంథములు, శ్రీ రామకృష్ణ ప్రభ (తెలుగు) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము) వేదాంత కేసరి (ఇంగ్లీషు) మాస పత్రికలును, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగువారి ఛాయా చిత్రములును గలవు. మా పూర్తి క్యాటలాగు ఉచితము.

ఇట్లు వ్రాయుడు :

మేనేజరు :

**శ్రీ రామకృష్ణ మఠము**

మైలాపూరు, మద్రాసు - 4

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 17 | 24 | రుద్రభూ | రుద్రభూమి |
| 21 | 14 | కషములందును | కష్టములందును |
| 38 | 27 | విష్ణ్వాలయముల | విష్ణ్వాలయమున |
| 47 | 10 | యథోగతియే | యధోగతియే |
| ,, | 27 | గృహస్థుఁడపేయై | గృహస్థుఁడవేయై |
| 49 | పాదదీపిక | పియభక్తుఁడు | ప్రియభక్తుఁడు |
| 50 | 22 | దఋవాత | దరువాత |
| 52 | 3 | యేడ్పుచు | యేడ్చుచు |
| 55 | 21 | ఆది | అది |
| 56 | 16 | డాతని | డాయన |
| 78 | 3 | నప్సుడు | నప్పుడు |
| ,, | 6 | మధుకరత్వం | మధుకర త్వం |
| 79 | 3 | సుఖధాయకమై | సుఖదాయకమై |
| ,, | 6 | యుచ్ఛస్తితికి | యుచ్చస్థితికి |
| 89 | 4 | అసంభవము” అనెను. | అసంభవము.” |
| 112 | 3 | సత్సంగతియబ్బి | సత్సంగత మబ్బి |
| 121 | 23 | “నీవే కాదా నీ | “మీరే కాదా మీ |
| ,, | 24 | చెప్పియుంటివి | చెప్పియుంటిరి |
| ,, | 25 | వనెను | రనెను |
| 126 | 12 | అగ్నినంటింపఁబడెను. | అగ్ని యంటింపఁబడెను. |